# అంకితం

అడగగానే అనువదించటానికి
అనుమతినిచ్చి, సహకరించి
29–7–'63 న పరమపదించిన

త్రివేణికి

కన్నీటితో

శర్వాణి

"రమేశ్, కాలేజీకి టైమవుతుంది లేవరా బాబూ తరువాత ఊరికే హడావిడిచేస్తావు. కొంచెంతొందరగా లేస్తే అన్నీ నెమ్మదిగా చేసుకోవచ్చుగా. ఓ రమేశ్..."

శాంత రమేశుడి మంచందగ్గర నిలబడి అతడిని లేపే ప్రయత్నంలోఉంది. రమేశుడు నిండా దుప్పటికప్పుకుని పడుకున్నాడు. ముసుగులోనుండి కొంతఉంగరాల జుట్టుమాత్రం కనిపిస్తూంది.

శాంత ప్రయత్నం ఫలించలేదు.

"నాలుగేళ్లుగా మెడికల్ కాలేజీలో చదువుతున్నా, ఇంకా ఉదయం త్వరగా లేచే అలవాటు లేకపోతే ఎలా! సిగ్గు చేటు! నువ్వేం పసిపిల్లాడివా ఏం, రోజూ నిన్ను లేపటానికి? రేపటినుండి అసలు నిన్ను లేపనే లేపను..."

తన ఆఖరిమాట నిజంకాదని ఆమెకే తెలుసు. ఆమెకే ఏమిటి, రమేశుడికికూడా తెలుసు. రమేశ్ మెడికల్ కాలేజీలో చేరినప్పటినుండి శాంత రోజూ ఈ మాట చెప్పుతూనే ఉంది. కాని అతడిని లేపే బాధ్యత మాత్రం ఆమెదే. కావాలనే శాంత ఈ బాధ్యతను స్వీకరించింది. ఈ కార్యక్రమం ఆమెకెంత ప్రియమయిందో, వదిన మందలింపులు తిట్లు వింటూ లేవడం రమేశుడికీ అంతే ప్రియమయింది.

రమేశ్ మెడికల్ కాలేజీలోచేరాక రెండు సంవత్స

రాలకు హాస్పిటల్ - డ్యూటీ ప్రారంభమయింది. రమేశ్ ఇంటికి రాగానే:

"వదినా, రేపటినుండి నన్ను లేపే బాధ్యతమీదే" అని వదినమీద భారమంతా పడవేసి నిశ్చింతగా ఉండిపోయాడు. అప్పటినుండి శాంత ఒక్కరోజుకూడా విసుక్కోకుండా అతణ్ణి లేపేది.

"ఆరు - గంటలకల్లా లేపకండి. ఆరుంబావుకు సరిగ్గా లేపండి. తరువాత ఆరు గంటలకే లేపి, నా నిద్ర పాడుచేస్తే ఊరుకోను" అని ఖచ్చితంగా చెప్పిఉంచాడు రమేశ్.

ఆరు-గంటలు కాగానే రమేశుడి గదిముందునిల్చుని కర్టెన్ పక్కకుజరిపి చూసేది.

"పాపం, నిద్రపోతున్నాడు. మరికొంతసేపు పడుకోనీ" అనుకుంటూ వెళ్ళిపోయేది. ఆరూ ఐదు నిమిషాలకు మళ్ళీ కిటికీ తలుపులు తెరచిమెల్లిగా 'రమేశ్' అని పిలిచి వెళ్ళిపోయేది. ఆరూ పదికి మళ్ళీవచ్చి ఈమారు నిజంగానే లేపడం మొదలెట్టేది. ఎన్నోమార్లు మేలుకునే వదిననుఏడిపించే ఉద్దేశ్యంతో లేవకుండా పడుకునేవాడు రమేశ్. వదిన చేతి గాజుల చప్పుడుకే అతడికి మెళకువ వచ్చినా, ఆమెచేత తిట్టించుకోవడము, బ్రతిమాలించుకోవడం కోసమే ఆరుంబావువరకూ మెదలకుండా పడుకునేవాడు.

ఈ రోజూ అలాగే కదలకుండా పడుకున్నాడు. కాని తన దొంగ - నిద్రకు తనకే నవ్వొస్తోంది.

"ఇకమీదట నిజంగా నిన్ను లేపను. ఇంతటి బద్ధకస్తుడు మెడికల్ కాలేజీలో ఎందుకు చేరాలసలు ? నీకేం నిశ్చింతగా

ఉన్నావు. నువ్వు ఫేలయితే మాట వచ్చేది నాకేగా! ఇకమీదట నాకూ, నీ చదువుకూ ఏమీ సంబంధం లేదు. చెబుతున్నా మరి. ఇహ నీ యిష్టం. మీ అమ్మా, నాన్నా, అన్నయ్య వాళ్ళిష్టం ఎవ్వరికి లేంది నేను మాత్రం ఎందుకు నా తల సగలకొట్టుకోవాలి ? మొదటిలా చిన్న కుర్రాడివయినా అయితే తన్ని లేప వచ్చు. నాకంటె రెండింతలు పొడుగ్గా పెరిగి నిల్చున్నావు..."

మంచంమీద మనిషి కదలటంతో శాంత వాక్ప్రవాహం ఆగింది.

"అమ్మయ్య ఇప్పటికయినా లేచావుకదా, నువ్వు మెడిసిన్ పాసయితే నా భుజంమీది బరువు దించినట్టవుతుంది. ఆ రోజు హనుమంతుడికి ఓ కొబ్బరికాయ కొడతాను."

"ఏ హనుమంతుడు" అంటూ లేచి కూర్చున్నాడు రమేశ్.

"ఏ హనుమంతుడు ? రాముడికొడుకు హనుమంతుడేనా ?" అన్నాడు.

"కొడుకుకాదు, సేవకుడు" అని దిద్దింది శాంత.

ఇంకా గంట ఆరుకూడా కాలేదు. అప్పుడే నన్ను లేపేశావు అనవసరంగా" అని విసుక్కుంటూ గడియారంవేపు చూశాడు రమేశ్.

"చూడరా బాబూ, చక్కగా కళ్లు తెరచిచూడు. దేవుడు నీకు పెద్ద పెద్ద కళ్ళిచ్చాడు. బాగా ఉపయోగించు" అంది శాంత.

"రాత్రి తొందరగా పడుకుందామని ఇరవై నిమిషాలు ముందుకు పెట్టాను."

"నీ గడియారం చూసుకునేం లేపటంలేదు నేను. నా గడియారం వేరేఉంది."

"తమరి గడియారం ఏదో చెబుతారా, వదినగారూ ?"

"సూర్యుడికన్నా గడియారం కావాలా ఏం ? ఈ ప్రపంచంలోని గడియారాలన్నీ చెడిపోయినా నేను కరెక్టు టైం చెప్పగలను. అయినా మీ అన్నయ్య నాకు గడియారం కొని పెట్టనంత మాత్రాన నాకు టైం తెలీక పోతుందనుకున్నావా?"

"అనవసరంగా అన్నయ్య నంటారెందుకు వదినా ? అన్నయ్య ఇనప్పెట్టె తాళంచెవులు ఎవరిదగ్గరున్నాయో నాకు తెలుసు."

"తాళంచెవులు ఉంటే వచ్చిందా భాగ్యం ? ఈనెలలో ప్యాంటు. వచ్చే నెలలో కోటు, మరో నెలలో ఇంకోటి. . .ఇలా చెప్తుంటే, నేను వాచి కొనుక్కున్నట్టేఉంది."

"ఈనెల మీకేమీలేదు, నేను దాచి కొనుక్కుంటా నంటే అన్నయ్య మిమ్మల్ని కొడతాడా ఏం ?"

"ఆఁ ఇహ అదొక్కటే తక్కువ. నువ్వు ఇక లే. కాఫీ చల్లారిపోతుంది. వేడిచేస్తే బావుండదు మరి. బ్రెడ్డు తింటావా, బిస్కట్లు ఇమ్మన్నావా ?"

"రెండూ! వాటితోపాటు కొంచెం వెన్నకూడా."

"అమ్మ మళ్ళీ నన్ను అంటారు బాబూ, తెచ్చిన వెన్నంతా రెండు రోజుల్లోనే అయిపోయిందని. అమ్మకే టైసుకొట్టి వెన్న తీసుకో."

"మీకు ఇస్తారా లేదా చెప్పండి" అంటూ మంచందిగి నిల్చుని వళ్లు విరుచుకున్నాడు రమేశ్.

"సరే. త్వరగా రా" అంటూ వెళ్ళిపోయింది శాంత.

రమేశ్ తన పనులన్నీ ముగించుకుని కాలేజీకి వెళ్ళడానికి సిద్ధమై గుమ్మందగ్గర కొచ్చాడు.

బూటు – శబ్దంవిని, శాంత గాజుపళ్ళెంలో బ్రెడ్డు, బిస్కట్లు, వెన్న పెట్టి రమేశుకి కిచ్చింది. అతడు నిల్చునే తిన బోతుంటే;

"కూర్చుని తినరా బాబూ" అంది.

"వీల్లేదు, టైమయిపోయింది."

ఊరికే నన్ను ఆక్షేపిస్తావుగాని, ఎప్పుడనగా లేపాను నిన్ను. ఇప్పుడు టైమయిపోతుందని రాగం తీస్తున్నావా? నిల్చుని తినటం మంచిది కాదబ్బాయ్?"

"అలాగని ఏ పుస్తకంలోనూ రాసిలేదు మరి."

"దానికి పుస్తక మెందుకోయ్? నన్నడుగు చెపుతాను. అలా నిల్చుని గబగబా తినటం వంటికి మంచిదికాదు."

"ఆడవాళ్లు ఎక్కువగా మాట్లాడటం ఏమంత మంచిది కాదు" అంటూ రమేశ్ కాఫీ ఒక్క గుక్కలో తాగేసి తొందరగా బయటికి వెళ్ళిపోయాడు. ఇంకో నిముషంలో అతడి సైకిల్ రోడ్డు మలుపుతిరిగి మాయమయింది.

అతడు ఇంకొక్క నిముషం అక్కడ నిలబడి శాంత మొహం చూసిఉంటే, తనమాటతో ఆమెనెంత బాధపెట్టాడో తెలిసేది. సుమారు పన్నెండేళ్ళుగా అతని స్వభావంతో పరిచయం ఉన్నా, ఎన్నోసార్లు అతడి దుడుకు మాటలకు శాంత చిన్నబుచ్చుకునేది.

రమేశునిది నిర్మల - హృదయం. అందులో తనను కించ పర్చాలనే భావం ఏమాత్రం లేదను విషయం శాంతకు తెలు సును. కాని అతడి మరుసుతనంవల్ల, ఆ మాటల తీక్షణతను తట్టుకోవటం సూక్ష్మమతియైన శాంతకు కష్టమనిపించింది.

చేదు-మాత్రను శాంతచేత మింగించి, రమేశుడు వెళ్ళి పోయాడు. ఇహ మళ్లీ అతనురావటం సాయంకాలం ఐదు గంటలకే. అప్పుడుకూడా హడావిడిగా కాఫీ, టిఫిన్ తీసుకోగానే స్నేహితులతో షికారుకు వెళ్ళిపోయేవాడు. ఇక మళ్లీ దర్శనం రాత్రి ఎనిమిది దాటాకనే రాత్రిభోజన సమయంలో మళ్ళా వదినా, మరుదుల మధ్య మాటామంతి, జ[illegible] - అన్నీ మళ్లీ ప్రారంభ మయ్యేవి.

రమేశ్ వెళ్ళిపోయాక ఎంతోసేపు శాంత అలాగే నిలు చుని ఉండిపోయింది.

"నిజం, రమేశుడి మాటలు అక్షరాలా నిజం. తనకు ఈమధ్య మాటలు చాలా ఎక్కువయ్యాయి. పల్లెటూరినుండి వచ్చిన పిల్ల తను. తనకు ఎక్కువ చదువులేదు. మెడిసిన్ చదువుతున్న రమేశుడితో అంత ఎక్కువగా మాట్లాడటం తనదే తప్పు. ఈ రోజునుండి ఎంతో అంతలో ఉండాలి" అని నిశ్చయించుకుంది శాంత.

కడిగిన పాత్రలు తీసుకొని లోపలికి వస్తున్న సుశీలమ్మ గారు రాతిబొమ్మలా నిల్చున్న కోడల్ని చూసి;

"ఇంకా మడి-కట్టుకోలేదా శాంతా? కృష్ణుడికి ఆఫీసు టైమవుతోంది" అన్నారు.

శాంత తేరుకుని "ఇదుగో వెడుతున్నా" అంది.

"మొహం అలా ఉందేమిటి, వంట్లో బాగా లేదా?"

"ఏం లేదే! బాగానే ఉన్నాను."

"రమేశ్ ఏమన్నా అన్నడా?"

చిన్న కొడుకు; పెద్ద కోడలి స్వభావాలు ఆమెకు తెలి యనివి కావు.

రమేశుడి మొండితనాన్ని ఖండించి, అతడి స్వభావాన్ని మార్చటానికెంతో ప్రయత్నించి చివరికీ ఓటమిని అంగీకరించవలసివచ్చింది. శాంత సున్నిత హృదయమూ తెలుసు ఆమెకు. అత్తగారి ప్రశ్నకు "లేదు" అని మాత్రం బదులు చెప్పింది శాంత.

"వాడికి అంత చనువివ్వద్దని నీ కెన్నోమార్లు చెప్పాను. నువ్వు వినవు. వాడికీ పెద్దా, చిన్నా ఉండదు. ఇష్టమొచ్చినట్లా వాగుతాడు. నువ్వేమో చిన్నబుచ్చుకొంటావు..."

ఒక్క క్షణం క్రితమే రమేశుడి మొరటుతనానికి అతడి మీద కోపగించుకున్న శాంత రమేశుడిని వెనకేసుకొచ్చి;

"పాపం వాడేం అనలేదు. కాలేజికి టైమయిపోయిందని సరిగ్గా టిఫిన్ కూడా తినకుండా వెళ్ళిపోయాడు" అంది.

"వాడు తినకపోతే నువ్వు వదిలిపెడతావా" అంటూ లోపలికి వెళ్ళిపోయారావిడ.

శాంత మడికట్టుకుని వంట ప్రయత్నంలో పడింది. చేతులు వంకాయల్ని తరుగుతున్నా, మనసులో రమేశుడి మాటల్నే నెమరు వేసుకుంటోంది.

అత డన్నదీ నిజమే. స్వభావతః తను మితభాషి. స్నేహితులతో కలసి ఉన్నప్పుడుగాని, ఎక్కడైనాసరే, తను అంతగా

మాట్లాడేది కాదు. తను ఎక్కువగా మాట్లాడేదల్లా రమేశుడి తోనే. ఇకమీదట ఎంత అడిగితే అంతే సమాధానం చెప్పి ఊరుకోవాలి. తనంతట తానుగా పలకరించరాదు—

"శాంతా! పప్పు మాడిపోతున్నట్టుంది. వాసన వేస్తోంది; చూడు." అత్తగారి మాటలతో ఈ లోకంలోకి వచ్చిపడింది శాంత. తరిగిన కూరముక్కలు పప్పులో పడవేసింది.

తన మనసు ఎంత దుర్బలమైంది! రమేశుడి ఓ చిన్న మాటకు తనింత బాధపడాలా? అతడి చిన్నమాట తన మన శ్శాంతి నింత పాడుచెయ్యాలా?

కృష్ణమూర్తి భోజనానికి వచ్చేసరికి వంట పూర్తయింది. పది గంటలకు సరిగ్గా రమేశుడికి క్యారియర్ తీసుకుని వెళ్ళే కుర్రాడు వచ్చి, సైకిల్ బెల్ మోగించాడు. శాంత క్యారి యర్ తీసుకుని వెళ్ళి ఇచ్చి వచ్చింది.

కృష్ణమూర్తి భోజనానికి కూర్చున్నాడు. శాంత వడ్డి స్తోంది.

"శాంతా! పులుసులో ఉప్పే వేయలేదు. మరచిపో యావా?" అని కృష్ణమూర్తి అడిగినప్పుడు ఆకు – కొనలో నూరిన ఉప్పు వడ్డించింది.

"పాపం! రమేశ్ ఉప్పు లేకుండానే భోంచేయాలివాళ" అంది.

"నువ్వు ఊరగాయ పంపావుకదా? అదొక్కటుంటే చాలు; వాడి కింకేమీ అక్కర్లా" అన్నాడు కృష్ణమూర్తి.

"మీకు నచ్చకపోయినంత మాత్రాన ఊరగాయ ఇం కెవరూ తినరనుకున్నారా ఏం?" అంది శాంత.

"అన్నట్టు ఇవ్వాళ నువ్వూ, రమేశ్ దెబ్బలాడుకున్నారా ఏం?"

"ఛా, అదేమిటి అలా అడుగుతున్నారు?"

"ఆహా, పులుసులో ఉప్పు వెయ్యకపోతేనూ" అంటూ నవ్వాడు కృష్ణమూర్తి.

"మీ తమ్ముడితో దెబ్బలాడటం తప్ప నా కింకేం పని లేదనుకున్నారా ఏం?"

"నిజమే, నీ కింకేం పనుందో చెప్పు చూద్దాం" కొంటెగా అడిగాడు కృష్ణమూర్తి.

"ఆ తమ్ముడి అన్నతో కాపురం చేయటం మాత్రం ఏమంత సులువైన పనా ఏం?"

"అయ్యో పాపం!"

"ఆఫీసుకు టైమవుతోంది; తొందరగా లేవండి బాబూ."

కృష్ణమూర్తి ఆఫీసుకు వెళ్ళిపోయాక గది శుభ్రం చెయ్యసాగింది. అతడు వెళ్ళిపోయాక, ఆ గదిలోని వస్తువులన్నీ చిందరవందరగా పడిఉండేవి.

గదినిండా పుస్తకాలు, విడిచిన గుడ్డలు, కాలర్లుపడి పొర్లుతూ ఉండేవి. శాంత అన్నీ తీసి శుభ్రంగా సర్దిపెట్టింది.

మధ్యాహ్నం భోజనాలయ్యాక కాసేపు నిద్రపోవటం శాంత కలవాటు. చేతిలో ఓ పుస్తకం పట్టుకుని మంచంమీద పడుకోగానే ఆమెకు నిద్ర వచ్చేసేది. కాని ఈరోజు మాత్రం ఎంత ప్రయత్నించినా, నిద్ర రాలేదు.

"ఈకుర్రకుంక మాటలను తనెందు కింత కేర్ చెయ్యాలి"

అనుకుని నిద్రపోవటానికి ఎంతో ప్రయత్నించింది. కాని సాధ్య పడలేదు.

సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది, గదినుండి బయటకు వచ్చిన శాంత మొహం జబ్బుపడిలేచిన దానిలా తయారయింది. మనసులోని అశాంతివల్ల తలనొప్పిగాకూడా ఉంది.

"ఇక రమేశుడు వచ్చే వేళయింది. కాఫీ రెడీగా లేకపోతే గొడవచేస్తాడు" అనుకుంటూ, వంట గదిలోకి వెళ్ళింది.

"ఏమిటి శాంతా, ఇంతసేపు పడుకున్నావు? వంట్లో బాగాలేదా?" అని అడిగారు సుశీలమ్మగారు.

"కొంచెం తలనొప్పిగా ఉంది; అంతే."

"రమేశ్ వచ్చాక ఏదైనా మందు అడిగి వేసుకో."

"ఈమాత్రానికే రమేశ్ ఎందుకు? ఓ మాత్ర ఏదన్నా మింగితే అదే పోతుంది."

బయట రమేశ్ వచ్చిన అలికిడి అయింది. సైకిల్ వరాండాలో పెట్టి, బూటు- శబ్దం చేసుకుంటూ, గదిలోకి వెళ్ళాడు. చేతిలోని పుస్తకాలు గదిలోపడేసి, బట్టలు మార్చుకుని, సబ్బుపెట్టె తీసుకుని గబగబా నీళ్ళ గదిలోకి వెళ్ళిపోయాడు.

శాంత కాఫీగ్లాసు కడుగుతోంది.

"త్వరగా నాకు కాఫీ కలపండి వదినా. టేబుల్ టెన్నిస్‌కు టైమయిపోతోంది." రమేశ్ తొందరపెట్టాడు.

శాంత మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్ళిపోయింది. పీట వాల్చి కాఫీ, టిఫిన్ సిద్ధంగా ఉంచింది.

రమేశ్ డ్రస్ చేసుకుని వచ్చి పీటమీద కూర్చోగానే, నెమ్మదిగా బయటికి జారుకుంది. కాని రమేశ్ ఊరుకుంటాడా?

"వదినా... వదినా..."

"ఏం కావాలి" అంటూ లోపలకు వచ్చింది శాంత.

"ఇదిగో, ఈ లైట్ బ్లూ షర్టు నాకు బావుంటుందా?"

శాంత రమేశ్ వైపు చూసింది.

అతడి కళ్లు చిలిపిగా నవ్వుతున్నాయి.

"నీకేం, ఏదైనా బావుంటుంది."

"హాస్యానికి కాదొదినా, నిజం చెప్పండి."

"ఫస్టుగా ఉందిరా బాబూ."

"మీరు వాడే ఫేస్ పౌడరు వాడా నీ రోజు."

"నువ్వు కొన్నావా ఏం?"

"అబ్బే, నే నెందుకు కొంటాను. మీ టేబుల్ మీద కన బడింది. శుభ్రంగా రాసేసుకున్నాను. అలాగే మీ హేరాయిల్ కూడా..."

"నువ్వొకడివి! అచ్చం ఆడదానిలా..." అనేసి నాలిక కొరుక్కుంది శాంత.

రమేశుడితో ఎక్కువ మాట్లాడరాదనుకున్న మాట గుర్తుకు వచ్చింది.

"ఇహమీదట ఆ పౌడర్ నాకు దొరికేటట్టుగా పెట్ట కండి. కనబడితే మాత్రం నే నొదల్ను."

"అది చాలా వెలరా బాబూ. ఇష్టం వచ్చినట్టుగా రాసేసుకోకు."

"అయితే అవుతుంది మా అన్నయ్య డబ్బేగాపోయేది. మధ్య మీ కేమిటి?" అన్నాడు రమేశ్ శాంతంగా.

అంతలో సుశీలమ్మగారు లోపలికొచ్చి! "శాంతకు తలనొప్పిగా ఉందిట. ఏదైనా మందివ్వరా" అన్నారు.

"నాదగ్గర ఫీజు చాలా ఎక్కువవుతుందమ్మా. వేరే డాక్టర్ని చూడటం మంచిది."

"చాల్లేరా నీ పరిహాసం" అని విసుక్కున్నారు సుశీలమ్మ గారు.

శాంతకు అసలు సంగతి తెలుసు. నవ్వుతూ!

"నీ ఫీజు ఎంత?" అంది.

"ఒక్క సినిమా—బాల్కని టికెట్" అన్నాడు రమేశ్.

"అలాగే" అంది శాంత.

"ఇప్పుడే ఇచ్చెయ్యాలి. ఆట ముగించుకుని అలాగే సినిమాకు వెళ్ళిపోతాను. భోజనానికి నాకోసం కాచుక్కూర్చోకండి."

"మందు చెప్పకుండానే ఫీజు పుచ్చుకునే డాక్టర్. భలె!" అంది శాంత కొంటెగా.

ఒక్క సారిడాన్ మింగి, నీళ్ళు తాగండి" అనేసి గబగబా లేచి వెళ్ళాడు రమేశ్. తలుపుదాకా వెళ్ళినవాడు గబుక్కున వెనక్కు మళ్ళి!

"వదినా! నాఫీజు" అంటూ చెయ్యి జాపాడు.

శాంత యిచ్చిన రెండు - రూపాయల నోటు జేబులో పడవేసుకుని చకచకా వెళ్ళిపోయాడు.

రమేశ్ ఇంట్లో ఉన్నంతవరకూ అంతా మరచిపోయిన శాంతకు మళ్ళీ ఉదయపు సంఘటనే గుర్తుకు రాసాగింది.

"ఉదయం తనన్న మాట గుర్తుకూడా లేకుండా అతను హాయిగా తిరుగుతూంటే, తను మాత్రం ఎందు కిలా బాధ పడాలి?"

అలా అనుకుంటూనే రాత్రి వంట చేసింది. అందరి భోజనాలూ అయ్యాక రమేశుకి కంచం పెట్టి, వంటంతా అందె టట్టు పెట్టి!

"రమేశ్ వస్తే అతన్నే వడ్డించుకోమనండి. నాకింకా తలనొప్పి తగ్గలేదు" అని అత్తగారితో చెప్పి పడుకుంది.

కాని నిద్రమాత్రం ఆమె ఛాయలకూ‌_డా రాలేదు.

రమేశ్ గేటు తెరుచుకుని రావటంకూడా ఆమెకు తెలుస్తూనేఉంది. లోపలికి రాగానే!

"వదినా... వదినా..." అని పిలిచాడు.

"ష్... అరవకు. శాంతకు తలనొప్పిగా ఉందని పడుకుంది. నువ్వు అన్నం తినువుగాని పద" అన్నారు అక్కడే పడుకున్న సుశీలమ్మగారు.

రమేశ్ వెంటనే గొంతు తగ్గించి 'కులాసాగా ఉన్నారు కదా' అన్నాడు.

"ఉదయం నుండి అదో రకంగానే ఉంది."

"పులుసులో ఉప్పువేయడం మరచిపోయినప్పుడే అనుకున్నా; వదిన మామూలుగా లేరని."

రమేశ్ వంటింట్లోకి వెళ్ళేసరికే శాంత వడ్డించటానికి సిద్ధంగా ఉంది.

"మీరెందుకు లేచారు? నేనే పెట్టుకుని తినేవాడినిగా."

"నెయ్యి కంచందగ్గర పెట్టడం మరచిపోయాను. ఇక అలాగే అన్నం తినేస్తావని వచ్చాను."

"అన్నట్టు వదినా! ఉదయం పులుసులో ఉప్పు వేయ లేదేం?"

"ఏమిటో మతి మరపు. నేనూ పెద్దదాన్నయిపోతు న్నాను మరి."

"ఉదయం నుండి అదో మాదిరిగా నే ఉన్నారట?

"లేదే" అని నవ్వటానికి ప్రయత్నించింది శాంత.

"సినిమా ఎలా ఉందని అడగనే లేదు?"

"ఎలా ఉంది?"

"చాలా బావుంది."

"........"

"ఎవరెవరు నటించారో అడగనే లేదు మళ్ళీ?"

"ఆడవాళ్ళు ఎక్కువగా మాట్లాడరాదురా, రమేశ్."

రమేశ్ తలెత్తి చూశాడు.

"ఆఁ, ఇప్పుడు అర్థమయింది అసలు విషయం. కాని, వదినా! నాస్వభావం తెలిసికూడా నేనన్న చిన్నమాట నంతగా పట్టించుకుంటా రనుకోలేదు. నేను అలా అనిన వెంటనే ఒక్క లెంపకాయ ఇవ్వ లేకపోయారూ?

"నువ్వు ఇప్పుడు పెద్దవాడివయ్యావు. మొదటిలా చిన్న కుర్రాడివి కాదు కొట్టటానికి."

"అప్పుడూ మీరు కొట్టేవారుకాదు. నన్ను కొట్టాల్సి వచ్చినప్పుడుకూడా మీరు చివాట్లు పెట్టేవారు. అందువల్ల నే నిలా తయారయ్యాను."

"ఎలా ?"

"ఎలాగేమిటి, పూర్తిగా చెడిపోయాను."

"ఛ, అవేం మాటలు నీకేం రాజులా ఉన్నావు."

"నేను రాజులా ఉండటానికి ఇంట్లో ఎంతమంది శ్రమిస్తున్నారో నాకు తెలుసాదినా."

"నీకు కొంచెం అన్నం పెట్టేదా ?"

రమేశ్ ఒక్క నిమిషం మెదలకుండా ఉండి

"మీ తలనొప్పి ఏలా ఉంది ?" అన్నాడు.

"అలాగే ఉంది."

"సారిడన్ తీసుకున్నారా ?"

"లేదు."

"పోనివ్వండి. ఇప్పుడు వెళ్ళి పడుకొని శుభ్రముగా నిద్రపొండి. తెల్లవారేసరికి తలనొప్పి పారిపోతుంది."

"ఈ సలహాకూడా ఫీజు ఇవ్వాలా ఏం ?"

"కాక డాక్టర్లెప్పుడైనా ఫీజు తీసుకోకుండా సలహా లివ్వగలరా ?"

"అయితే ఇప్పుడేమివ్వాలి డాక్టరుగారూ ?"

"ఏమీవద్దు; ఒక్కసారి నవ్వేసి వెళ్ళిపడుకోండి."

"అనవసరంగా నాకు నవ్వురాదురా అబ్బాయి."

"అయితే నన్ను తల్ల క్రిందులుగా నిల్చోమన్నారా ? అప్పుడైనా నవ్వగలరేమో మరి."

"పోరా, పిచ్చితండ్రీ" అంటూ శాంత నవ్వుతూ వెళ్లిపోయింది. ఉదయంనుండి బరువుగాఉన్న మనసు ఇప్పుడు తేలికపడినట్టు అనిపించింది.

కృష్ణమూర్తి ఎప్పుడో నిద్రపోయాడు. శాంత వెళ్ళి పడుకోగానే నిద్రాదేవి ఆమెను వెంటనే వరించింది.

మర్నాడు ఉదయం మామూలు ప్రకారమే రమేశుడిని లేపటానికి వెళ్ళింది శాంత.

"రమేశ్...ఆరు దాటింది...ఇకనైనా లేవరా బాబూ!"

... ... ...

"టేబిల్ మీద సరిగ్గా ఈ ఫ్రేమ్ పెట్టావేంరా? లేవగానే దాన్నే చూస్తావా పాడు. అవలక్షణం. దాన్ని ఎక్కడైనా కనపడకుండా దాచిపెట్టుకోకూడదూ?"

"ఏమన్నారు?" అంటూ, లేచి కూర్చున్నాడు రమేశ్.

"ఉదయం లేస్తూనే ఈ ఫ్రేమ్ చూడటం మంచిది కాదంటున్నా."

"అలాగా! కాని, నేను లేవగానే దాన్ని చూడటం లేదే?"

"మరింకేం చూస్తున్నావ్?

"మీ మొహంచూస్తాను. ఫేస్ పౌడరుతో పాలిష్ చేసిన మొహం."

"నువ్వేం వర్ణించనక్కరలేదుగాని, దీన్నెక్కడైనా దాచేయి, నాక్కనిపించకుండా."

"ఆ ఫ్రేమ్ వెనక ఎంత కథ ఉందో మీకు తెలుసా?"

"ఏమిటి?"

"ఆ ముఖంకూడా ఒకప్పుడు మీలాంటి అందమైన ఆడదాని మొహం."

"చాల్లేఇక; నాకు ఇక కోపం తెప్పించకు."

"నేను హాస్యానికి చెప్పటం లే వదినా! నిజంగానే, తన లోని రంగు, కాంతి, జీవం అన్నీ పోగొట్టుకుని, ఇలా తయారయింది. కలలో ఒక్కోసారి నిజరూపంలో దర్శన మిస్తుంది. ఆహా! ఎంతటి సౌందర్యం అనుకున్నారు! అలాంటి లావణ్యరాశి దొరికితేనే పెళ్ళి చేసుకుంటాను. లేకపోతే బ్రహ్మచారిగానే ఉండిపోతాను."

"ఆహా! అందులోనూ తమరు బ్రహ్మచారిగా ఉండిపోవటం! అన్నట్టు తమ క్లాస్‌మేట్ మనోరమను ఏంచేస్తారండి డాక్టరుగారూ?"

"మనోరమ విషయం మీ కెవరు చెప్పారూ? ఆమె నాతో టేబుల్ టెన్నిస్ ఆడడానికివస్తుంది, అంతే మరింకేం లేదు."

"ఇంకేంలేదూ? నిజంగానేనా?"

"నిజం వదినా."

"ఏమో బాబూ! నాకుమాత్రం నమ్మకంలేదు,"

"ఓసారి ఇంటికి తీసుకొస్తాను. చూద్దువుగాని; ఆమె లవ్ ప్రూఫ్, వదినా."

"అయితే మాత్రమేం? ప్రేమ గుడ్డిది,"

"కాని ప్రేమికులకు కళ్ళుంటాయి. నామటుకు నేను కళ్ళు మూసుకోను. నేను చేసుకోబోయే పిల్లకు వెన్నెలకాంతిని విరజిమ్మే..."

"ఇహ చాల్లే, కాలేజికి టైమవుతోంది."

"మీ తలనొప్పి ఎలాఉంది?"

"నీ మాటలు వింటూ కూర్చుంటే, మళ్ళీ వస్తుంది" అంటూ లోపలకు వెళ్ళిపోయింది శాంత.

కోడల్ని చూడగానే సుశీలమ్మగారు "తలనొప్పి ఎలా ఉంది ?" అని అడిగారు.

"ఇప్పుడేం లేదు; తగ్గిపోయింది" అంది శాంత.

"మొహమంతా వాడిపోయినట్టుంది."

"లేదే బాగానే ఉన్నా" అంటూ వంటింట్లోకి వెళ్ళింది శాంత.

## 2

రమేశ్ కాలేజీకి వెళ్ళేవరకు శాంతకు తీరిక చిక్కేది కాదు. అంత హడావిడి చేసేవాడు. అతడి గొడవలతో ఎవరికీ ఏమీ తోచేదికాదు. అన్నీ ముగించుకుని అతడు కాలేజీకి వెళ్ళాడంటే అందరూ గొప్ప పని ముగించినట్టు హాయిగా ఊపిరి పీల్చుకునేవారు. రమేశ్ తన బూటు పాలిషునుండి "జెనకాలజీ" నోట్ బుక్ వరకూ వదిననే ఎక్కడుందని అడిగేవాడు.

ఒక్కోసారి శాంత విసుక్కునేది.

“ఏమిట్రా చోద్యం! నీ పుస్తకాలు, రేజర్లు, బ్లేడు, పాలిషు—అంతా నన్నడుగుతావేం? అవన్నీ నేను వాడనని తెలీదూ?”

“ఏమో, ఎవరికి తెలుసు. గోళ్ళు కత్తిరించుకోవడానికి నా బ్లేడు తీసి ఉండచ్చుగా.”

“రామ, రామ! నేను శూర్పణఖ నయినాకూడా నీ బ్లేడు మాత్రం ముట్టుకోను.”

“[illegible] మేమైనా...”

“ఇంకా నయం. ఆయన వస్తువులు నువ్వు ముట్టకుండా ఉంటే చాలు” అనేది శాంత.

ఆమె మాటలు అక్షరాలా నిజం. జేబు రుమాలు, పెన్సిలు, పెన్ను, బ్లేడు—ఏది కావాల్సి వచ్చినా తనని వెతుక్కోకుండా, సులువుగా దొరికే అన్నయ్య వస్తువులమీద దాడి చేసేవాడు రమేశ్. తనకు కావలసిన వస్తువు తీసుకుని!

“వదినా, అన్నయ్య పెన్ను తీసుకుంటున్నా; మళ్ళీ వెతుక్కునేడు” అనేవాడు.

“ఆయన పెన్ను ముట్టకయ్యా. మళ్ళీ నన్ను కోప్పడతారు.”

“అహా, నాకు తెలియక అడుగుతాను—నేను పెన్ను తీసుకుంటే మిమ్మల్నెందుకు కోప్పడతారు?”

“నేను నీకు ఇంత చనువిచ్చి నెత్తి కెక్కించుకున్నానని, అందువల్లే నువ్విలా తయారయ్యావని అంటారు. మీ అన్నయ్యనే అడిగి తీసుకో బాబూ.”

"ఊహుఁ. నేను అన్నయ్యను అడుగను. మీ దగ్గర పెన్నుంటే ఇవ్వండి."

"నే నేం రాసుకుంటానని నాదగ్గిర పెన్నుంటుందను కున్నావ్."

"ఇంటిలెక్క రాయటానికి పెన్నక్కర్లేదా మీకు?"

"అక్కర్లేదు; అసలు ఇంటిలెక్క రాసే అలవాటే లేదు నాకు. లెక్కంతా నా నోట్లోనే ఉంటుంది."

"మీరు డాక్టరు కావాల్సింది వదినా! మంచి జ్ఞాపక శక్తి మీకు."

"ఇంటికి ఒకరు డాక్టరైతే చాలు. నీ చదువు ఎప్పటికి పూర్తవుతుందానని ఇంట్లో అందరం కాచుక్కూర్చున్నాము."

"ఎందుకో వాళ్ళకంత ఆత్రం?"

"ఆత్రం కాదా మరి? ఉదయం నీ హడావిడిలో చచ్చి పోతున్నాం. నువ్వు డాక్టరై, నీకూ పెళ్ళయితే మేమంతా బ్రతికిపోతాం..."

"వదినా! నాకు వెన్నెలకాంతిని విరజిమ్మే..."

"కాలేజికి టైమవుతోంది వెళ్ళరా బాబూ" అని హెచ్చరిక చిన మరిదిని హెచ్చరించి అక్కడ నుండి పంపేది శాంత.

ఆమె అనుకున్నట్టే కృష్ణమూర్తి అడిగేవాడు.

"నా పెన్నేది?

"రమేశ్ పట్టుకెళ్ళాడు."

"ఇకమీదట నా వస్తువులేవీ ముట్టద్దని చెప్పువాడికి."

"మీరే చెప్పకూడదూ, నే చెపితే వినడుమరి."

"ఎలా వింటాడూ ? అలా చనువిచ్చి నెత్తి కెక్కించుకుంటే !"

"పోనివ్వండి. ఈ సంవత్సరం గడిచిపోతే, వాడెక్కడో ! మన మెక్కడో !"

"నువ్విలా అంటూనే వాడిని ఇలా తయారుచేశావు" అని ఊరుకునేవాడు కృష్ణమూర్తి.

శాంత అన్నమాట నిజమే. రమేశ్ తన భవితవ్యాన్ని గురించి వదినతో చర్చించేవాడు. తన మనసులోని ఆరాటన్నంతా వదిన ముందుంచ్చేవాడు వదినతో తప్ప మరెవరితోనూ తనవిషయాలు చెప్పుకునేవాడుకాదు. తల్లి తనకన్నా చాలా పెద్ద గనుక ఈ కాలానికితగినట్టుగా సలహా లివ్వలేరని అనుకునేవాడు. తండ్రితో రమేశుడికి చిన్నప్పటినుండి చనువన్నమాటే లేదు. ఇక అన్నయ్యవాళ్ళెప్పుడూఎక్కువగాకలుసుకునేవారే కాదు. కలుసుకునిమాట్లాడుకున్నా, అన్నయ్యతమ్ముడిని చిన్నకుర్రాడికింద కట్టి మాట్లాడేవాడు. ఇహ మిగిలింది శాంత. తన మనసులోని ఆలోచనలన్నీ ప్రేమతో వినే వదినతోనే చెప్పుకునేవాడు.

"మెడిసిన్ పూర్తిచేశాక ఇక్కడే పనిలో చేర్తావా, ఏం చేస్తావు రమేశ్ ?" అని అడిగేది శాంత.

"ఇక్కడే ప్రాక్టీసు చేసుకున్నా, జీవనం నడిచిపోతుంది. కాని, వదినా! పని మాత్రంరాదు. జలుబు, దగ్గు – ఇలాంటివి నయంచేస్తూ కూర్చోవచ్చు. కాని నాకు సర్జన్ కావాలనుంది. ఈ ఊరు వదలిపెట్టాలని లేదుగాని, ఈ ఊళ్ళో కులాల గొడవలు ఎక్కువైపోయాయి.అందుకనే ఉత్తరాదికి వెళ్ళాలనిఉంది."

"హస్తవాసి, నైపుణ్యాం ఉంటే, ఏ ఊళ్ళోఉంటే మాత్రం ఏమిటి చెప్పు."

"మీరు ఎప్పుడూ ఇంట్లో ఉంటారు. మీకేమీ తెలీదు వదినా! బయట ప్రపంచాన్ని కాస్త కళ్ళు తెరచి చూడండి. మా హాస్పిటల్‌లోనే ఎన్ని అన్యాయాలు జరుగుతున్నాయని! కాని, ఏమీ చేయలేక అందరూ ఊరుకుంటారు. ఇవన్నీ చూస్తూ చూస్తూ మళ్ళీ నేను అదే కూపంలోకి దూకలేను వదినా!"

"నువ్వు వెళ్ళిపోతే, నాకేమీ తోచదురా రమేశ్."

నిజమే, నాకూ కష్టమే, మీరు రుచిరుచిగా వండిపెట్టే టిఫిన్లు, వంట - ఇవన్నీ వదలిపోవటం."

శాంత నవ్వేసేది.

"పోనీ, వాటికోసమైనా ఉండిపో"-అని సలహా ఇచ్చేది.

"మీలాంటివారు ఉండేవరకూ, ఎక్కడున్నా జీవించేందుకు కావాల్సినంత డబ్బు సంపాదించుకోగలను. ఉత్త డబ్బు సంపాదించడం ఒకటేకాదు నాకు కావలిసింది."

"కావచ్చు; కాని ఈఆదర్శం ఎన్నిరోజులు నిలబడుతుందో ననే నా అనుమానం. వృత్తిలోకిదిగే ప్రతిడాక్టరు అలాగే అను కుంటాడు. కాని తరువాత పేదవాళ్ళను కన్నెత్తికూడాచూడరు."

మీ మాట నిజమే వదినా! సామాన్యంగా హాస్పిట లులో జనరల్ వార్డులోని రోగుల్ని డాక్టర్లు మొదలుకొని నర్సులు, ఆయాలవరకూ అందరూ అలక్ష్యంగా చూస్తారు."

"మీ డాక్టర్ల ఇంకో రోగంకూడా నాకు అర్థంకాదు. ఒక డాక్టరు - పేషంట్‌ను ఇంకొకడు చచ్చినా చూడడు. పేషంటు - ప్రాణంపోతున్నా ఇతడు నా పేషంటు కాదు' అని

వెళ్ళిపోవటం న్యాయమంటావా? అంతెందుకు, ఓ మారు మా మామయ్యా బెంగుళూరు విక్టోరియా హాస్పిటలులో స్పెషల్ వార్డులో ఉండేవాడు. ఆయనకోసం తెప్పించిన ఇంజక్షన్ ఇవ్వ టానికి డాక్టరే గతిలేకపోయాడు. ప్రతివాడు 'ఈయన మా పేషంటుకాదు' అంటూ వెళ్ళిపోవటమే. ఇదేం న్యాయమో చెప్పు"

"న్యాయంకాదు గాని, అలా ఒకరిపేషంటుని ఇంకొకరం ట్రీట్ చేస్తే, మళ్లీ వాళ్ళల్లో వాళ్ళకు భిన్నాభిప్రాయాలు గొడ వలు వస్తాయి."

"వీళ్ళ గొడవల్లో మధ్య చచ్చేది మనం. నువ్వుమాత్రం అలా చేయకు రమేశ్,"

"నాకు మంచి సర్జనుగా కావాలనుంది."

"చాలా ధైర్యం ఉండాలి-కదూ సర్జన్ కావాలంటే ?"

"అవును రెండు కేసులు సక్సెస్ కాకపోతే ఇహ వాడికా ఊళ్ళో ఉప్పుకూడపుట్టదు."

"అయితేమరి ఏ ధైర్యంమీద సర్జన్‌గా అవుదామను కుంటున్నావు. నాకేమో భయమే బాబూ !"

"భయపడకండి వదినా! నేను నా మొదటి ప్రయోగం మాత్రం మీమీద చెయ్యను.

"నాభయం అది కాదు రమేశ్. ఒకవేళ నీ కేమయినా చెడ్డపేరొచ్చి..."

"అపుడు మీా రుంటారు. నాకు కావలసినంత డబ్బివ్వ టానికి."

"తమాషాకాదు రమేశ్. ఏది ఏమైనా, నీకు ధన దాహం లేకుండా ఉండాలనే నాకోరిక."

"వదినా, ఖచ్చితంగా చెప్తున్నా వినండి. డబ్బుగల వాళ్ళ దగ్గరనుండి ఒక్క పైసాకూడా వదలకుండా వసూలు చేస్తాను. బీదవాళ్ళను పైసాకూడా అడగను, సరేనా?"

"అలా అని ప్రామిస్ చెయ్యి."

"ఏం, నా మాటమీద మీకంత నమ్మకం లేదా?"

రమేశ్ నవ్వుతూ అన్నా శాంత నొచ్చుకుంది.

"నిన్ను నొప్పించానేమో" అంది.

"అవును."

"క్షమించు."

"రవ్వలడ్డూలు, కారంగింజలు పెడితేగాని, క్షమించను."

నా దగ్గరే ఇంత లంచం వసూలు చేస్తావే! ఇహ బయట వాళ్ళను వదలిపెడతావా నువ్వు!"

"మీరేమన్నా, నా పేషంటు కావాలి..."

"రామ, రామ. డాక్టర్ల చేతికి చిక్కకుండానే దేవుడు నన్ను తీసుకుపోతే చాలు."

"మీరు అలా అంటే డాక్టర్లు బ్రతికేదెలా? మీరు నా పేషంటయితే నేను అడిగేదంతే. వారానికో సినిమా, రెండు మార్లు హోటల్ ఖర్చు. వారానికి నాలుగుమార్లు రవ్వలడ్డులు చేసి పెడితే చాలు. అంతే నా ఫీజు."

ఇవ్వటంతో నేను దివాలా తీస్తానంతే."

"మీకు తెలీదు కాని, వదినా! మీకు దేవుడు సకల

సౌభాగ్యాలను ప్రసాదించాలని నేను ఎప్పుడూ దేవుడిని ప్రార్థిస్తూంటాను."

"చాలా సంతోషం. కాని, తమరికి దేవుడిమీద ఈ నమ్మక మెప్పటినుండో" శాంత కొంటెగా అడిగింది.

"నేను ఫైనల్ ఎం. బి. స్టూడెంటు నయినప్పటినుండి" అని జవాబు చెప్పాడు రమేశ్.

సుశీలమ్మగారు ఎందుకనో పిలవటంతో శాంత లోపలికి వెళ్ళింది.

రమేశ్ ఆఖరి సంవత్సరం చదువులో పడ్డాక, మునుపటిలా వదినతో కబుర్లు చెబుతూ కూర్చోటం పడేదికాదు. ఉదయం హాస్పిటల్ డ్యూటీ, మధ్యాహ్నం కాలేజీ, సాయంకాలం టేబుల్-టెన్నిస్ వీటితో సరిపోయే దతనికి. రాత్రి భోంచేసేటపుడు, పడుకునేందుకు ముందు కబుర్లు చెప్పేవాడు. ఒక్కోసారి భోంచేయగానే తన గదిలోకి వెళ్ళిపోయేవాడు—చదువుకోవటానికి. అప్పుడు శాంతకు ఏమీ తోచేదికాదు. పాలు ఇవ్వటమనే నెపంతో అతడి గదిలోకి వెళ్ళేది.

రమేశ్! పాలు తీసుకో."

"అక్కడే ఉంచండి" అన్నాడు రమేశ్ పుస్తకంలోనుండి తలెత్తకుండానే."

తొందరగా తాగేయ్. లేకపోతే చల్లారిపోతుంది."

"అబ్బ! పాలు తాగడానిక్కూడా మీగోడవే" అని విసుక్కునేవాడు రమేశు.

శాంత చిన్నబుచ్చుకుని పాల గ్లాసు టేబుల్‌మీద పెట్టేసి వెళ్ళిపోయేది.

శాంత అలా వెళ్లిపోతే అతడి చదువు సాగేది కాదు. పాలుతాగి, గ్లాసులోపలపెట్టే వంకతో వంట గదిలోకి వెళ్ళేవాడు. అక్కడ శాంత లేకపోతే:

"అమ్మా! వదిన ఏదీ" అని అడిగేవాడు.

"పడుకుని ఉంటుంది."

రమేశ్ ఇహ వెనకా ముందు చూడకుండా తిన్నగా అన్నయ్య – గదితలుపు కొడుతూ,

"వదినా! తలుపులు తీయండి. కాస్త పనుంది" అనేవాడు.

"నేను పడుకున్నా, లేచి తియ్యలేను. ఏం పనున్నా, రేపు ఉదయమే చెప్పు" అని జవాబు వచ్చేది శాంతనుండి.

"అన్నయ్యా! నువ్వైనా తలుపు తీ" అని అరిచేవాడు రమేశ్.

"ఆయన నిద్రపోతున్నారు" అని శాంతే జవాబుచెప్పేది.

"అయితే ఇప్పుడే లేపేస్తాను చూడండి" అంటూ దబదబా తలుపు తట్టేవాడు.

ఇహ విధిలేక శాంత తలుపు తీసేది. కృష్ణమూర్తి చదువుతూ ఉండేవాడు.

"ఆం, అబద్ధాలు చెపుతున్నారా? అన్నయ్య నిద్రపోవటంలా."

నీ గొడవతో కుంభకర్ణుడుకూడా నిద్రపోలేడు. అదిసరే గాని, నీ కెన్నేళ్ళయ్యా?"

"హఠాత్తుగా తమరికి నా వయస్సెందుకొకావాల్సి వచ్చింది" అంటూ తనో కుర్చీ లాక్కుని కూర్చునేవాడు.

అలా కూర్చుంటే మరో గంటకూడా లేవడని కృష్ణ మూర్తికూడా తెలుసు.

"అహా, ఊరికేనేగాని; ఇంతకూ నీ కెన్నేళ్ళు చెప్పు ?" అంటూ, తనూ ఇంకో కుర్చీమీద కూర్చునేది శాంత.

"ఇరవై మూడేళ్లు."

"నీ కిన్నేళ్లొచ్చింది వృథా రమేశ్."

"ఏం అలా అంటున్నారు ? చదువుకోవటం లేదా ? ఆఖరి సంవత్సరం ఎం. బి. లో ఉన్నాను గుర్తుంచుకోండి."

"చదువుకుంటేసరా? రాత్రి ఈసమయంలో భార్యాభర్తలు పడుకున్న గదితలుపులు తెరిపించి ఇలా వచ్చి కూర్చోవచ్చా?"

"ఓస్. ఇంతేనా ! ఏమో అనుకున్నాను. మీ దగ్గర నాకు రూల్సేమిటి వదినా" అని ఎగర గొట్టేసేవాడు.

"అలాగే అంటూఉండు. రేపు నీ పెళ్ళాం రానీ, నేనూ అలాగే చేస్తాను."

"వదినా నీకు పెళ్ళయి ఎన్నేళ్ళయింది" రమేశ్ ఎదురు-ప్రశ్న వేశాడు.

"పన్నెండేళ్ళు. నే నీ యింటికి వచ్చేసరికి నువ్వు పద కొండేళ్ళ కుర్రాడివి."

"సరే, నాకూ పెళ్ళయ్యాక పన్నెండేళ్లు టైమివ్వండి. తర్వాత అలాగే చేద్దురుగాని."

శాంత మొండిగా "ఉహుఁ, అదేం కుదరదు. మీఆవిడ వచ్చినరోజే నేను అల్లరి చేస్తాను" అనేది.

"అయితే ఆరోజు నేను ఇంటికేరాను. ఎక్కడికన్నా

వెళ్ళిపోతాను. ఆఁ. అన్నట్టు వదినా! మొన్న ఏదో సంబంధం వచ్చిందట. మీరు ఆ పిల్లను చూశారా ?"

"ఆఁ. చూశాను."

"ఎలా ఉంది ?" కుతూహలంతో అడిగాడు రమేశ్.

"నేనే నయం – ఆ పిల్లముందు."

"బాగాలేదన్న మాట."

"ఆఁ. అందుకే నీ దాకా తేలేదు. నువ్వుచూసి, పెళ్ళయితే చాలు అని ఎక్కడ ఒప్పేసుకుంటావో అనే భయంతో అమ్మా – నేనూ నీతో చెప్పకూడదని అనుకున్నాం."

"అయ్యో! అన్యాయం" లేని బాధ వ్యక్తపరిచాడు రమేశు

"డాక్టరుగారూ! అమెది వెన్నెల కాంతిని విరజిమ్మే అందంకాదు. అతి సామాన్యరూపం గల పిల్ల."

"నేను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి ఎలాఉండాలో తెలుసా? వెన్నెల – కాంతిని...విరజిమ్మే..."

కృష్ణమూర్తి పెద్దగా ఆవలించి:

"రమేశ్! నువ్వింక వెళ్ళి పడుకోరా? నాకు నిద్ర రొస్తుంది" అన్నాడు.

"నువ్వు పడుకో అన్నయ్యా! నేను ఇంకా వదినకు చాలా కబుర్లు చెప్పాలి."

"నువ్వు పెళ్ళి చేసుకోబోయే అమ్మాయిని వర్ణించదల్చుకుంటే మాత్రం వినుగే" అని భర్తతో ఏకీభవించేది శాంత.

"నేను ఎలాంటి పిల్లను చేసుకున్నా, వదినలాంటి మొండి ఘటాన్ని మాత్రం చేసుకోను."

"మంచి మాటన్నావు రమేశ్" అంటూ, తమ్ముణ్ణి సమర్థించేవాడు కృష్ణమూర్తి.

అన్నయ్యా వదినల బలవంతాన బయటికి వచ్చేవాడు రమేశ్.

"వాళ్ళగదిలో ఇంతసేపు ఏంచేస్తున్నావురా" అని అప్పటివరకూ మేలుకున్న సుశీలమ్మగారు అడిగితే, బుద్ధిగా:

"నిద్రపట్ట లేదమ్మా, వదిన కథ చెప్తూంటే వింటూ కూర్చున్నాను." అనేవాడు.

"ఊరికే కబుర్లు-కథలు అంటూ కూర్చోకు. నీ చదువేదో చూసుకో" అని గుర్తు చేసేవారు సుశీలమ్మగారు.

శాంతకు తరచుగా తలనొప్పి రావటం మామూలై పోయింది. తలనొప్పేకదా అని మొదట్లో ఎవరూ అంతగా లెక్క-చేయలేదు. కాని అస్తమానం తలనొప్పిగానే ఉండటం గమనించి కృష్ణమూర్తి:

"ఎప్పుడూ కుట్లూ, అల్లికలూ చేతిలో పట్టుకుని కూర్చోకు. అందుకే ఇలా తలనొప్పిగా ఉంటుందేమో. పుస్తకాలుకూడా చదవటం మానేయి కొన్ని రోజులు" అని సలహా ఇచ్చాడు.

శాంత భర్త చెప్పినట్టే కంటికి శ్రమ కలిగించే పనులు మానేసింది. కాని, దానివల్ల తలనొప్పి ఏమాత్రం తగ్గలేదు.

పొయ్యిదగ్గర కూర్చోవటంవల్ల అలా అవుతోందేమో నని సందేహం వెలిబుచ్చారు సుశీలమ్మగారు.

"ప్రపంచంలో పొయ్యిముందు కూర్చున్న వాళ్ళకంతా తలనొప్పి వస్తుందా ఏం" అని ఎదురు ప్రశ్న వేసింది శాంత.

"వారానికోమారు శుభ్రంగా ఆముదం రాసుకుని నీళ్లు పోసుకుంటే తలనొప్పి ఎందుకు వస్తుంది? ఈ కాలపు పిల్లలకు శాంపూ మీదనే నమ్మకం ఎక్కువ" అని గొణిగారు మామ గారు.

"వారానికోసారి సినిమా చూస్తే ఇంకేమవుతుం దేమిటి?" అన్నాడు రమేశ్.

అందరి మాటలూ మౌనంగా వింటున్న శాంత, రమే శుడి మాటతో రెచ్చిపోయింది.

"వారానికోసారి సినిమా చూసేది నువ్వా—నేనా?" అంది కోపంతో మండిపడుతూ.

"చూసేదేమో నేనే కాని, తలనొప్పి మాత్రం మీకు. అది సరే కాని, వదినా! రేపు మిమ్మల్ని కళ్ళ డాక్టరు దగ్గరకు తీసుకుని వెడతాను."

మరునాడు వదినను తీసుకుని హాస్పిటల్‌కు వెళ్ళాడు. దారి పొడుగునా ఆమెను ఏడిపిస్తూనే ఉన్నాడు.

"అక్కడ ఎ. బి. సి. డి. చదవమంటారు. చదవగలరా? లేకపోతే వేళ్లు చూపెట్టి లెక్కపెట్టమంటారు. అది మరీ అవ మానకరం."

"రమేశ్! నేను ఏమైనా చేస్తాను కాని, కళ్ళజోడు మాత్రం పెట్టుకోలేను. ముందే చెబుతున్నా; నా కసులు ఇష్టం ఉండదు."

"అలా అని కళ్లు పాడుచేసుకోగలమా వదినా?"

రమేశ్, మెడికల్ కాలేజి విద్యార్థి కావటంవల్ల కళ్ళ-డాక్టరుతో బాగా పరిచయం ఉందతనికి. దానివల్ల శాంత కళ్ళ పరీక్ష తొందరగానే జరిగిపోయింది.

"కళ్ళలో ఏ దోషమూ లేదు" అని చెప్పారు డాక్టరు గారు.

"అయితే కళ్ళజోడు పెట్టుకో నక్కరలేదు" అని పొంగి పోయింది శాంత.

కాని, రమేశుడి మొహం చింతాగ్రస్తమైంది.

కళ్ళకు కావలసినంత విశ్రాంతి నివ్వమని మాత్రమే చెప్పాడు వదినతో. వంట పనికూడా సుశీలమ్మగారే కావటంలో శాంతకు ఇంట్లో పనేమీ లేకపోయింది. ఏమీ తోచేదికాదు. రమేశుడికి తీరికున్నప్పుడల్లా కబుర్లతో కాలక్షేపం చేసేది.

ఒకరోజు సాయంత్రం రమేశ్ ఇంటికిరాగానే శాంత:

"ఇంకెన్నాళ్ళు రమేశు! నాకీశిక్ష" అని అడిగింది.

"శిక్ష మీకుకాదు మాకు."

"మీకా?"

"అవును; మానసిక శిక్ష. మీ తలనొప్పి మాకు పెద్ద సమస్యగా తయారయింది."

"ఏం డాక్టర్లోగాని; ఇంగ్లండు, అమెరికా అన్ని విదేశాలకు వెళ్ళి పరీక్షలు పాసై వస్తారుగాని, జలుబు, తలనొప్పికూడా నయం చెయ్యలేరు" అంది శాంత కొంటెగా.

"ఆ మాటలతో రమేశుడు నోరు మూసుకున్నాడు. దానికీ కారణం ఉంది. శాంత స్నేహితురాలు లోకమ్మాయి అ స్తమానం జలుబుతో బాధపడుతూండేది.

"నాకు బుద్ధి తెలిసినప్పటినుండి నా ముక్కులో తేమ ఆరటం అంటూ జరగలేదు. జీవనదులైనా ఎండిపోతాయేమో గాని, నాముక్కుమాత్రం ఎండదు" అని శాంతతో ఎన్నో మార్లు చెప్పుకుంది.

ఆమెను శాంత రమేశుడి మొదటి రోగిగా అప్పగించింది.

"ఈమె జలుబు నయం చేసేయ్. నువ్వు అడిగిన ఫీజు దొరుకుతుంది" అని శాంత చెప్పినపుడు రమేశుడి సంతోషానికి పరిధులు లేవు. ఇట్టే నయంచేసి వదినను మెప్పించాలనుకున్నాడు. రాజ్యాన్ని స్వయంగా హాస్పిటల్‌కి తీసుకునివెళ్ళి డాక్టర్‌తో చెప్పి "కాటరైస్" చేయించాడు. కొన్ని రకాల 'నేసల్ డ్రాప్స్' కూడా సూచించాడు.

కాని, ఆమె జలుబు దేన్నీ ఖాతరుచెయ్యకుండా, రమేశుడిని ఓడించింది. సైన్సు అతనికి సహాయపడక పోవటంలో కర్మ సిద్ధాంతాన్ని ఆశ్రయించి;

"మీకర్మ; మీరు అలా జీవితాంతం జలుబుతో బాధ పడాలని రాసివుంటే, నేనేం చేయగలను" అంటూ ఓటమిని అంగీకరించాడు.

శాంత నిరాశ చెందినా, మరిదిని వేళాకోళం పట్టించటానికి మరో కొత్త విషయం దొరికిందామెకు.

తన వృత్తిని గురించి, నిపుణత గురించి గొప్పలు చెప్పుకునేవాడు రమేశు.

రమేశు చదువులో మంచి తెలివైనవాడు. ఆ విషయం ఎవరూ కాదనలేరు. ఏ ఒక్క క్లాసులో కూడా అతడు ఫేలయింది లేదు. ఎప్పుడూ మొదటి లేక రెండవస్థానం అతడిదే.

దీనివల్ల అతడిలో ఆత్మవిశ్వాసం ఓపాలు ఎక్కువగానే ఉండేది. అప్పుడప్పుడూ వదినముందు తన గొప్పలు చెప్పుకునే వాడు.

గొప్పలు చెప్పుకోడానికి వదిన తప్ప మరింకెవరున్నా రతనికి?

కాని, తరువాత రాజ్యం-జలుబు ప్రకరణం అతడి బడాయికి అడ్డుపడేది.

"ఎక్కువగా మాట్లాడితే, రాజ్యం-ముక్కు లాక్కొస్తా" అని ఏడిపించేది శాంత.

ఆమాట వినగానే, రమేశు ఏదో ఒక సాకుతో అక్కడి నుండి జారుకునేవాడు.

రమేశు 'మానసిక శిక్ష' అనగానే శాంతకు భయం వేసింది.

"అయితే ఇది నయమయ్యే తలనొప్పి కాదంటావా?"

"నయం కాకపోవడ మేమిటి?" తప్పకుండా నయమవు తుంది కాని, కారణమే తెలియలేదు. ఈసారి పరీక్ష లయ్యాక, నేనే మిమ్మల్ని వెల్లూరుకు తీసుకువెడతాను" అన్నాడు రమేశు.

"వెల్లూరా! దానికి బదులు అమెరికానైనా చూపించరా బాబూ" అంది శాంత

"వీలయితే అమెరికానూ చూపిస్తాను. అది కాకపోతే మార్గం ఉంది..."

"ఏమిటది?"

"నేను చదువుకోటానికి అమెరికా వెడతాను. అక్కడే

ఓ పిల్లనుచూసి పెళ్ళిచేసికొంటాను. అప్పుడు మీరు మీ తోడికోడలిని చూడడానికి వద్దురుగాని. ఆమెకు వెన్నెలవంటి కాంతిని విరజిమ్మే..."

రమేశు! నీ స్నేహితులెవరో పిలుస్తున్నారు చూడు" అంటూ శాంత రమేశుడి వాగ్ధాటిని దివినుండి భువికి మర ల్చేది.

రమేశుడు వెంటనే స్నేహితులకోసం పరుగెత్తేవాడు.

తన కాబోయే భార్య ఎలా ఉండాలో, వదినముందు వర్ణించేవాడు. ఆ వర్ణించటంలో తన్నుతానే మర్చిపోయి స్వప్న లోకంలో విహరించేవాడు.

"విద్యాసరస్వతి, రూపలక్ష్మి, రసిక శిరోమణి, సుగుణాల ఖని, ప్రేమరాశి..." ఇలాంటి పదాలు ఆ వర్ణనలో దొర్లి పోయేవి.

శాంత అతడి ఊహాలను చూసి, లోలోపలే నవ్వు కునేది.

"ఈ వయస్సే అంత; పిచ్చికుర్రాడు" అని ఊరుకునేది. శాంత పుట్టింటికి వెడితే, కృష్ణమూర్తికన్నా ఎక్కువగా విసు క్కునేవాడు రమేశు.

గాలి మార్పువల్లనైనా కోడలి ఆరోగ్యం బాగుపడు తుందేమోనని పుట్టింటికి పంపుదా మనుకున్నారు సుశీలమ్మగారు. శాంత పుట్టింటికి వెళ్ళి చాలా రోజులయింది కూడా.

ఉత్తరం చూసిన వెంటనే శాంత నాన్నగారు బయలు దేరి వచ్చేశారు.

కూతురి మొహం చూసి ఏమనాలో ఆయనకు తోచ లేదు.

చాలాకాలానికి వచ్చిన తండ్రిని చూసి, సంతోషంలో "రా నాన్నా" అంది శాంత.

పాలిపోయిన మొహం, లోతుకుపోయిన కళ్ళు ఎత్తి కని పించే పళ్ళు, ముక్కు—వీటిని చూసి 'తమ కూతురు ఇంతేనా' అనిపించింది.

"ఎందుకమ్మా ఇలా చిక్కిపోయావు" అని అడిగారు ఆయన.

"ఏంలేదు, ఈమధ్య మూడు నెలలుగా తలనొప్పిగా ఉం టోంది; అంతే. మరేం కంగారుపడకు నాన్నా" అంది శాంత

శాంత మామగారు "అమ్మాయి అనారోగ్యం మా కంతా పెద్ద సమస్యయిపోయింది. ఎంత మంది డాక్టర్లకో చూపించాంగాని ఎందుకో, ఏమిటోకూడా తెలియలేదు. అంద రికీ అదే బెంగగా ఉంది" అన్నారు.

"అందుకే మీకు ఉత్తరం వ్రాశాం. పుట్టింట్లో ఉంటే, ఏమైనా తగ్గుతుందేమోనని. ఎంతయినా ఇది అత్తవారిల్లు; తనూ ఊరికే కూర్చోదు. కొద్ది కొద్దిగా నయినా బాధ్యత ఉండనే ఉంటుంది. అక్కడైనా, కొద్ది రోజులు విశ్రాంతి తీసు కోనీ" అన్నారు సుశీలమ్మగారు.

"ఎక్కడైతే ఏమిటమ్మా? నాకేమో రెండిళ్ళకు ఏమీ తేడా కనిపించదు" అంది శాంత.

కోడలి మాటతో పొంగిపోయారు సుశీలమ్మగారు.

కాని, శాంత మాటలు ఉత్ప్రేక్ష కాదు.

ఇంట్లో భర్త, అత్తగారు, మామగారు, మరిది అందరికీ శాంతంటే ఎంతో ప్రేమా, విశ్వాసమూనూ. ఆడపిల్లలులేని సుశీలమ్మగారు కోడల్ని కూతురిలాగే చూసుకునేవారు. పెళ్ళయిన కొత్తలో శాంతను పండుగలకుకూడా పుట్టింటికి పంపేవారేకాదు. పండుగకు పిలవటానికి వచ్చిన శాంత తండ్రితో:

మీ కయితే ఇంకా ఇద్దరు ఆడపిల్ల లున్నారు. మాకు శాంత ఒక్కతే. తను వెళ్ళిపోతే మాకు పండగేమిటి చెప్పండి" అన్నప్పుడు శాంత-నాన్నగారు ఏమీబదులు చెప్పలేకపోయేవారు.

శాంత తల్లి, కూతురు రాలేదని చిన్నబుచ్చుకున్నా, వియ్యపురాలు అన్నమాటలు ఆమె మనసుకు హాయి నిచ్చేవి.

గాలి మార్పువల్లనైనా తన ఆరోగ్యం ఓ దారికి రావచ్చునన్న ఆశతో ఈమారు శాంత పుట్టింటికి వెళ్ళడానికి ఒప్పుకుంది.

## 3

శాంత నాన్నగారు రెండు రోజులు విశ్రాంతి తీసుకున్నారు. సుశీలమ్మగారు శాంత చెల్లెళ్ళూ, తమ్ముళ్ళకోసం రకరకాల ఫలహారాలు చేసిపెట్టారు.

ఊరికి వెళ్ళేందుకు ముందురోజు సాయంకాలం; శాంత

నాన్నగారు శేషగిరిరావుగారితో కలిసి బజారుకు వెళ్ళారు. శాంత తన బట్టలు సర్దుకుంటోంది.

రమేశ్ ఇంటికి రాగానే కాళ్ళు కడుక్కుని వంటింట్లోకి వెళ్ళాడు. అక్కడ ఎవ్వరూ లేకపోవటంతో:

"వదినా" అని గట్టిగా కేకవేశాడు.

"ఏం కావాలి రమేశ్" అని తన గదిలోనుండే అడిగింది.

"నాకు టిఫిన్ ఇద్దువుగాని రండి."

"అలమరాలో మూత పెట్టాను తీసుకో."

"సరే, అ...తే నా కక్కరలేదు" అన్నాడు దురుసుగా.

"ఇలాచేస్తే ఎలాచెప్పు రమేశ్! రేపటినుండి టిఫిన్ పెట్టటానికి నేనుండను కదా. మరి అమ్మను కష్టపెట్టకు. వీలయినంతవరకూ నీ పనులు నువ్వే చేసుకోవాలి."

"రేపు పుట్టింటికి వెడతాననగానే ఎంతగర్వం వచ్చేసిందో చూశారా ? ఇక మేమంతా కనిపిస్తామా ?"

శాంత జవాబు చెప్పకుండా అలమరానుండి టిఫిన్తీసి ప్లేటులో పెడ్తోంది. రమేశ్ఎందుకలా వున్నాడో శాంతకు తెలుసు.

తను పుట్టింటికి వెళ్ళినప్పుడల్లా రమేశ్ ఇలాగే తన అసంతృప్తి వ్యక్తపరచేవాడు. కాని, ఆ అసంతృప్తి తెర వెనుక ఉన్నది నిర్మల స్నేహమన్న విషయం ఆమెకు తెలియనిదా.

శాంత టిఫిన్ ప్లేటు రమేశ్ డి ముందుంచింది.

"నేనేం రాక్షసుడిని కాను, ఇవన్నీ తినడానికి తీసెయ్యండి."

"ఎక్కువగా నెయ్యి వేస్తాను; తిను రమేశ్!"

"మీరు వేసే నెయ్యికోసం మొహం వాచిలేను నేను. ముందు తీసెయ్యండి."

శాంత సగంతీసి వేరే ప్లేటులో పెట్టింది. రమేశ్ మౌనంగా తింటున్నాడు.

"పింగ్‌పాంగ్ లేదా ఈరోజు?"

"ఉంది."

"రేపటినుంచి త్వరగా లేవడానికి అలారం పెట్టుకో. ఆలస్యంగా లేస్తే కాలేజీకి లైటవుతుంది."

"ఒక ముసలమ్మ ఉండేదిట. ఆమె దగ్గర ఓ కోడిఉండేదిట. తనకోడి కూయకపోతే, తెల్లవారదనుకుందిట ఆ ముసల్ది" అని ఆగాడు రమేశ్.

శాంత నవ్వి, "తరువాత?"

"ఇహ ఇక్కడి విషయాలు మీ కెందుకు? పుట్టింట్లో హాయిగా ఓ సంవత్సరంపాటు ఉండిరండి. అత్తగారు, మామగారు, భర్త, మరిది వీళ్ళగొడవలేం లేకుండా."

"సంవత్సరం ఎందుకుంటానూ? తొందరగానే వచ్చేస్తాను."

"ఏమక్కర్లేదు, మీరు లేకపోతే మాకు గడవదనుకున్నారా ఏం? మీరు లేరని మే మెవ్వరం చచ్చిపోం."

"ఛ, అవేం మాటలు. రాక రాక నాన్నగారువచ్చారు. వెళ్ళకపోతే బావుండదు."

"మహారాజులా వెళ్ళండి. ఎవరొద్దన్నారు ?"

"అయితే ఈ కోపం ఎందుకు మరి ?"

"మీా రిప్పుడు పుట్టింటి కెందుకు వెళ్ళాలసలు ? ఆడ పిల్లలు ఓ కారణానికి పుట్టింటికి వెడతారు. ఇప్పుడు మీాకు అలాంటి దేమీా లేదు. మీా రెందుకు వెళ్ళాలి ?"

"రేపు నీ భార్యవస్తే ఇలాగే అడ్డపడతా వన్నమాట; పుట్టింటికి వెళ్లొద్దని."

"రేపటి సంగతి అలాఉంచండి. ఇప్పటిమాట చెప్పండి ముందు. నాకు పరీక్షలు దగ్గరకొచ్చాయికదా. మీారు వెళ్ళి పోతే ఎలా ?" ఎంతో గొప్పకారణం ముందుంచాడు రమేశు.

శాంత సవ్వాపుకో లేకపోయింది.

"నే నేం చదువుకున్నానో తెలుసా రమేశ్ ?"

"ఆఁ తెలుసు."

"అయితే చెప్పు."

"మెట్రిక్ ప్యాసయ్యారు."

"ఇప్పుడు చెప్పు. మెట్రిక్ పాసయినవాళ్ళు పైనల్ ఎం. బి. స్టూడంటుకి పాఠం చెప్పగలరా ?"

దానికి జవాబు చెప్పలేక తికమక పడ్డాడు. రమేశ్, ఏమీా తోచకపోయేసరికి కోపంతో మండిపడుతూ:

"ఇలా మాట్లాడడం ఒకటి బాగావచ్చుమీాకు. ఎక్కడన్నా ఏడవండి. నాకేం ? పుట్టింట్లోనే ఉండండి. ఇక్కడికిరానే రాకండి" అంటూ కాఫీ ఓ గుక్కలో తాగేసి చరచరా వెళ్ళి పోయాడు.

శాంత పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.

శాంత మనస్సు కలుక్కుమంది. వెళ్ళేముందు మరిదితో దెబ్బలాడి వెళ్ళాల్సిరావటం చాలా కష్టమనిపించింది. ఏం? తనకు ఆ మాత్రం స్వాతంత్ర్యం లేదూ?

"హు, ఏమైనా అనుకోనీ నాకేం" అనుకుంది.

తన ప్రయాణాన్ని గురించి ఇంట్లో ఎవరూ ఏమీ అభ్యంతరం పెట్టనపుడు, మరిది చేసేగొడవచూసి ఆమెకు నవ్వు వచ్చింది.

రాత్రి అందరి భోజనాలూ అయ్యాయి. తెల్లవారు ఝామునే ప్రయాణం గనుక మరిదితో అప్పుడే చెప్పివద్దామని అతడి గదిలోకి వెళ్ళింది శాంత.

"పాలు తీసుకో రమేశ్!"

"అలా ఉంచండి."

"చల్లారిపోతుంది మరి.

"అబ్బా, మీ గొడవొకటి...ఊఁ ఇలా తెండి" అంటూ, గ్లాసు అందుకుని ఆముదం తాగేవాడిలా మొహంపెట్టి గడగడా త్రాగేశాడు.

"రేపు ఉదయం నువ్వు లేచి ఉంటావో, లేదో" అంటూ తను చెప్పబోయేదానికి నాంది వేసింది శాంత.

"లేచి ఉండను" అన్నాడు రమేశ్ చటుక్కున.

"లేవక్కర్లా. ఇపుడే చెపుదామని వచ్చాను. రేపు వెళ్తాను."

"మంచిది" అన్నాడు రమేశు ముభావంగా.

"అమ్మను కష్టపెట్టకుండా చూడు. వీలయినంతవరకూ నీపనులు నువ్వే చేసుకో. కూర్చున్నచోటికే కాఫీ, టిఫిన్

తెచ్చివ్వాలని మొంకిపట్టు పట్టకు. ఆమె కసలే ఏమీ చేత కాదు. వంటింట్లోకి వెళ్ళి, ఏం కావాలో అడిగి తీసుకో. పరీక్షకు బాగా చదువు."

"నేనేం పసిపిల్లాడి ననుకున్నారా ఏం? నాకూ ఇరవై మూడేళ్ళొచ్చాయి. ఈ సంవత్సరం దాటితే డాక్టర్ రమేశ్, ఎం. బి. బి. ఎస్. అని బోర్డు వేసుకొంటాను. గుర్తుంచుకోండి" అన్నాడు రమేశ్.

"నువ్వు డాక్టరయితే మాత్రమేం? ఇంట్లో స్వభావం మారుతుందా?"

"మారకపోతే పోయింది. ఉదయం మీరు తొందరగా లేవాలనుకుంటాను. వెళ్ళి పడుకోండి" అన్నాడు రమేష్.

"సరే" అంది శాంత.

ఊరికి వెళ్ళేముందు మరిదితో కాస్సేపు కబుర్లు చెప్పాలనే ఉందామెకు. కాని, మరిది ముభావపు మాటలతో మెదలకుండా బయటికి వచ్చేసింది.

గదిలోకి వెళ్ళిన శాంత, మడతపెట్టిన చీరలను పెట్టెలో సర్దుకుంటోంది.

ఎవరో దబదబా తలుపు బాదడంతో:

"ఎవరో చూడండి" అంది భర్తతో.

"ఈ సమయంలో ఇలా తలుపుకొట్టే వారెవరు? మీ ముద్దుల మరిదే అయ్యుంటాడు" అంటూ లేచి తలుపుతీశాడు.

"కొంచెం పనుండి వచ్చాను" అంటూ లోపలికి అడుగు పెట్టాడు రమేశ్.

"ఏమిటి సంగతి?" అంది శాంత.

"అదే మీరు ఊరినుండి ఎప్పుడొస్తారు?" అతి ముఖ్య మయిన ప్రశ్న వేసాడు రమేశ్.

"పుట్టింట్లో కొన్నాళ్ళు ఉండనీరా బాబూ ఆ నాలుగు రోజులైనా హాయిగా ఉందాం" అన్నాడు కృష్ణమూర్తి.

"పదిహేను రోజులుంటాను" అంది శాంత.

"ఆన్నాళ్లుండిరా శాంతా! ఇక్కడేం మునిగిపోతుంది" అంటూ రమేశుడిని ఏడిపించాడు కృష్ణమూర్తి.

శాంత నవ్వుతున్నా, రమేశ్ కు కోపం వచ్చింది.

"మీకేం నవ్వులాటగా ఉంది. వదిన అక్కడుంటే నా చదువు ఎలా సాగుతుంది? ఉదయం నన్ను లేపేవాళ్లెవరూ?" అన్నాడు కోపంగా.

"అలారం గడియారం" అన్నాడు కృష్ణమూర్తి.

"అది చెడిపోతేనో ? ఇక అమ్మకు కాలేజీకి భోజనం పంపటం తెలుస్తుందా? క్యారియర్ ఎలా సర్దాలోకూడా తెలీదాయె. ఇక నేను అన్నంలేక మాడాలి."

"ఇంత ఖర్మ మొచ్చిందిరా తమ్ముడూ. ఎక్కడబడితే అక్కడ హోటళ్లున్నాయి."

"హోటల్ భోజనం ఏం బావుంటుంది ? వంటికి మంచిది కాదు. మీరు చెప్పండి వదినా! నే హోటల్ భోజనం చెయ్యాలనేనా మీ కోరిక" అన్నాడు రమేశ్ శాంతతో.

"అమ్మకు క్యారియర్ ఎలా సర్దాలో చెప్పివెడతాను" అంది శాంత మృదువుగా.

"నన్ను చూస్తే మీ కందరికీ కచ్చ అందుకనే మీ రందరూ కలసి నామీద కుట్రపన్నుతున్నారు. కాని, ఇప్పుడే

చెపుతున్నా నేను ఈమారు పరీక్ష తప్పితేమాత్రం అది నా తప్పుకాదు.' '

రమేశునికి మాటలు విని, శాంతకు ప్రయాణం మాను కుందామనిపించింది. కాని, అంతా నిర్ణయించుకుని, తండ్రికూడా వచ్చేశాక ఆఖరుక్షణాల్లో వెళ్ళనని చెప్పటం ఎలా?

"అయితే నన్ను వెళ్ళమంటావా, ఒద్దంటావా?" అంది చిన్నబుచ్చుకుంటూ.

"అంతా నిశ్చయమయిపోయాక నన్నడిగితే నేనేం చెప్పను? ఇదిగో ఈమాత్రలు రోజుకు రెండు తీసుకోండి. ఇవి ఇద్దామనే వచ్చాను. తలనొప్పి మరీ ఎక్కువగా ఉంటే, ఈ ములాము రాసుకోండి" అంటూ మాత్రలూ, ములామూ శాంతకు అందిచ్చాడు.

"చాలా థ్యాంక్స్ రమేశ్!"

"తలనొప్పి ఎక్కువయితే ఇక్కడికే వచ్చేయండి— ఎంతయినా అది చిన్న ఊరు."

"అలాగే; నీ ఈ సలహాకు ఫీజు ఎంత?" అని చిలిపిగా అడిగింది శాంత.

"పదిహేను రోజుల్లోగా మీరు ఇక్కడికి వచ్చేయాలి. అదే నా ఫీజు."

"రాకపోతే?"

"రాకపోతే, మీజట్టు వదిలేస్తాను. రవ్వలడ్డుల వెన్న, సినిమా ఏవీ నా కోపాన్ని పోగొట్టలేవు. గుర్తుంచుకోండి" అన్నాడు హెచ్చరిస్తున్నట్టు.

"వెన్నెల కాంతివంటి దేహచ్ఛాయగల అమ్మాయి?"

రమేశు తనను తానే మరచిపోయాడు.

"చాలదు! చంద్రబింబంలాంటి మొహం, పద్మాల్లాంటి కళ్లు, సంపంగి పూవులాటి..."

"రమేశ్, ఇహ నాకు నిద్దరోస్తోంది. తెల్లారగట్టే లేవాలి గాని, ఇక వెళ్ళు బాబూ" అంటూ అతడిని బయటకు పంపించి తలుపు వేసుకుంది.

రమేశ్ తన కాబోయే భార్య వర్ణన సగంలోనే ఆగిపోయినందుకు బాధపడుతూ వెళ్ళిపోయాడు.

శాంత, "చూశారా భార్య అంటే ఎలా మురిసిపోతాడో" అంది భర్తతో.

"అంతే మరి; ఆ వయసులో నేనూ అలాగే ఉండేవాడిని. ఎన్ని కలలు కన్నానో. కాని, ఇప్పుడు అర్థమయింది పెళ్ళామంటే ఏమిటో" అన్నాడు కృష్ణమూర్తి.

"పెళ్ళామంటే ఏమిటి?" కుతూహలంతో అడిగింది శాంత.

"ఒక కవి చెప్పాడు: స్త్రీ పెళ్ళికి ముందు పురుషుడికి ఓ రహస్యం; పెళ్ళయ్యాక ఓ సమస్య" అని.

"ఆఁ అయితే మీకిప్పుడు ఓ సమస్యగా తయారయ్యానా ఏమిటి?"

"కాదా మరి? నీ తలనొప్పి నాకు నిజంగానే ఓ సమస్యగా పరిణమించింది" కృష్ణమూర్తి నవ్వుతూ అన్నా, ఆమె ఆరోగ్యం గురించే అతడి మనసులోఉన్న వ్యథ అతడి మొహంలోనే వ్యక్తమయింది.

"మరేం బెంగపడకండి. గాలి మార్పుతో నా తలనొప్పి చెప్పి చెయ్యకుండా పారిపోతుంది" అని ధైర్యం చెప్పింది శాంత.

మర్నాడు ఉదయం రమేశ్ నిద్ర లేచేసరికి శాంత తన తండ్రితో ఊరికి వెళ్ళిపోయింది. అలారం గడియారం సహాయంతో నిద్ర లేచాడు. వదిన కబుర్లు లేక అప్పుడే చికాకు పడటానికి మొదలెట్టాడు. కాస్త త్వరగానే కాలేజికి బయల్దేరాడు.

వెళ్ళిన మర్నాడే ఉత్తరం రాసింది శాంత. అమ్మా, నాన్న, తమ్ముళ్లు చెల్లెళ్లు—అందర్నీ కలుసుకుని సంతోషంతో తలనొప్పిని కొద్దిగా మరిచిపోగలుగుతున్నానని రాసింది. అది విని అందరూ సంతోషించారు. కాని, రమేశుడు మాత్రం ఎప్పటి లాగానే వ్యాఖ్యానించాడు.

"వదిన తలనొప్పి మరిచిపోగలుగుతున్నాననే రాశారు. కాని, తగ్గిందనికాదు. కాబట్టి అంత సంతోషించాల్సిన విషయమేం కాదు."

సాయంకాలం ఇంటికి వచ్చిన కృష్ణమూర్తి: "అమ్మా, ఈమారు దసరాకు శేషగిరి వస్తున్నాడమ్మా! బొంబాయినుండి. భార్యా, కూతురూకూడా వస్తున్నారు. బహుశా ఎల్లుండి రావచ్చు" అని చెప్పాడు.

"శాంత కూడా లేదు కదా. బొంబాయిలో ఉండే వాళ్ళామె వాళ్ళకు తగ్గట్టుగా అన్నీ నాజూగ్గా నేనేం చేయగలను? అంత నాగరికత నాకెక్కడిది చెప్పు? ఇప్పుడేం చేయను!" అని వాపోయారు సుశీలమ్మగారు.

"అయితే వెంటనే వదినను రమ్మని రాసేస్తాను. ఇక ఏ బాధా ఉండదు" అంటూ, అందుకున్నాడు రమేశ్.

"వద్దు రమేశ్! ఇంకా ఇప్పుడేగా వెళ్ళింది. అప్పుడే రాస్తే బావుండదు" అని సుశీలమ్మగారు వారించినా, రమేశ్ వినలేదు.

"వదినా! మీ ఇంటికి బొంబాయినుండి అతిథులు వచ్చారు. మీరు వచ్చి ఆదర సత్కారాల భారం వహించాలి. అమ్మకు ఏమీ చేతకాదు" అని ఓ పోస్టుకార్డు గీచి పడేశాడు.

శాంత రాలేదు. కాని, రమేశ్‌కు ఓ చిన్న ఉత్తరం వచ్చింది.

"నేను రాలేను. వారి ఆదర సత్కారాల బాధ్యత నీకు చెందింది."

చదివి, కోపంతో ఉత్తరాన్ని చింపి పారేశాడు.

శేషగిరి వస్తున్నాడని కృష్ణమూర్తికి చాలా సంతోషంగా ఉంది. వారిద్దరూ ఇంటర్ వరకూ కలిసే చదివారు. తరువాత వాళ్ళ వృత్తులు వేరుకావడంతో బాటు జీవితాలుకూడా వేరు మార్గాలలో సాగిపోయాయి. డాక్టర్ శేషగిరి బొంబాయి వెళ్ళి, అక్కడే ప్రాక్టీసు చెయ్యసాగాడు. స్నేహితులు కలుసుకోవటం చాలా అరుదైనా, ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా పలకరించుకుంటూనే ఉన్నారు.

చాలా కాలానికి స్నేహితుడిని కలుసుకోబోతున్నందుకు సంతోషంగాఉన్నా, ఈ సమయంలో శాంత లేకపోవటం పెద్ద లోటనిపించింది కృష్ణమూర్తికి.

శేషగిరిదంపతులు వచ్చేందుకు ముందురోజు రాత్రి కూడా తల్లీ కొడుకులు ఇదే విషయం మాట్లాడుకున్నారు.

"నేను పాతకాలందాన్ని, ఈ కాలపు నయం, నాజూకు నాకేం తెలుస్తాయి" అని చిన్నబుచ్చుకున్నారు సుశీలమ్మగారు.

"మనకు వచ్చినట్లే చేస్తే సరి" అన్నాడు రమేశ్.

"ఆ బొంబాయి పిల్ల నా మొరటుతనానికి నవ్వుకుంటుం దంతే."

"నవ్వుకోనీ; మాకు చేతనయ్యేది ఇలాగే అంటే సరి" అన్నాడు రమేశ్.

"నువ్వూరుకో, ఇక మాట్లాడకు" అని విసుక్కున్నారు సుశీలమ్మగారు.

కృష్ణమూర్తి "నువ్వేం బెంగపెట్టుకోకమ్మా! వాళ్ళేమీ అనుకోరు" అని ధైర్యం చెప్పాడు.

కృష్ణమూర్తి ఆఫీసుకు సెలవుపెట్టి స్నేహితుడికి స్వాగత మివ్వటానికి స్టేషనుకు వెళ్ళాడు.

ఇంటిముందు టాక్సీ ఆగగానే సుశీలమ్మగారు, శేషగిరి రావుగారు బయటకు వచ్చి నిలబడ్డారు. అందరూ టాక్సీ నుండి దిగారు. కృష్ణమూర్తి తన స్నేహితుడిని, అతడి భార్యను తల్లి దండ్రులకు పరిచయం చేశాడు. నాలుగేళ్ళ ఆశ కుతూహ లంతో కొత్త మొహాలను చూస్తోంది.

శేషగిరి చుట్టూ చూసి, "మీ ఆవిడ కనుపించదేం?" అని అడిగాడు.

"ఊళ్ళో లేదు. పుట్టింటికి వెళ్ళింది."

"ఓ, అయితే మా కందరికి మిఠాయి పంచుతావన్న మాట."

"అబ్బే, అదేం లేదు; ఊరికే వెళ్ళింది" అన్నాడు కృష్ణ మూర్తి.

శేషగిరిప్రశ్న విని సుశీలమ్మగారి మనస్సు చిన్నబో యింది. కృష్ణమూర్తికి పెళ్ళయి పన్నెండేళ్ళకుపై గా అయినా, ఆ ఇంట్లో పసిపాపను చూసుకునే అదృష్టం నోచుకోలేదు. వృద్ధాప్యంలోకి అడుగుపెట్టిన ఆమెకు సహజంగానే మనవడిని ఎత్తుకోవాలని ఆశగా ఉంది.

కాని, కోడలి ఎదుట ఎప్పుడూ ఆ విషయాలు గురించి ఎత్తేవా రేగాదు. వృధాగా కోడలి మనస్సు నొప్పించటం ఆమెకు ఇష్టం ఉండేదికాదు. వీటన్నిటివల్లా అవ్యక్తమైన విచారం ఆ కాపురంలో చోటు చేసుకొని ఉంది.

సుశీలమ్మగారి మొహంలో క్షణకాలం కనిపించి మాయ మయిన విషాద-రేఖను సూక్ష్మమతియైన రత్న గమనించింది. ఎంతయినా తనూ ఓ ఆడదే కదా!

ఇంట్లో మీ రొక్కరే కదూ ఉండటం. మేమంతా వచ్చి మీకు చాలా శ్రమను కల్పిస్తున్నాం" అంది రత్న మాట మారుస్తూ.

సుశీలమ్మగారు చిన్నగా నవ్వి :

"అలా అనకమ్మా, శ్రమేముంది. నీకోసం నేను ప్రత్యే కంగా ఏంచెయ్యాలి గనుక ? మీారు రావటం నాకెంతో సంతో షంగా ఉంది" అన్నారు.

రత్న కొంగుపట్టుకుని నిల్చున్న పాపను, "నీ పేరేమి టమ్మా" అంటూ పలకరించారు.

పాప సిగ్గుతో జవాబు చెప్పలేదు.

"ఊఁ చెప్పమరి. ఇల్లెగిరిపోయేట్లు కబుర్లు చెప్తావు.అవ్వ పేరడిగితే చెప్పలేవూ ?" అన్నాడు శేషగిరి నవ్వుతూ.

"ఆశ" అంది పాప.

మగవాళ్లు కబుర్లు చెప్పుకొంటూ కూర్చున్నారు. రత్న సుశీలమ్మగారివెంట వంటింట్లోకి వెళ్ళింది. అప్పటికే వంటంతా అయిపోయింది. ఇక అప్పడాలు వేయడమే తరువాయి.

"నే నేం జెయ్యను ? నాకూ ఏదైనా పని చెప్పండి" అంది రత్న.

"నువ్వేం చెయ్యకమ్మా. అలా కూర్చో" అంటూ పీట వాల్చారు సుశీలమ్మగారు.

కూర్చున్న రత్నవైపు పరిశీలనగా చూశారు.

సాదా వాయిల్ చీర కట్టుకుని, రెండు జడలువేసుకుంది రత్న. ఆమె మాటలు ఎంతో సరళంగాఉన్నాయి. కాని, ఒక పిల్ల తల్లి అయ్యాకకూడా రెండు జడలువేసుకోవడం సుశీలమ్మగారికి అంతగా నచ్చలా.

రత్న తనే ఆకులువేసి, నీళ్లు చిలకరించింది. సూక్ష్మంగా ఏది ఎక్కడుంది అనే విషయాలు గమనించి ఉప్పు ఊరగాయ వడ్డించి, గ్లాసులలో నీళ్లు పెట్టింది.

సుశీలమ్మగారి కాస్తబెంగకూడా తీరిపోయింది. అంత సరళంగా సహజంగాకి ప్రవర్తిస్తున్న ఆపిల్లను తన ఇంటి పిల్లలాగే ఆదరించవచ్చుననుకున్నారు.

"నువ్వూ భోజనానికి కూర్చో" అని ఎంత చెప్పినా వినక రత్న "నేనూ మీతో బాటే" అనేసింది.

మగవాళ్ళ భోజనాలయ్యాక సుశీలమ్మగారూ రత్న భోజనానికికూర్చున్నారు. రత్నతో కలిసి భోంచేస్తూంటే, సుశీలమ్మగారికి శాంతే గుర్తుకొచ్చింది. తన కోడల్ని గురించి చెప్పింది రత్నకు.

"ఆమెకూడా ఉంటే, ఎంతో బాగుండేది" అంది రత్న.

భోజనాలయ్యాక "కాసేపు పడుకుని విశ్రాంతి తీసుకోమ్మా" అన్నారామె.

"మేము బొంబాయినుండే నడిచి రాలేదుసుమండి" అనేసింది రత్న.

సాయంకాలం రమేశ్ ఇంటికి రాగానే, కొత్త వాళ్ళెవరో తల్లితో మాట్లాడుతూ కూర్చుని ఉండటం చూశాడు. రత్న రెండు జడలు ముందు కనిపించాయి. వెనుతిరిగి వెళ్ళిపోబోతున్న రమేశ్‌ని పిలిచి, రత్నకు పరిచయంచేశారు సుశీలమ్మగారు.

"వీడేనమ్మా, నాచిన్న కొడుకు, ఈ సంవత్సరంతో వీడి చదువు పూర్తయిపోతోంది. వీడికి పెళ్ళిచేస్తే మా బాధ్యత తీరిపోతుంది" అన్నారు.

రత్న రమేశ్ వంక చూసింది.

"నమస్తే" అన్నాడు రమేశ్.

తరువాత తల్లివైపు తిరిగి, "అమ్మా! నేను వెళ్ళాలి. టైమయిపోతోంది" అని తొందరచేశాడు.

సుశీలమ్మగారు కాఫీ టిఫిన్ అందించారు. మళ్ళీ పది

నిమిషాల్లో బయటకు వెళ్ళటానికి సిద్ధంగానిల్చున్నాడు. అప్పుడే బయటనుంచివస్తున్న కృష్ణమూర్తి శేషగిరితో:

"శేషగిరోయ్, నా తమ్ముడు రమేష్. త్వరలోనే మీ ఫీల్డులోకే ప్రవేశించబోతున్నాడు. పిండి వెన్నెలవంటి దేహచ్ఛాయగల అమ్మాయికావాలిట. మరి కళ్ళేమో సంపంగి పువ్వులా ఉండాలిట కనుక్కోరా....." అంటూ తమ్ముడినిచూసి తృప్తిగా నవ్వాడు.

రమేష్ ఆడపిల్లలా సిగ్గుపడ్డాడు. అతని మొహం ఎర్రబడింది.

"అన్నయ్య మాటలు నమ్మకండి..." అంటూ నవ్వాడు.

"ఎక్కడికోయ్ వెడుతున్నావ్?" అని అడిగాడు కృష్ణమూర్తి.

"పింగ్‌పాంగ్ ఆడడానికి వెడుతున్నా నన్నయ్యా"

"ఇవాల్టికి అలా షికారుకు వెళ్ళొద్దాం రావోయ్" అన్నాడు కృష్ణమూర్తి.

రమేష్‌కి వాళ్ళతో వెళ్ళటానికిఇష్టంలేదు. కాని, ఎలా చెప్పటం?

"ఆటకు వెళ్ళాలనుంటే వెళ్ళనీ" అన్నాడు శేషగిరి.

"అదిరోజూ ఉండేదేగా. ఈ రోజు మాతో వస్తాడులే" అన్నాడు కృష్ణమూర్తి.

ఇహ తప్పించుకోలేక పోయాడు రమేష్. విధిలేక బయలుదేరాడు

రత్న ఆశకు వేరే గుడ్డలు తొడిగి, అలంకారం చేసింది, తనూ, చీర మార్చుకుని బయల్దేరింది.

కబుర్లలో రానురాను శేషగిరి గమనం కృష్ణమూర్తి నుండి రమేష్ వైపుకు తిరిగింది. ఎంతయినా వృత్తి బాంధవులు. ఆ గొడవలే మాట్లాడుకో సాగారు. ఇహ కృష్ణమూర్తి విధిలేక ఆశను మాట్లాడించ సాగాడు. చివరికి ఆ గుంపులో రత్న ఒంటరిగా మిగిలిపోయింది. శాంతయినా ఉంటే, బావుండేది అనుకుందేమో.

ఇంటికి వెళ్ళిపోతే బావుండుననిపించింది. కాని, ఎవరికీ ఆ ఆలోచన ఉన్నట్టులేదు. రత్న అర్థగర్భితంగా చూసినా, శేషగిరి గమనించే స్థితిలో లేడు.

బయలుదేరినప్పటినుండి నోరు మెదపకుండా నడుస్తున్న రత్నను చూసి, జాలేసింది రమేష్‌కి. ఆమెకు విసుగ్గా ఉందేమో పలకరిద్దామనుకున్నాడు. కాని, ఏమని పలకరించటం? తల్లిని మెప్పించగలగటం పిల్లల ద్వారానే కదా!

"ఆశను బళ్ళో వేశారా ?"

"లేదు."

ఆ సంభాషణ అక్కడికి ఆఖరయింది. ఆమెను మాటల్లోకి దింపటం చాలా కష్టమనిపించింది రమేష్‌కి. మితభాషిణి అనుకున్నాడు.

"వదిన ఉంటే, మీకింత విసుగనిపించేదికాదు" అన్నాడు రమేశ్.

"విసుగేమీలేదు..." అంది రత్న నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"అలాకాదు. మా సైతస్కొప్పు, పల్సుల ప్రపంచం మీాకేం నచ్చుతుంది?"

"శతస్కొప్పుహారం వేసుకునేవాళ్ళకి హారం వేశాక, మరి అన్నీ నచ్చాల్సిందే" అంటూ నవ్వాడు కృష్ణమూర్తి.

రత్న మాట్లాడలేదు.

కాఫీహోటల్‌నుంచి ఇంటికి పోదామనుకున్నపుడు రత్న హాయిగా నిట్టూర్చింది. ఇంటికిరాగానే పంజరంనుండి బయట పడ్డ పిట్టలా సుశీలమ్మగారి వద్దకు వెళ్ళింది.

"ఎక్కడికి వెళ్ళి వచ్చారమ్మాయ్" అని అడిగారు సుశీలమ్మగారు.

"ఇక్కడనుండి వెళ్ళి అక్కడ కాఫీ హోటల్‌లో కూర్చు న్నాం" అంది రత్న.

"ఏమీా చూడడానికి వెళ్ళలేదేం ?"

"కబుర్లతోనే సరిపోయింది."

"రమేష్ స్వభావమే అంత. కబుర్లలో పడ్డాడంటే, మరింకేమీా అక్కర్లేదు వాడికి. వదిన పుట్టింటికి వెళ్ళిన దగ్గ ర్నుండి ఇంట్లో మాటలే తగ్గించేశాడు."

"వాళ్ళు వదినదగ్గర చాలా చనువనుకుంటాను. మీా చిన్నబ్బాయికి."

"ఊఁ. తనే అలా అలవాటు చేసింది. ఇక భోజనానికి వస్తారా ?"

రత్న ఆవిడకు వడ్డించడంలో సాయపడింది.

రెండురోజులు మాత్రం ఉండి శేషగిరి దంపతులు మూడువరోజున ప్రయాణమయ్యారు. స్నేహితుడిని మరో

నాల్గురోజులు నిలుపుకోవాలని కృష్ణమూర్తి ఎంతో ప్రయత్నించాడు.

"వీల్లేదురా! సెలవులేదు. వెళ్ళితీరాల్సిందే" అన్నాడు శేషగిరి.

"ప్రైవేట్ ప్రాక్టీసుకదా నీది ? నీకు సెలవేమిటి ?"

"నా రోగులు గతో" అంటూ నవ్వాడు శేషగిరి.

రెండ్రోజులు కలకలలాడుతున్న ఇల్లు, శేషగిరి, రత్న ఆశ వెళ్ళిపోగానే బావురుమంది.

"ఏమీ తోచటంలేదు. శాంతను పిలిస్తే బావుంటుంది" అంటూ గొణిగారు సుశీలమ్మగారు.

రమేశ్ వెంటనే వదినెకు ఉత్తరం రాశాడు.

"అమ్మకు ఏమీ తోచడంలేదట. మీరు వెంటనే రావాలట."

రమేష్ ఉత్తరానికి శాంత నాన్నగారు జవాబు రాశారు; శాంత ఆరోగ్యం ఏమాత్ర బాగుండటంలేదని.

కోడలి అనారోగ్యం విషయం విని, మామగారు శాంత తండ్రికి ఉత్తరం రాశారు. అది చూసుకుని ఆయన కూతుర్ని తీసుకొని వచ్చాడు.

శాంత నవ్వుతూ ఇంట్లోకి అడుగుపెట్టింది. నవ్వొక్కటే ఆమెలో ఉన్నవస్తువు అనిపించింది రమేష్‌కి. సామాన్యంగా

దేన్నీ గమనించని కృష్ణమూర్తి కూడా భార్య ఇలా కృశించి పోవటం చూసి కంగారుపడ్డాడు.

ఎముకల గూడులా వున్న కోడల్ని చూసి సుశీలమ్మగారి కళ్ళలో నీళ్ళు నిండాయి శాంత కళ్ళు మునుపటి కళ్ళ కాంతులను కోల్పోయి నిర్జీవంగా ఉన్నాయి.

# 4

రమేశ్! మీ వదినకు ఏదైనా మందు చూడరా" అంటూ వాపోయాడు కృష్ణమూర్తి.

"పుట్టింట్లో రాజోపచారం జరుగుతుందని వెళ్ళి నెలల తరబడి కూర్చుంటే మనమేం చెయ్యగలం" అన్నాడు రమేశ్ మోటుగా.

"ఇంకా నెలకూడా పూర్తికాలేదు" అంటూ గొణిగింది శాంత.

"దగ్గర దగ్గర నెల కావస్తోంది. ఆరోగ్యం బాగా లేనప్పుడు వెంటనే బయల్దేరటానికేం" అంటూ వదినమీద విరుచుకుపడ్డాడు రమేశ్.

"అయిందేదో అయింది ఇప్పుడేం చేద్దామో చెప్పు" అన్నారు శేషగిరిరావుగారు.

"నాకేం తెలీదు. మీ ఇష్టం. ఏమైనా చేసుకోండి" అన్నాడు రమేశ్.

"నీ కివ్వాల్సిన ఫీజు నీకు ముట్టచెబుతాలే" అంది శాంత.

రమేశ్ కోపంగా వదిన మొహంలోకిచూసి ఊరుకున్నాడు.

అతడి కోపం తగ్గేసరికి పొద్దుగూకింది.

మర్నాడే శాంతను తీసుకుని హాస్పిటల్‌కు వెళ్ళాడు రమేశ్. డాక్టరు ఆమెను పరీక్షించి హాస్పిటల్‌లోనే ఉండాలని చెప్పారు. శాంత అక్కడే ఉండిపోవటానికి ఏ మాత్రం ఇష్టపడ లేదు.

కాంతిహీనమైన కళ్ళను పెద్దవిగాచేసి రమేష్‌వైపు చూస్తూ:

"ఉహుఁ" అంది.

రమేశ్ కూడా తన కళ్ళను అంతే పెద్దవిగాచేసి వదినను బెదరించాడు.

"ఇక్కడ ఉండటం మంచిది. మేము పరీక్షచేసి చికిత్స చేయటానికి వీలుగా ఉంటుంది. తరువాతవస్తే, మా బాధ్య తేమీ ఉండదు" అన్నాడు డాక్టరుగారు.

"ఇక్కడే ఉంటారు" అన్నాడు రమేశ్ శాంతకు బదు లుగా.

ఆ మాట విని శాంతకు ఏడుపువచ్చింది.

"ఇంటో ఎవర్నీ అడగక్కర్లేదా ?"

"నేను చెప్తున్నాగా చాలదూ? ఎవర్నో ఎందుకు అడుగటం? రేప్రు నేనేవచ్చి అడ్మిట్ చేస్తాను."

రమేష్ నిర్ణయంచూసి శాంతకు దిక్కుతోచ లేదు.

దారిపొడుగునా మరిదితో దెబ్బలాడుతూనే వచ్చింది.

"నీకు నేనంటే పడదు. అందుకే నన్ను ఆసుపత్రిలోపడేసి ఇంటో హాయిగా ఉందామనుకుంటున్నావు. నేను అక్కడే చచ్చి పోవాలనే నీ కోరిక"

రమేశుడు అవేమీ పట్టించుకోకుండా:

"రోగులమాట పట్టించుకోరాదు" అన్నాడు.

శాంతను ఆస్పత్రిలో చేర్చటం నిశ్చయమైపోయింది. శాంత ప్రతిఘటన లెక్కచెయ్యకుండా సుశీలమ్మగారు, రమేష్ బలవంతాన శాంతను హాస్పిటల్లో అడ్మిట్ చేశారు. తన మాట వినకుండా హాస్పిటల్లో పడేశారన్న కోపంతో శాంత ఆరోజు అన్నంకూడా తినలా.

రమేష్ కాలేజీ, హాస్పటల్ ఎదురుగానే ఉండటంవల్ల తనకు తీరికున్నప్పుడల్లా వదినదగ్గిరే కూర్చునేవాడు. ఆ వాతా వరణం, హాస్పిటల్ జీవితం విసుగుపుట్టించకుండా ఉండేం దుకుగాను పత్రికలూ, పుస్తకాలు తెచ్చి యిచ్చేవాడు.

ఓ సాయంత్రం రమేష్ వచ్చేసరికి శాంత నిద్ర పోతోంది. పత్రికచూస్తూ కూర్చున్నాడు.

"రమేష్" అనే పిలుపు విని, వదినవైపు చూశాడు రమేష్.

"హాస్పిటల్లో ఉండటంకూడా ఓ విధంగా చాలా బావుంది."

"ఎందుకేమిటి?"

"మునిపటికన్నా ఎక్కువసేపు నిన్ను చూడ గలుగు తున్నాను. ఇంట్లో ఉన్నప్పుడు నువ్వు కనబడటమే గగన మయ్యేది."

"మీరిలా మాట్లాడితే ఏం చెప్పాలో తెలియటం లేదు."

"అకస్మాత్ గా నేను చనిపోతే ఎవ్వరూ బెంగ పెట్టుకో కండి" అతి సహజంగా అంది శాంత.

"ఛా, అవేం మాట లాడినా?"

"ఏమిటో అలా అనిపిస్తోంది. చెప్పాను."

"మీ కేమయిందనీ. చావటానికి? ఇక్కడి కొచ్చాక మూడు వంతులు నయమయింది."

రమేశ్ భరోసా చూసి చిరునవ్వు నవ్వింది శాంత.

"మృత్యు నిరీక్షణలో ఉన్నాను నేను" అంది మెల్లిగా.

"మీకు భ్రమ; అంతే."

"లేదు రమేశ్! నాకు దాని అడుగుల చప్పుడు విని పిస్తోంది. రోజు రోజుకు క్రుంగిపోతున్నట్టు, మునిగిపోతున్నట్టు అనిపిస్తోంది. నేను చనిపోతే మీ అన్నయ్యను మరో పెళ్ళిచేసు కోమను. నువ్వు..."

"నేను వెళ్ళిపోతున్నాను" అంటూ కుర్చీని వెనక్కి తోసేసి అగ్నిపర్వతంలా నిప్పులు కురిపిస్తూ గాలిదుమారంలా బయటికి వెళ్ళిపోయాడు.

మర్నాడు రమేష్ హాస్పిటల్ కు రానేలేదు. భర్త అత్త గారు వచ్చినప్పుడు శాంత!

"రమేశ్‌ని ఓ మారు పంపండి" అని చెప్పింది.

సుశీలమ్మగారు ఆశ్చర్యంతో!

"ఈరోజు రానేలేదా" అన్నారు.

"లేదు."

"మీ రేమైన దెబ్బలాడుకున్నారా?" కృష్ణమూర్తి అడిగాడు.

"దెబ్బలాటలేదు; ఏమీలేదు."

"వాడేమన్నా దురుసుగా మాట్లాడితే పట్టించుకోకు" అని కృష్ణమూర్తి భార్యను ఓదార్చాడు.

"రమేశ్ రేపు రాకపోతే, నేను మందు తాగను. అలాగని అతనితో చెప్పండి" అని భర్తతో చెప్పింది శాంత.

"నేను చెప్తానుకో. కాని, వాడు రాకపోతే మేము బలవంతంగా పంపటానికి వీలుపడుతుందా? మందు తాగనని మాత్రం పట్టుపట్టకేం" అన్నాడు కృష్ణమూర్తి.

"అతడు రాకపోయినపుడుకదా! మీరు నా మాట చెప్పండి. తప్పక వస్తాడు" అంది శాంత ఆత్మవిశ్వసంతో.

ఆమాటే నిజమయింది. మరునాడు రమేష్ ధుమధుమలాడుతూ వార్డులోకి అడుగుపెట్టాడు.

"నిన్న రాలేదేం?"

"ఇలా బెదిరించి నన్ను రప్పించుకోవటంవల్ల మీకు కలిగిన లాభం ఏమిటో అడగొచ్చా?"

శాంత నవ్వింది: "లాభమా! నువ్వు ఇక్కడికి రావటమే నాకు పెద్ద లాభం."

"మీరు పిచ్చిపిచ్చిగా వాగుతూండండి. నేనేమో వింటూ కూర్చుంటాను. నే నేం రాతిబొమ్మ ననుకున్నారా? మీ మాటలు ప్రవాహానికి రాతిబొమ్మకూడా కొట్టుకుని పోతుంది తెలుసా?"

"రమేష్! నా కేమనిపిస్తుందో చెప్పనా? ప్రతీ మనిషి ఓ రాతిబొమ్మే. రాతిబొమ్మలు ఊపిరి పీల్చవు. మనం ఊపిరి పీలుస్తాం అంతే తేడా వాటికి మనకు."

రమేశ్ రెచ్చిపోయి "మనుష్యుల్ని రాతిబొమ్మలతో పోల్చటం చాలా అన్యాయం వదినా! మనకు హృదయముందన్న విషయం మరచిపోతున్నారు" అన్నాడు.

"హృదయమంటే ఏమిటో డాక్టరవబోతున్న నీకే నాకన్నా బాగా తెలిసి ఉండాలి."

"మనకు అనుభవాలంటూ వుండవా? సంతోషమయితే సంతోషిస్తాం. దుఃఖంకలిగితే ఏడుస్తాం. మనం అన్నిటినీ అనుభవిస్తాం. అవునా కాదా? మనుషులను రాతితో పోల్చే మీ మాటలను వెనక్కు తీసుకోండి వదినా.

రమేశుడి ఉద్రేకాన్ని చూసి శాంత నవ్వింది.

"మాటల ప్రవాహం అన్నావుగా. అదే తీసుకో. రాతిబొమ్మకూడా ప్రవాహంలో పడితే, తడిసి పోతుంది. గాలి, ఎండ తగిలి క్రమంగా ఆరిపోతుంది. అలాగే, మానవుల మనస్సుకూడా అంటున్నా. సుఖదుఃఖాలు ఎంతసేపుంటాయి. కాల ప్రవాహంలో అన్నిగాయాలూ మానిపోతాయి."

రమేశ్ వ్యంగ్యంగా!

"సరే! ఇంత వేదాంతం చెపుతున్నారే ఈ మాటకు సరిగ్గా జవాబు చెప్పండి చూద్దాం. నన్నెందుకింత పట్టించు కుంటున్నారు ? చెప్పండిమరి" అన్నాడు ఈ దెబ్బతో వదినను ఓడించాడనుకున్నాడు రమేశ్.

శాంత వాడిపోయిన మొహంలోకి చిరునవ్వు తొంగి చూసింది.

"దానికి కారణముంది. అందులోనూ స్వార్థమే ఉంది."

"స్వార్థమా ?"

"అవును. నాకో బిడ్డ పుట్టిఉంటే, నీవైపు కన్నెత్తికూడా చూసేదాన్ని కాదేమో. మనసులో మమత పేరుకున్నప్పుడు దానిని ప్రవహింపక చెయ్యకపోతే భరించలేం. ఆ బరువు దింపు కోవటం స్వార్థంకాదా ?"

శాంత నవ్వుతూ మాట్లాడినా, ఆమె కంఠం క్షీణంగా

"ఇహ మాట్లాడకండి వదినా! మీకు ఆయాసమవు తుంది."

"కళ్ళున్నంతవరకూ చూపు; నాలికున్నంత వరకూ మాట."

"మీరు ఇలా మాట్లాడితే నేనసలు రానేరాను. నేను రావాలనుంటే, మీరు ఇలా మాట్లాడటం మానెయ్యాలి."

"లేదులేరా. ఇహ ఇలా మాట్లాడనులే" అని భరోసా ఇచ్చింది శాంత.

ఏ దుర్ముహూర్తంలో "కళ్ళున్నంతవరకూ చూపు, నాలి

కున్నంతవరకూ మాట" అని శాంత అన్నదోకాని, ఆమాటే నిజమయింది.

రాత్రి పదిగంటల ప్రాంతంలో డాక్టరు ఆఖరిరౌండుకు వచ్చినప్పుడు శాంతవైపు చూసి.

"ఎలా ఉన్నారు?" అని అడిగారు.

శాంత మాట్లాడలేదు. ఊరికే కళ్ళుప్పగించి డాక్టర్నే చూసింది. ఆమె కనురెప్పలు మూతపడగానే రెండు కన్నీటి బిందువులు ఆమె చెక్కిళ్ళమీదుగా జారిపోయాయి. ఆమె పెదిమలు చలించాయి. కాని మాట బయటికి రాలేదు.

డాక్టరు దగ్గరగావచ్చి ఆమె దుర్బలహస్తాన్ని తన చేతిలోకి తీసుకుని "ఎలా ఉన్నారు ?" అన్నారు.

శాంత మాట్లాడలేదు. కన్నీళ్ళు ముత్యాలలా ఆమె చెక్కిళ్ళమీద ప్రవహించసాగాయి.

"మాట్లాడలేరా ?"

శాంత తల అడ్డంగా తిప్పింది. డాక్టరు, నర్సువైపుకుతిరిగి "ఎప్పటినుండి ఇలా అయింది" అని అడిగారు.

"సాయంకాలం బాగానే మాట్లాడారు. బహుశా ఎనిమిది గంటల తరువాతనే ఇలా అయుండాలి" అంది నర్సు.

డాక్టరు మళ్ళీ శాంతను మాట్లాడించటానికి ప్రయత్నించారు. కళ్ళనుండి ప్రవహించే కన్నీరే లేకపోయినట్టయితే ఆమెను చెక్కబొమ్మ అని తేలిగ్గా చెప్పవచ్చును. ఆఖరికి డాక్టరుగారు తమ ప్రయత్నంలో విఫలులై వెళ్ళిపోయారు.

మరునాడు ఉదయం కాఫీ తెచ్చిన కృష్ణమూర్తికి ఈ వార్త పిడుగులా తగిలింది. కాఫీగ్లాసులోకిపోసి 'తాగు'అన్నాడు.

శాంత మాట్లాడలేదు.

"నేనే తాగిస్తాను" అంటూ కృష్ణమూర్తి కొ ద్దిగా కాఫీ తాగించాడు.

"ఎలా ఉంది నీకు? ఊరికే ఏడవకు శాంతా! నీకు తొందర్లోనే నయమవుతుంది" అంటూ ఆమె కన్నీళ్ళను తుడిచాడు కృష్ణమూ ర్తి.

శాంత పెదవులు చలించాయి. కన్నీటి ప్రవాహం కట్టలు తెంచుకుంది.

"ఆమె మాట్లాడలేక పోతున్నారు" అని చెప్పారు పక్కమంచంమీదున్నావిడ.

"ఆఁ"

"నిన్న రాత్రినుండి ఇలాగేఉంది. అప్పటినుండి ఏడుస్తూనే ఉన్నారు."

శాంతా! ఏమయిందో చెప్పవూ? గొంతునొప్పిగా ఉందా..." గబగబా మెడికల్ కాలేజీకి పరుగెత్తాడు కృష్ణమూ ర్తి.

కనిపించిన విద్యార్థిని అడిగాడు: "ఫైనల్ ఇయర్‌లోని రమేష్ ఎక్కడుంటాడో తెలుసా?"

"తెలీదు."

ఇంకా కొంతమందిని అడిగాక కాని, రమేష్ ఉండేచోటు కనుక్కోలేకపోయాడు కృష్ణమూ ర్తి. ఆఖరికి రమేశ్ కృష్ణ రాజేంద్ర హాస్పిటల్‌కు వెళ్ళాడని తెలిసింది. కృష్ణమూర్తి తమ్ముడిని వెతుక్కుంటూ పరుగుతీశాడు.

జనరల్ వార్డులో రోగిజబ్బుగురించిన చార్టుచూస్తూ నిల్చున్నాడు రమేశ్. రోగితో పరిహాసంగా మాట్లాడుతూ ఉండటంవల్ల అతడి మొహంమీద నవ్వు వెలుగుతోంది.

కృష్ణమూర్తి వార్డులోకి పరుగెత్తుకుంటూవచ్చి, "రమేశ్ తొందరగా రా" అన్నాడు.

అన్నయ్య మొహంచూసి రమేశుడి కాళ్ళూ, చేతులూ ఆడలేదు.

"ఏమయిందన్నయ్యా ?" అనే రమేశుడి కంఠంలోని ఆర్ద్రతను గమనించి కృష్ణమూర్తి ధైర్యం తెచ్చుకున్నాడు.

"కంగారేంలేదుగాని, శాంతకు రాత్రినుండి మాట్లాడ టానికి చేతకావటం లేదట. ఊరికే ఏడుస్తుంది. నువ్వోసారివచ్చి పలకరించిచూడు" అన్నాడు కృష్ణమూర్తి.

రమేశ్ వెంటనే అన్నయ్యతో కలిసి హాస్పిటల్‌కు వెళ్ళాడు.

అంతకుముందురోజు శాంత అనిన "నాలికున్నంతవరకూ మాట" అనే వాక్యం అతడి చెవుల్లో గింగురుమంటోంది.

రమేశుడిని చూడగానే శాంత దుఃఖం మరింత ఎక్కు వయింది.

"వదినా! మీకు ఏమవుతుంది చెప్పండి. నాతోకూడా మాట్లాడరా మీరు ? మామీద కోపం కాదుకదా ?"అంటూ ఎన్నో విధాలుగా పలుకరించాడు రమేశ్.

వాటి కన్నిటికీ ఒక్కటే జవాబు కన్నీరు.

రమేష్, ఆస్పత్రి ప్రధాన వైద్యులను చూడటానికి వెళ్ళాడు. ఆమె లేబర్ వార్డులో ఉందని తెలిసి, బయట బెంచి

మీద కూర్చున్నాడు. తను లోపలికి వెళ్ళటానికి వీల్లేదు. బయటనే కూర్చుని నిమిష నిమిషానికి తలుపువైపుకే చూస్తూ, ముళ్ళమీద కూర్చున్నవాడిలా మహా ఆరాట పడుతున్నాడు.

ఆఖరికి బయటకు వచ్చిన నర్సును అడిగాడు :

"డాక్టరుగారు ఏంచేస్తున్నారు ?"

"పోర్సెన్స్ కేసు అటెండ్ చేస్తున్నారు" అనిచెప్పి చకచకా వెళ్ళిపోయింది నర్సు.

లోపలనుండి వినబడుతున్న మూలుగు, ఏడుపు, అరుపులు వింటూ, బయట కూర్చున్నాడు రమేశ్.

ఈ విధంగా లేబర్ వార్డుముందు కాచుకూర్చునే రోజుకోసం ఎన్నేళ్ళు ఎదురుచూశాడు తను !

ఆఖరికి ఆరోజు రానేలేదు.

ఒక్కసారి పెళ్ళయిన పదేళ్ళ తరువాత, శాంత తల్లి కాబోయే సూచనలు కనబడినప్పుడు ఇంట్లో అందరూ సంతోషంతో పొంగిపోయారు.

అంతవరకూ ఇంట్లో అందరికీ "బిడ్డ" అయిన రమేశుడికి అప్పటినుండే తను పెద్దవాడన్న భావం కలుగసాగింది.

కాని, రెండు నెలలకే తాము కన్న కలలన్నీ కల్లలయినపుడు ఇంట్లోనివారికి కలిగిన నిరాశమాత్రం ఎంతటిది !

ఆ రోజు రమేశ్ శాంతను చూడటానికి వెళ్ళినపుడు, ఆమెను అప్పుడే వార్డులోకి తెచ్చి పడుకోబెట్టారు.

తెల్లటి పక్కమీద అంతకన్నా తెల్లగా పాలిపోయిన శాంతను చూసినపుడు రమేశుడి హృదయం దుఃఖంతోనూ,

జాలితోనూ నిండిపోయింది. అసలే బాధ పడుతున్న ఆమెను మరింత బాధపెట్టడం కష్టంలేక నవ్వుతూనే పలకరించాడు.

"ఎలా ఉన్నారు వదినా ?"

"కులాసాగానే ఉన్నాను."

"ఇప్పటినుండి ఆరోగ్యం బాగా చూసుకోండి ఇంకోమారు. ఇలా కాకుండా..."

ఆ మాటవిని శాంత వెక్కి-వెక్కి ఏడ్చింది.

రమేశుడు కోపంగా, "వదినా! మీకు చాలా దురాశ" అన్నాడు.

"ఏం ?"

"నాకన్నా మంచికొడుకు కావాలనుకోవటం దురాశ కాదా ఏం ? నాలో మీకేం లోటు కనిపించింది చెప్పండి. చూడడానికి అందంగా లేనా? చదువు లేదా ? మంచివాడినికాదా చెప్పండి. మీరిలా ఏడిస్తే నామీద ఒట్టే."

ఆ మాటలువిని అంతఏడుపు మధ్యలోనూ చిరునవ్వు నవ్వింది.

"నువ్వొక బంగారుకొండవి" అంది.

"ఏడవనని మాటివ్వండి మరి నాకు"

"ఏడవనులేరా బాబూ."

"ఏడవడానికి మీకేమయిందేమిటి ? మీ ప్రేమను మాకంతా పంచిపెట్టండి. దానికి మీబిడ్డే కావాలని లేదు."

రమేశుడి మాటలతో తేరుకుంది శాంత.

కాని ఇప్పుడో ?

మళ్ళీ తేరుకోగలదా? ఎందుకో రమేశుడికి అనుమానం వేసింది.

లోపలనుండి పసిబిడ్డ ఏడుపువిని, తన ఆలోచనలనుండి బయటపడి తలుపువైపుకు చూసాడు.

డాక్టర్ బయటకు రాగానే, రమేశ్:

"డాక్టర్! వదినకు మాట పడిపోయింది. మీరొకో మారువచ్చి చూడండి" అన్నాడు.

డాక్టర్ శాంతను మళ్ళీ ఆమూలాగ్రంగా పరీక్షించారు. ఆమె బయటికి వెళ్ళగానే, తనూ ఆమెను అనుసరించి వెళ్లాడు. ఆమె మొహంలో నిరాశ స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆశ లేదా డాక్టర్" అన్నాడు రమేశ్ ఆదుర్దాతో.

"నాకూ కొంచెం అనుమానంగానే ఉంది. ఇప్పుడే ఏమీ చెప్పలేను. వెన్నెముకలో నీరు చేరింది. దాన్ని తీసెయ్యాలి. ఆమె అదృష్టమే ఆమెను కాపాడాలి" అని నిట్టూర్చి, గబగబా అక్కడినుండి వెళ్లిపోయారు.

తన కళ్ళముందు ప్రపంచమంతా గిర్రున తిరిగినట్లనిపించింది రమేశుడికి.

అలాగే గోడకానుకుని నిల్చున్నాడు. ఒక్క నిముషం డాక్టరుగారు చెప్పిన విషయాన్ని అర్థంచేసుకుని జీర్ణించుకోవడానికి ప్రయత్నించాడు. తరువాత నెమ్మదిగా తేరుకుని, లేనినవ్వు మొహంమీదికి తెచ్చుకుని, రంగస్థలంమీదకువెళ్ళే నటునిలా శాంతదగ్గరకు వచ్చాడు.

శాంత మంచం ప్రక్కనున్న కుర్చీమీద కూర్చున్న కృష్ణ

మూర్తి మౌనంగా తమ్ముడివైపు చూసాడు. రమేశ్ వదిన కూడా వినిపించేలా!

"బలహీనతవల్ల ఇలా అయిందట. కంగారు పడనక్కర్లేదు. నయమవుతుందన్నారు" అన్నాడు.

ఆ మాటలువిని, శాంత విషాదంగా నవ్వింది.

కృష్ణమూర్తి ఆఫీసుకు టైమయిపోతోందని లేచాడు.

"నేను వెళ్ళనా శాంతా?"

శాంత తలూపింది.

"మళ్ళీ సాయంకాలం వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

రమేష్ శాంతను పలకరించటానికి పలువిధాల ప్రయత్నించి విఫలుడయ్యాడు.

"ఆడవాళ్ళు ఎక్కువగా మాట్లాడటం మంచిదికాద"ని ఏ విషగడియలో అన్నాడో తను?"

ఒక్క నిమిషంకూడా మాట్లాడకుండా ఊరుకోలేని మాటకారి వదిన ఇప్పుడు మాట్లాడకుండా ఎలా ఉందో? ఆమె హృదయంలో ఎంతటి కల్లోలం బయలుదేరిందో ఎవరికి తెలుసు? ఎవరితో మాట్లాడకపోయినా, తను మాట్లాడితే ఎలాగయినా మాట్లాడగలుగుతుందని ఆశ పెట్టుకున్నాడే తను! తనతో ఇహ వదిన మాట్లాడదా?

అతడికళ్ళలో నీళ్లు తిరుగుతున్నాయి. గద్గదకంఠస్వరంతో "వదినా! మాకింత కఠినశిక్ష విధించకండి. మేమెవ్వరం ఏ తప్పూ చేయలేదు" అంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

పదిహేనురోజులు తనలోని బాధను ఎవరితోనూ చెప్పుకోలేక మూగబాధ అనుభవించింది శాంత. తనను చూడటానికి వచ్చినవారిని కనురెప్ప వేయకుండా దీనంగా చూసేది. వాళ్ళ సాంత్వన వచనాలు వినగానే ఆమె కళ్ళనుంచి అశ్రుప్రవాహం ప్రవహించేది. వాళ్ళు యిక వెళ్ళిపోవాలని బయలుదేరగానే, తన దుర్బలహస్తాన్ని చాచి, వాళ్ళచేతిని పట్టుకునేది.

కృష్ణమూర్తి, రమేశులకు ఆమెచేతి పట్టునుండి విడిపించుకుని బయటపడటం అతి ప్రయాసగా ఉండేది.

పదిహేనురోజుల తరువాత ఆమెదృష్టి శూన్యమయిపోయింది. ఇంతవరకూ బయటప్రపంచం, మనుష్యులను గుర్తించే జ్ఞానం ఉండేదామెకు. కాని, ఇప్పుడామెదృష్టి దిగంతాల కావల దాక్కున్న కాలదూతకోసం చూస్తున్నట్లుండేది.

ఆమె ఒళ్ళో?

వట్టిగాజు; సూర్యరశ్మికూడా మెరవనిగాజు.

ఆమె ఇప్పుడు జీవచ్ఛవం, ఎవరైనా తనను చూడవస్తే సంతోషం లేదు. రాకపోతే దుఃఖమూ లేదు. సుఖదుఃఖాలు, ఆకలిదప్పులు—వీటన్నిటినుండి దూరమయిపోయింది.

చూడవచ్చినవాళ్ళు ఎన్నో విధాలుగా ఆమె గుణగణాలను పొగడుతూ, కళ్ళనీరు పెట్టుకునేవారు.

శిలాప్రతిమ ముందు తల పగలకొట్టుకున్నట్టే వాళ్ళ కన్నీరు, దుఃఖం శాంతను తాకేదికాదు.

కృశించిన ఆమె చేతివేళ్ళు మాత్రం అస్తమానం జడను విప్పుతూ, అల్లుతూ ఉండేవి. తన నుదురు, తల వీటిని చేతితో నిమురుకుంటూ ఉండేది. అప్పుడప్పుడు పక్కనేవున్న పేముకుర్చీ

మీాద వేళ్ళతో కొట్టి శబ్దంచేసి, తనలో తానే నవ్వుకుంటూ ఉండేది.

ఒక విధమైన అపూర్వమైన ప్రశాంతి ఆమె మొహాన్ని ఆవరించింది.

కృష్ణమూర్తి రమేశులకు పిచ్చిపట్టినట్లయింది.

ఆఖరికి డాక్టరుగారు శాంత జబ్బును "మెలింజైటిక్" అని పేరు పెట్టారు.

"ఆశేమీాలేదా డాక్టర్" అని రమేశుడు అడిగినపుడు డాక్టర్ బదులేమీా చెప్పకుండా విషాదంగానవ్వి, తల అడ్డంగా తిప్పి వెళ్ళిపోయారు.

శాంత మంచం ప్రక్కనే అటూ, ఇటూ కుర్చీలు వేసుకుని కూర్చునేవారు కృష్ణమూర్తి, రమేష్.

చేపట్టిన భర్తని, ఇన్నేళ్ళుగా తనను ప్రేమతో ఆదరించిన మరిదిని గుర్తించే శక్తిని కోల్పోయింది శాంత.

జీవితం మీాదనున్న వ్యామోహామే ఆమె నింతవరకూ జీవించేట్లు చేసింది.

తనకు ఆకలిగా ఉందన్న విషయం కూడా ఆమెకు తెలిసేదికాదు, సుశీలమ్మగారే టైంప్రకారం ఆహారం ఇచ్చేవారు.

ఆమెకు చావటం అంటే యిష్టం లేదేమో?

మృత్యువుతో పోరాడి పోరాడి అలసిపోయింది శాంత.

ఆరోజు పున్నమి. ఆరాత్రి డాక్టరుగారు శాంతను పరీక్షించి, "ఈరాత్రి గడవటం కష్టం. మీారిక్కడే ఉండేటట్లయితే ఉండవచ్చు" అని చెప్పారు.

కస్తూరి అంతిమయాత్ర చూడటానికి శాంత తలి దండ్రులుకూడా వచ్చారు.

స్పెషల్‌వార్డు కనుక శాంత బంధువర్గమంతా సంకోచం లేకుండా రోదించింది.

వైద్యుల చికిత్సలన్నీ విఫలమయ్యాయి.

ఆరోజు పూర్ణిమ. కాని శాంత ఆత్మీయులకది అమా వాస్య.

రాత్రి పదిగంటల ప్రాంతంలో శాంత తన ఆత్మీయుల నందరినీ దుఃఖసముద్రంలో ముంచి తెలియని లోకానికి పయ నమై పోయింది.

అప్పుడప్పుడూ అవ్యక్త వేదనతో ముకుళించుకుని పోయే ఆమె మొహం ఇపుడు ప్రశాంతంగా వుంది.

ఆమె హృదయంలో ఎన్ని ఆశలు, ఆకాంక్షలు ఉండేవో అన్నీ అనంత వాయువులో లీనమైపోయాయి.

"పునిస్త్రీ చావు; పుణ్యం చేసుకుంది" అంది ఆ భాగ్యం లేని ఓ స్త్రీ.

"జీవితంలో ఏమీ అనుభవించకుండానే వెళ్ళిపోయే పునిస్త్రీ చావు ఎలాంటిది!"

కృష్ణమూర్తి హృదయం విదీర్ణమయింది.

సుమారు నెలరోజులుగా హాస్పిటల్‌కూ, ఇంటికీ ఆదు ర్దాగా తిరుగుతున్న అందర్నీ ఒక్కసారిగా నిర్లిప్తత ఆవరించింది.

మరుగుతున్న నీళ్ళను దింపగానే చల్లారిపోయినట్టు, వాళ్ళ మనసుల్లో మరుగుతున్న ఆత్రుత, ఆవేదన కూడా ఒక్కసారిగా చప్పగా చల్లారిపోయాయి.

అస్తమానం ఇంటో వాళ్ళందరికి "శాంత ఎలావుందో" అనే బెంగే ఉండేది.

కాలేజీలో పాఠం వింటూండగా రమేశుడికి "వదిన ఎలా వున్నారో" అనిపించగానే, ఏదో కారణం కల్పించుకుని బయటకు వెళ్ళేవాడు.

కాని, ఇపుడు అందరి హృదయాలనూ స్మశాన మౌనం ఆవరించింది.

## 5

శాంత లేని ఇంటికి తిరిగి వచ్చాడు కృష్ణమూర్తి.

ఆరాత్రి అతడి శోకం వర్ణనాతీతం.

గదినిండా శాంత గుడ్డలు పడిఉన్నాయి.

ఆ పిచ్చిపిల్లకు చీరల మోజు చాలా ఎక్కువ. తన కంటికి నచ్చిన చీరలన్నీ కొని, పెట్టెలో భద్రపరచేది.

కాని, కట్టుకునేదికాదు. కొనటంతోనే తృప్తిపడేది.

శాంతకున్న ఇంకో విచిత్రమైన కాంక్ష—బొమ్మలు అద్దాల బీరువాలో అందంగా అమర్చటం. బొమ్మలకొట్టు

ముందునుంచీ వెళ్ళేటప్పుడల్లా — శాంత ఏనీసం ఒక బొమ్మైనా కొనకుండా వచ్చేదికాదు.

కోడలు అనవసరంగా బొమ్మలుకోసం డబ్బు తగలెయ్యటం చూసి, ఓ మాటు సుశీలమ్మగారు:

"ఎందుకమ్మా శాంతా! ఇన్ని బొమ్మలు కొంటావు; దండగ" అన్నారు.

"పిల్లా పాపా లేని ఇంట్లో బొమ్మలెందుకు" అని కోడలి మనసు నొప్పించవలచుకోలేదావిడ.

తను అంతకు ముందురోజే తెచ్చిన బొమ్మకు గుడ్డలు కుడుతూ శాంత:

"బొమ్మలు కావలసి ఒస్తాయ్" అంది.

"ఎందుకు?"

"మరి మీరు రమేశుడికి పెళ్ళి చెయ్యరూ? అతడి పిల్లలకు ఆడుకోవటానికి బొమ్మలు అక్కర్లేదూ?"

"రమేశుడి పెళ్ళయి, పిల్లలు పుట్టి... ఓ ఎప్పటిమాటో నువ్వు చెప్పేది. అంతవరకూ మనం బ్రతికి ఉన్నప్పటి మాట" నిరుత్సాహంగా అన్నారు సుశీలమ్మగారు.

"ఎందుకమ్మా అలా అంటారు? రమేశుడి పెళ్ళి మనం చూడకపోవట మేమిటి? ఈ సంవత్సరం అయిపోగానే పెళ్ళి చేసెయ్యమూ."

అతడి పెళ్ళి తను చూసి తీరుతానన్న ఆత్మవిశ్వాస ముండేది శాంతకు.

"ఎంత బాగున్న పిల్లయినా నచ్చదుకదా నీ మరిదికి? కన్ను అలా ఉండాలి; ముక్కు ఇలా ఉండాలి అని నీముందు

గంటలకొద్దీ వర్ణిస్తాడు. వాడు వర్ణించినలాంటి పిల్ల భూమ్మీద ఉందా అసలు."

"అమ్మా! మొన్న మార్కెట్టుకు వెళ్ళినపుడు ఓ పిల్లను చూశాను. ఎంత బావుందంటారు. అందంగా ఉన్న అమ్మాయిలు కనబడినప్పుడల్లా రమేశ్ గుర్తొస్తాడు నాకు. మీ పెద్ద కోడలు ఎలాగూ అందంగా లేదు; చిన్నకోడలయినా అందంగా ఉండాలి."

"ఏం, నీ కేమయిందేమిటి ఇప్పుడు?"

"చెప్పనా?"

"చెప్పు చూద్దాం."

"నలుపు, పొట్టి' పెద్ద ముక్కు, చిన్న కళ్ళు..."

"చాల్చాలు; ఊరుకో. లేనిపోని మాటలు చెప్పి నాకు కోపం తెప్పించకు" అని అక్కడనుండి వెళ్ళిపోయేవారు సుశీలమ్మగారు.

రమేశుడి పెళ్ళి సుశీలమ్మగారు చూస్తారేమోగాని, శాంత ఏ దిప్పుడు?

కృష్ణమూర్తి అద్దాల బీరువాముందు నిల్చొని ఒక్కొక్క బొమ్మే తీసుకుని చూడసాగాడు.

భార్య మరణానంతరం మొదటి సారిగా అతడి కళ్ళలో నీళ్ళు ప్రవహించసాగాయి.

రమేశు నామమాత్రానికి చేతిలో పుస్తకం పట్టుకుని కూర్చున్నాడు. అతడి కళ్ళు మాటిమాటికి గడియారంవైపే చూస్తున్నాయి.

వదిన మాటా, పలుకూ, నవ్వూ అతని మనసును, కెలికి అల్లకల్లోలం చేస్తున్నాయి.

ఆమె తన్ను పన్నెండేళ్ళుగా ఎరుగును. అయినా ఆమె తన దుడుకు మాటలకు బాధపడుతూనే ఉండేది. అంత సున్నిత హృదయ మామెది. వదినతో మాటల మల్లయుద్ధం చెయ్యా లంటే వెయ్యి ఏనుగుల బలం వచ్చేది తనకు. కాని, ఆమె మౌన కలహం సాగించినపుడు మాత్రం ఓటమి తనదే.

తన చదువు గురించి, పెళ్ళి గురించి వదినె కెంత అసక్తి! ఎవరితోను చెప్పుకోలేని ఎన్నో విషయాలను వదినతో చెప్పు కునేవాడు తను. తన కష్టసుఖాలను ఆమెతో చెప్పుకున్నప్పుడే రమేశుడి హృదయం తేలికపడేది.

ఆమెతో ఆనందాన్ని పంచుకున్నప్పుడు అతని హృదయం సంతోషంతో పొంగిపోయేది.

రమేష్ లేచి నిల్చుని కిటికీనుండి బయటకు చూశాడు. ఆకాశంలో తెల్లటి మబ్బు తునకలు తేలిపోతున్నాయి. వెన్నెల నేలంతా పరచుకుంది.

ఒంటరిగా ఒక్క నక్షత్రమే నీలాకాశంలో వెలుగు తోంది.

రమేశుడి హృదయంలో అగ్ని రగుల్కొంది.

ఏ తప్పూ చెయ్యని, ఏ పాపమూ ఎరుగని వదిన తమం దరినీ వదలి ఇంత త్వరగా వెళ్ళిపోయిందెందుకు?

దేవుడు తనకు ప్రియమైనవాళ్ళను తొందరగా తన దగ్గ రకు రప్పించుకుంటాడట.

ఆ మాటల్లో ఎంతో నిజం దాగిఉందో!

దుఃఖావేగంతో హృదయం విదీర్ణమై కన్నీటి సముద్రం ఉడికిపోయి అక్కడే గడ్డకట్టి.

రమేశుడికి మంచంమీద పడుకుని వెక్కి-వెక్కి-ఏడవాలని పించింది. హృదయంలోని శోకాన్నంతా బయటకు కక్కి-వేసి, హృదయాన్ని తేలిక పర్చుకోవాలనిపించింది.

కాని, ఏడుపురాందే!

ఊహుఁ. అతడి కళ్ళనుండి ఒక కన్నీటి చుక్క-కూడా రాలలేదు. ఆఖరికి శాంత చితిలో కాలిపోతున్నప్పుడుకూడా అతడి కంట్లో నీరురాలేదు.

తన తల్లిదండ్రులు, శాంత తల్లిదండ్రులూ అందరూ శాంతను తల్చుకుని పెద్దగా శోకాలు పెడుతుంటే, రమేశుడు మౌనంగా, బిక్క-మొహం వేసుకుని ఏడవలేక తల్లిని పోగొట్టు కున్న పసివాడిలా అందరివైపు చూస్తూ నిల్చున్నాడు. ఆఖరికి ఏడుపురాక అవమానం పొందినట్టయి తన గదిలోకి వెళ్ళి పోయాడు.

వదిన చనిపోతే ఒక్క- బాష్పాంజలికూడా సర్పించలేడా తను!

రమేశుడి కళ్ళు అగ్నిగుండాల్లా ప్రజ్వలిస్తున్నాయి.

చల్లటి నీళ్ళతో మొహం కడుక్కు-ందామని బయటకు వచ్చాడు రమేశ్.

వసారాలో కూర్చుని అందరూ కళ్లు తుడుచుకుంటు న్నారు.

అయితే వదినమీద తనకులేని ప్రేమ వీళ్ళ కందరికీఉందా? తనకెందుకు ఏడుపు రావటంలేదు? సప్త సాగరాలు తన హృద

యంలో దాక్కున్నాయి. వాటి కల్లోలాన్ని భరించలేకుండా ఉన్నాడు రమేశ్.

ఇంతైనాకూడా అతనికి ఏడుపు రావటంలా.

ఏడుస్తున్న వాళ్ళందర్నీ చూసికూడా అతనికంట్లో నీరు రాలా. దానికి బదులు మహాక్రోధం ఉధృతంగా పొంగింది.

కాని, ఎవరిమీద ?

అందర్నీ పట్టుకుని చితగ్గొట్టి, తనూ తలపగులగొట్టుకుని చావాలనిపించింది రమేశుడికి.

గోడనానుకుని రెండుచేతుల్లోనూ తలపెట్టుకునికూర్చున్న శాంత తండ్రి మొహం రమేశుడి కంట బడింది.

గబగబా ఆయన ఎదుటకువెళ్ళి నిల్చుని గర్జించాడు:

“మీవల్లే అసలు వదిన చనిపోయింది. మీరెందుకు వదిన్ని ఆ పల్లెటూరికి తీసుకొని వెళ్ళారు ? అక్కడ ఓ మంచి డాక్టరుకూడా లేడే! అక్కడికి వెళ్ళినందువల్లే జబ్బు ముదిరి పోయింది మీరే చంపారు వదిన్ని...”

మొదట అతడేమంటున్నాడో ఎవ్వరికీ అర్థంకాలేదు అర్థంకాగానే అందరూ చకితులయ్యారు.

రమేశుడికి పిచ్చెత్తలేదుకదా !

“రమేశ్...” అంటూ గద్దించాడు తండ్రి.

రమేశుడి ఉద్రేకం చల్లారలేదు.

“మీరే చంపారు. ఇక్కడేఉంటే, వదిన్ని మేము చావ నిచ్చేవాళ్ళంకాదు జబ్బుగొంచెం ఎక్కువయినపుడన్నా; ఇక్క డికి తీసుకునిరాలేదెందుకు ? నాకు తెలుసు వదిన మమ్మల్ని

చాలా ప్రేమించేది. మీరది చూసి సహించలేకపోయారు. ఆ కడుపు మంటతోనే వదిన్ని చంపేశారు మీరు."

రమేశుడి కంఠస్వరం తారస్థాయి నందుకుంది.

కృష్ణమూర్తి గదితలుపులు నెమ్మదిగా తెరుచుకున్నాయి. ఆవేశంలో రమేశుడది గమనించలేదు. మిగిలినవాళ్ళు ఏం చేయటానికీ తోచక శిలాప్రతిమల్లా ఉండిపోయారు.

"మీారే చంపింది...మీారే చంపింది" అని అరుస్తూనే ఉన్నాడు రమేశ్.

కృష్ణమూర్తి రమేశుని దగ్గరగావచ్చి, అతడి భుజాన్ని గట్టిగా పట్టుకున్నాడు. అప్పుడే అన్నవైపుకు తిరిగిచూశాడు.

"వదులన్నయ్యా...ఇతడికి బాగా బుద్ధిచెప్తాను.వదులు... అన్నాడు రమేష్.

కృష్ణమూర్తి జవాబు చెప్పకుండా తమ్ముడిని తన గది లోకి లాక్కొని పోయాడు.

వాళ్లిద్దరూ వెళ్లిపోగానే శేషగిరిరావుగారు:

"శాంత వాడికి తల్లిలా ఉండేది. ఆ దుఃఖంతో పిచ్చి వాడయిపోయాడు. వాడి మాటలు పట్టించుకోకండి" అనిశాంత తండ్రిని వేడుకున్నారు.

స్థాణువులా కూర్చున్న ఆయన కళ్ళనుండి జలజలా అశ్రుబిందువులు రాలాయి.

అన్నిగాయాలకూ తిరుగులేని మందు కాలమే.

శాంత వెళ్ళిపోయింది. ఆమె వెనకనే ఆమె జ్ఞాపకాలూ మసకబారుతున్నాయి. ఇప్పుడు క్షణక్షణానికి ఆమె జ్ఞాపకాలు

ఇంట్లోవాళ్ళని బాధపెట్టినా, మునుపటిలా శాంత పేరెత్తగానే ఏడుపు రావటంలేదు.

శాంత ప్రతినిధిగా ఆమె ఫోటో ఒకటిగోడ నలంకరించింది. మల్లెపూలదండతో ఫోటో నలంకరించాడు కృష్ణమూర్తి.

సాయంకాలం రమేష్ ఇంటికి రాగానే, గాబరాగా అక్కడే నిల్చుండిపోయాడు. గోడమీద ఫోటో అతని దృష్టిని ఆకర్షించింది. కృష్ణమూర్తి అప్పుడే ఫోటోకు దండవేసిక్రిందకు దిగుతున్నాడు.

రమేష్ ఒక నిముషం తదేకంగా ఫోటోవైపుచూశాడు. తరువాత తిన్నగా అన్నయ్య దగ్గరకొచ్చి నిల్చున్నాడు.

"టేబుల్ టెన్నిస్ ఆడ్డానికి వెళ్ళావా?" కృష్ణమూర్తి అడిగాడు.

"లేదు."

"మరింకెక్కడికి వెళ్ళావు?"

"ఊరికే అలాషికారుకు వెళ్ళాను."

కృష్ణమూర్తి ఆశ్చర్యపోయాడు. రమేష్ ఒక్క రోజూ ఆట మాత్రం తప్పించుకునేవాడు కాదు. పింగ్‌పాంగ్ నేర్చుకున్న కొత్తల్లో క్లాసులుకూడా ఎగ్గొట్టి ఆడేవాడు. పింగ్‌పాంగ్ అంటే, నిద్రా హారాలుకూడా జ్ఞాపకం వుండేవి కావు. అలాంటి రమేష్ ఆడటానికే వెళ్ళలేదంటే!

తమ్ముడు ఓ సమస్యగా కనిపించాడు కృష్ణమూర్తికి.

రమేష్ ఫోటోవైపే చూస్తున్నాడు.

"ఫోటో బాగా వచ్చింది కదూ? శాంతే లేచి వస్తున్నట్టుందేమో అనేలా ఉంది."

రమేష్ మృదువుగా అన్నాడు: "ఫోటో తీసెయ్, అన్నయ్యా."

"ఏం, బాగా లేదా?"

"ఎంత బావుంటే మాత్రం, ఫోటో తగిలించినంత మాత్రాన వదిన తిరిగి రాదు కదా. తీసెయ్ అన్నయ్యా."

"ఫరవాలేదు; ఉండనివ్వరా."

"ఊహుఁ, నీకంతగా కావాలనుంటే, నీ గదిలో వేసుకో. ఇక్కడ మాత్రం వద్దు."

కృష్ణమూర్తి ఆశ్చర్యంగా తమ్ముడివైపు చూశాడు. రమేశుడి మొహం గంభీరంగా ఉంది.

వదినా, మరదుల మధ్యనున్న స్నేహ బాంధవ్యాల విషయం కృష్ణమూర్తికి తెలియనిది కాదు. అయితే ఈ విశ్వాసమంతా ఇంత తొందరగా మాసిపోయిందా? చనిపోయిన వాళ్ళను మరచిపోవటంకన్నా, మంచి పని వేరొకటి లేదు. కాని, ఇంత త్వరగా, అందులోనూ రమేశ్ శాంతను మరచిపోయాడా? ఆమె ఫోటోను చూడటంకూడా అతడికి అసహనీయమై పోయిందా?

కృష్ణమూర్తి నెమ్మదిగా "ఇక్కడుంటే నీకు కలిగే నష్టమేమిటి" అన్నాడు.

రోజూ ఆ ఫోటోను చూస్తుండాలి. ఆ బాధ నేను భరించలేనన్నయ్యా. ఆ ఫోటో అక్కడి నుండి తీసెయ్యి."

"అవునులే; శాంత బ్రతికున్నప్పుడు, నీకు కబుర్లకూ, పనిచేసి పెట్టటానికి కావలసివచ్చింది. ఆమె చనిపోగానే ఆమె జ్ఞాపకార్థం ఏదీ మిగలరాదంటున్నావు. తన ఫోటో ఉంటేకూడా

భరించలేవా? ఆమె బ్రతికినన్ని రోజులూ నువ్వు చూపిన స్నేహ విశ్వాసాలు కేవలం నటనే అన్నమాట!...

కృష్ణమూర్తి మాట్లాడుతూ ఉండగానే రమేష్ గబ గబా తన గదిలోకి వెళ్ళిపోయాడు. రమేశుకి ఈ ప్రవర్తన కృష్ణమూర్తికి అర్థం కాలేదు.

కడుపుకు అన్నం లేనివాళ్ళు కృశించిపోయినట్టు రమేశ్ రోజురోజుకూ చిక్కిపోతున్నాడు. భోజన పానాదుల్లోను, ఆట పాటల్లోను మునుపటిలా ఆసక్తి లేదిప్పుడు. ఇదివరకు ఒక్క నిముషంకూడా ఇంట్లో కాలు నిలిచేదికాదతనికి. ఎప్పుడూ తిరగటమే. ఎంతో ఉల్లాసంగా పక్షిలా విహరించే రమేశ్, రెక్కలు విరిగిన పక్షిలా అయిపోయాడు.

భోజనం, టిఫిన్ తినేటపుడుకూడా ఆత్రుతే. తొందరగా తినేసి పరుగెత్తేవాడు. కాని ఎప్పుడూ తన దుస్తుల విషయంలో అశ్రద్ధ చేసేవాడు కాదు.

క్రాఫు దువ్వుకోడానికి అరగంట పట్టేది; ఇహ సూటు, బూటు, టై కుదరటం పెద్ద సమస్య అతడికి. ఎన్నోమార్లు ఆ సమస్యను శాంతే పరిష్కరించేది. దుస్తుల సమస్య తీరాక, వదిన—గదిలో ప్రవేశించి ఆమె వాడే పౌడరును శుభ్రంగా రాసుకునేవాడు. సెంటు తన రుమాలకు, దుస్తులకు చల్లుకొని వదిన ముందు హాజరయ్యేవాడు.

"ఎలా ఉంది వదినా" అని అడిగేవాడు.

శాంత "బాగున్నావు" అని చెప్పేవరకూ వేధించేవాడామెని.

"నా పౌడరెందుకు ముట్టుకున్నావు" అని శాంతఅడిగితే:
నా చేతికి అందేలా పెట్టటం మీదే తప్పు" అని అతి సహజంగా తప్పంతా వదినమీదికేనెట్టేసి స్నేహితులను కలుసుకోవడానికి వెళ్ళిపోయేవాడు.

ఇప్పటి రమేశ్‌తో చలనమే లేదు. రాతిలా జడుడై పోయాడు, ఇల్లువదిలి కదలటమే లేదు. ఎప్పుడైనా వెళ్ళినా, స్నేహితుల కంట బడకుండా తప్పించుకుని వంటరిగా తిరుగుతూ ఉండిపోయి రాత్రి పది గంటలకు ఇల్లు చేరుకునేవాడు. మొదటి మారు అలా చేసినపుడు ఇంట్లో అందరూ గాబరాపడ్డారు.

సుశీలమ్మగారు కొడుకు ఏదైనా చెడు సావాసాల్లో పడ్డాడేమోనని అనుమానించారు.

ఓరోజున రమేశ్ సాయంకాలం నాలుగ్గంటలకు ఇల్లు వదలినవాడు రాత్రి ఎనిమిదిన్నరయినా ఇంటికిరాలేదు. వాడికోసం వచ్చిన స్నేహితులులకు జవాబుచెప్పలేక విసుగుపుట్టింది సుశీలమ్మగారికి.

సుమారు ఎనిమిదిన్నర ప్రాంతాన కాంతరాజ్ స్నేహితుడిని వెతుక్కుంటూ నాలుగవమారు వచ్చాడు.

"రమేశ్ ఇంకా రాలేదా ?"

"లేదు."

"ఎక్కడి కెళ్ళాడో తెలుసా ?"

"తెలీదు."

"సర్లే, అయితే వా డొచ్చేదాకా కూర్చుంటాను." అంటూ లోపలికొచ్చి కూర్చున్నాడు.

కాంతరాజ్ రమేశుడి ఆప్తమిత్రుడు. రమేశునికి అతని దగ్గర ఉన్నంత చనువూ, స్నేహమూ, ఆత్మీయతా మరింకెవరి దగ్గరా లేవు.

చదువులో, ఆటపాటల్లో, సినిమా హాల్సులో ఎప్పుడూ ఇద్దరూ కలిసి మెలిసి తిరిగేవారు. ఒకరి నొకరు విడిచిపెట్టిఉండే వారు కాదు.

కాంతరాజ్ కుర్చీమీద కూర్చుని అడిగాడు.

"రమేశ్ ఎక్కడికెళ్ళాడో మీతో చెప్పలేదా ?"

"ఉహుఁ. మాతో అసలేమీ చెప్పనే చెప్పడు."

"నేను కొన్ని విషయాలు చెప్తాను. మీరు గాబరాపడ రాదు."

ఏమి ఆ శుభవార్త వినాల్సివస్తుందేమోనని సుశీలమ్మ గారి గుండె దడదడా కొట్టుకుంది.

కాంతరాజ్ కాస్సేపు మాట్లాడకుండా మౌనంగా కూర్చున్నాడు. ఉన్న విషయం చెప్పుదామా వద్దా అని ఆలోచిస్తున్నట్టుంది అతడి వైఖరి.

సుశీలమ్మగారు మనసులోని ఆరాటాన్ని ఆపుకోలేక:

"ఏం చెప్పాలనుకుంటున్నావో దాచకుండా చెప్పు బాబూ" అన్నారు.

"రమేష్‌కు ఇప్పుడు దేనిలోనూ ఆసక్తి ఉత్సాహమూ లేదు."

"దేనిలోనూ అంటే ?"

"చదువ్వా, ఆటపాటలూ...జీవితంలోనే అతడికి మును పటిలా ఆసక్తి లేదు. ఇప్పుడు అసలు మాతో కలసి తిరగటం లేదు. ఏదో పరధ్యానంగా ఉంటాడు."

"అదేమో నిజమే. మేమూ చూస్తూనేఉన్నాం. కాని, ఏంచెయ్యగలం? శాంత పోయినప్పటినుండి ఆ బెంగతోనే చిక్కి సగమయిపోయాడు."

"అవును. నాకూ అలాగే అనిపిస్తోంది. ఏదో కొన్ని రోజులు అలాఉంటాడు; సరిపోతుంది లెమ్మనుకున్నాను. కాని, పరీక్షలు దగ్గరకొస్తున్నాగాని, వాడిలో చలనమే లేదు. ఉదాసీనంగా ఉండిపోయాడు."

"ఇలా అయితే వీడు నిజంగా పాసవుతాడా ? శాంత పోయిన దుఃఖం కడుపులో, పెట్టుకుని తిరుగుతున్నాం మేమంతా. ఇంత పట్టించుకుంటే, ఏం గతి నాయనా ?"

"నేనూ అదే అడిగాను. ఇలా చదివితే నువ్వెలా పాస వుతావని. ప్యాసు కాకపోతే పోయింది, డాక్టర్నయి ఎవరిని ఉద్ధరించాలి గనుక. నాకు ప్యాసూ, ఫేలూ రెండూ ఒకటే అనే శాడు. మా ప్రొఫెసర్ కూడా అడిగారు. ఏమిటిలాఉన్నావని."

సుశీలమ్మగారి మొహంలో దుఃఖచ్ఛాయలు అలుము కుంటున్నాయి. కాసేపు మెదలకుండా ఉండి:

"మా దగ్గర అస్సలు నోరు విప్పడు రమేశ్. నువ్వతడి స్నేహితుడివి. వాడి మనసులో ఏముందో కాస్త అడిగి తెలుసుకో బాబూ" అన్నారు విచారంగా.

"నేనేమో అడుగుతాననుకోండి. కాని ఇప్పుడతడు మునుపటిలా మనసు విప్పి మాట్లాడటంలేదు. చాలా మారి పోయాడు రమేశ్."

"అది నిజమే. క్రమంగా సరిపోతాడులే అనే ఆశతోనే, అనే నమ్మకంతోనే ఇలా ఉన్నాం."

కాంతరాజ్ లేచి నిల్చుని:

"నేనికవస్తానండి. నేను మీతో ఇలా మాట్లాడినసంగతి అతడికి తెలియనివ్వకండి. నేనూ సమయంచూసి కదిలిస్తాను." అన్నాడు.

"అలాగే అయినా; మీరే అతడిని మళ్లీ మనుష్యుల్లో పడేయాలి."

కాంతరాజ్ వెళ్ళిపోయాకకూడా సుశీలమ్మగారు అలాగే కూర్చుండిపోయారు.

ఇంటికి వచ్చిన కృష్ణమూర్తి చీకట్లో కూర్చున్న తల్లిని చూసి:

"చీకట్లో కూర్చున్నావేమిటమ్మా" అంటూ తనేలైటు వేశాడు.

రమేశ్ ఇంటికి వచ్చేసరికి రాత్రి పది గంటలయింది. అంతవరకూ కృష్ణమూర్తి, సుశీలమ్మగారూ, శేషగిరిరావుగార్లు అతడి గురించే మాట్లాడు కుంటున్నారు.

సుశీలమ్మగారు రమేశ్ రాగానే:

"కాళ్ళు కడుక్కోనిరా వడ్డిస్తున్నా" అన్నారు.

"నా కాకలిగా లేదమ్మా."

"అలా అంటావేమిటి? మధ్యాహ్నం టిఫిన్ కూడా తిన లేదు. కాస్త ఎంగిలిపడుదువుగాని రా" అని బలవంత పెట్టారు.

వృథాగా వాదించడాని కిష్టంలేక వెళ్ళి కంచంముందు కూర్చున్నాడు రమేశ్. అన్నం తింటున్న కొడుకువైపు చూశారు సుశీలమ్మగారు.

ఎలా ఉన్న కుర్రాడు ఎలా అయిపోయాడు! అతడి క్రాపు ఎప్పుడూ చెరిగేదికాదే. ఇస్త్రీచెయ్యని షర్టు, పైజామాలు వేసుకునేవాడా?

కొంటెతనం తొంగిచూసే కళ్ళలో ఇప్పుడు గాంభీర్యం చోటు చేసుకుంది. నిండుబుగ్గలు లోతుకుపోయాయి.

చక్కగా ముస్తాబయిగాని, గుమ్మం దాటని కొడుకు చెదిరిన క్రాపు, మాసినగుడ్డలతో ఊరంతా తిరిగి వచ్చాడు.

ఏదో చెబుదామని నోటిదాకా వచ్చిన మాటలను అతి కష్టంతో ఆపుకున్నారు సుశీలమ్మగారు.

కాంతరాజ్ స్నేహితుడి పరిస్థితికి కుమిలిపోతున్నాడు. కాని, రమేశ్ అతడితో మాట్లాడే అవకాశమే ఇవ్వకుండా తప్పించుకు తిరుగుతున్నాడు.

ఒకరోజు రమేష్ బయటికి వెళ్ళటాన్ని గమనించి, అతడి వెనకే బయల్దేరాడు కాంతరాజ్.

"ఎక్కడికి వెడుతున్నావ్?"

"అలా తిరిగి వద్దామని."

"పద; నేనూ వస్తాను."

"నువ్వెందుకూ? టేబుల్ టెన్నిస్‌కు వెళ్ళవా?"

"నువ్వు వస్తావా ఏం?"

"లేదు; నాకు ఆడాలనిలేదు; నువ్వు వెళ్ళేటట్లయితే వెళ్ళు."

"నేనూ వెళ్ళ నీరోజు. నీతోనే వస్తాను" అంటూ మొండికేశాడు కాంతరాజ్.

రమేష్ ఇహ చేసేదేమీలేక అంగీకరించాడు.

ఇద్దరూ మౌనంగా చెరువువైపుకు నడిచారు. చెరువు ఒడ్డునవున్న లతాకుంజపు నీడలోవున్న రాతి బెంచిమీద కూర్చున్నారిద్దరూ.

కాస్సేపు మౌనం రాజ్యం చేసింది.

ఆఖరికి కాంతరాజే మౌనాన్ని భగ్నంచేస్తూ;

"ఈరోజు హాస్పిటల్‌కు రాలేదేం?" అని అడిగాడు.

"రావాలనిపించలా" పరధ్యానంగా బదులు చెప్పాడు రమేష్.

"కులాసాగా ఉన్నావా ?

"నాకేం? రాయిలా ఉన్నాను."

కాంతరాజ్ ఓ నిమిషం మాట్లాడలా. రమేశ్ చెరువులోనినీళ్ళవైపే చూస్తున్నాడు.

నీలాకాశంలో ఒకదాని నొకటి తరుముకుపోతున్న తెల్లని మబ్బులు, పొడుగ్గా, ఎదిగిన సర్వీచెట్ల నీడలు చెరువునీటితో ప్రతిఫలిస్తున్నాయి. తెల్లటి కొంగలు రెక్కల చప్పుడు చేసుకుంటూ పారిపోతున్నాయి. చల్లటి చిరుగాలికి లేచిన చిన్న చిన్న అలలచుట్టూ ప్రకృతికూడా స్తబ్దంగానే ఉండటంచూసి, మళ్ళీ లోపలికు వెళ్ళిపోతున్నాయి.

"రమేశ్!"

"ఏం ?" గడుసుగా ధ్వనించింది రమేశుడి కంఠస్వరం.

"ఇలా అయిపోయావేం నువ్వు ?"

"ఏమయ్యానేం ?"

"నీకే తెలియాలి; మునుపటిలా లేవు మరి."

"నేను మామూలుగానే ఉన్నాను. నీ కళ్ళకే ఏమైనా జబ్బు వచ్చిందేమో."

"కాదు. నువ్వింత ఉదాసీనంగా ఏనాడూ ప్రవర్తించి ఎరుగవు."

"మనం ఆశా ఆకాంక్షలను పెంచుకోరాదు. అన్నిటి కన్నా ముఖ్యమైంది, మమతను అసలే పెంచుకోరాదు రాజూ ! ఉన్నచో, మళ్ళీ బాధ తప్పదన్నమాటే. వ్యామోహముంది చూశావు! దీనంత చెడ్డది మరొకటి లేదు. అందుకే నే నికమీదట ఎవరితోనూ స్నేహ విశ్వాసాలను పెంచుకోరాదని నిశ్చయించు కున్నాను."

చివరిమాట పలికేటప్పుడు రమేష్ గొంతు జీర బోయింది.

"చూడు రమేశ్ ! ఇలాంటి విరక్తి వేదాంతం మన లాంటి వాళ్ళకు తగదు. నలుగురతో, మాటామంతీ అంటూ ఉన్నాక సహజంగానే వ్యామోహం కలుగుతుంది. ఇలాంటి బంధం మహామహులకే తప్పలేదు? మనకు సాధ్యమా?"

"ప్రస్తుతానికి సాధ్యమనే అనుకుంటున్నామరి. జీవితా న్నుండి దూరంగా వుండాలని నిర్ణయించుకున్నాను."

"అది పిరికిపంద లక్షణం."

"కావచ్చు. కాని, నేను మాత్రం ఈ రకమైన జీవితాన్నుంచీ దూరంగా ఉండాలని నిర్ణయించుకున్నాను."

రమేష్ మాటలు విని, కాంతరాజ్ స్తబ్ధుడయిపోయాడు. ఏంచెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక కాస్సేపు మెదలకుండా ఉండిపోయాడు.

"కాని, రమేష్! నే నో మాట చెప్పనా? మనం ఇంకొకరికి ఉపకారం చెయ్యకపోయినా, బాధమాత్రం పెట్టరాదు. ఆ విషయమైనా ఒప్పుకుంటావా ?"

"ఒప్పుకుంటాను."

"ఇప్పుడు నీ పరిస్థితిచూసి మీ అమ్మ, నాన్న, అన్నయ్య ఎంత బాధపడుతున్నారో తెలుసా? వాళ్ళంతా నిన్ను ప్రేమిస్తున్నారన్న విషయం మరిచిపోకు. మీ అమ్మ నీమీద ఎన్ని ఆశలు పెట్టుకుందో తెలుసా?"

"తెలుసు."

"కాని, యిప్పుడు నువ్వు నీ కర్తవ్యాన్ని మరిచిపోయి ఈ జీవితాన్నుండి పారిపోవాలని చూస్తున్నావ్. ఇది తప్పు కాదూ? నీ లక్ష్యం ఏమిటి ? ఈ మారు పరీక్ష పాసయి రోగాలతో బాధపడుతున్న వేలాదిమందిని కాపాడాలనుకున్నావే! నువ్వు మా ముందు వర్ణించి చెప్పిన ఆ ఆదర్శ జీవితం ఎక్కడుంది రమేష్?"

రమేష్ ఉదాసీనంగా అన్నాడు:

"నేను డాక్టరయి మాత్రం చేసేద ఏమిటిలేద్దూ! ఒక్క రమేష్ డాక్టరు కాకపోతేనేం ? ఈ రోజుల్లో డాక్టర్ల కేంలోటు? ఎక్కడ చూసినా మెడికల్ కాలేజీలూ, లెక్కలేనంతమంది

డాక్టర్లున్నారు నే నొక్కడిని డాక్టర్ కాలేకపోతే, ప్రపంచం మునిగిపోదు లేవోయ్."

"ఏం మాటలురా భాయి అవి! నీ నేర్పు, బుద్ధి అందరికీ ఉంటాయనుకున్నావా? నిన్ను మన ప్రొఫెసర్లు ఎంతగా మెచ్చుకునేవారో మరిచిపోయావా? ఈ వృత్తిలో నీకెంత ఉజ్వల భవిష్యత్తు ఉందో నీకు తెలుసా? నువ్వు ఎంతమందిని కాపాడాలో ఎవరికి తెలుసు?"

రమేశ్ వ్యంగ్యంగా అన్నాడు:

"హుఁ నేనూ... కాపాడటం! అదంతా వట్టి బూటకం కాంత్! మనం కేవలం మానవ మాత్రులం. బ్రహ్మ రాసిన దాన్ని తప్పించటానికి మన మెవరం? మనం విధి చేతిలోని కీలు బొమ్మ మాత్రమే. వైద్యవృత్తి ఉంది చూశావు? అది వట్టి నటన. దాన్నుండి ప్రజలకు ఏ మాత్రం ప్రయోజనం లేదు. ఎవరి కర్మ వాళ్ళు అనుభవిస్తారంతే."

రమేష్ మాటలకు కాంతరాజ్ తెల్లబోయాడు. కారణం: రమేష్ దేవుడు, విధి, కర్మలాంటి మాటలను నమ్మేవాడు కాదు. ఇది కాంతరాజ్‌కు బాగా తెలుసు.

"అయితే ఈమారు పాసవుతాననే నమ్మకం లేదా?"

"నేను పరీక్షకు వెళ్ళనే వెళ్ళను; ఇహ దాన్ని గురించి బెంగేమీ లేదు."

కాంతరాజ్ ఈమారు నిజంగానే గాబరా పడ్డాడు. రమేష్ చేతిని తన చేతుల్లోకి తీసుకుని:

'రమేశ్! నీ భవిషత్తు పాడు చేసుకోకు, నా కోసం,

నీకోసం, మీతల్లిదండ్రుల కోసం కాస్త ఆలోచించు" అన్నాడు అతడి కంఠం రుద్ధమైంది. కళ్లు చెమర్చగిల్లాయి.

రమేశ్ జవాబు చెప్పలేదు. అతడు నిశ్చయానికి తిరుగు లేదన్న సంగతి అతడి మొహమే చెప్తోంది. అది కాంతరాజ్ గ్రహించాడు.

"తొందరపడకు రమేశ్!"

"నన్నిక విసిగించి బాధపెట్టకురా బ్రదర్ నాకేమీ అక్కర్లేదీ ప్రపంచంలో. ఎక్కడికైనా పారిపోవాలనిపిస్తోంది. ఇహ ఈ విషయం ఇక్కడికి వొదిలేయ్."

"నీకు నిజంగా ఎక్కడికైనా వెళ్ళాలనుందా?"

"అవును."

"పరీక్షలకు ఇంకో నెల రోజులు మాత్రమే ఉన్నాయ్."

"అవును, నువ్వు పరీక్షలు బాగా రాయి."

"మరి నువ్వో?"

"నా కా బెంగేం లేదు, ఊరు వదలి ఎక్కడికైనా వెళ్ళి పోవాలని ఉంది."

కాంతరాజ్ ఇహ ఏమీ మాటాడలేకపోయాడు.

చీకటికాంత తన నాలుగు చెరుగుల్తో లోకాన్ని మెల్లి మెల్లిగా కప్పుకుంటోంది. సర్వీ చెట్ల సందులోనుంచి సన్నగా ఈలలు వేస్తూ వస్తోంది గాలి. లతాకుంజా ప్రక్కనున్న దీపం నుంచి కాంతి మందంగా ప్రసరిస్తోంది.

"ఇహ వెడదామా" అన్నాడు కాంతరాజ్.

"నువ్వు వెళ్లు. నేనింకా కాస్సేపు ఉండి వస్తాను."

"నిన్నొక్కడినే వదిలి నేను వెళ్ళలేను నామాట విని, నాతో వచ్చేయ్."

అతడి మాటల్లో ఉన్న ఆరాటాన్ని గమనించి రమేశ్ నవ్వాడు.

"నే నెప్పటికీ ఆత్మహత్య చేసుకోను. నేను పిరికివాడనని అన్నావు. ఆ మాట నిజమే—ఒప్పుకుంటున్నా" అంటూ జేబు లోనుండి సిగరెట్ తీసి వెలిగించాడు. కాంతరాజ్ విస్మయానికి అంతులేదు. అతడికి తెలిసినంతలో రమేష్‌కి సిగరెట్ అల వాటు లేదు.

# 6

"ఈ అలవాటు ఎప్పటినుండి?"

"ఏదో చికాగ్గా ఉన్నపుడు మాత్రమే."

"సరేగానీ, ఇహ లే వెడదాం" అంటూ బలవంతాన రమేష్‌ని బయలుదేర తీశాడు కాంతరాజ్.

పరీక్షలు ఇంకా పదిహేను రోజులన్నాయనగా రమేశ్, తండ్రితో చెప్పాడు:

"ఈమారు నేను పరీక్షకు వెళ్ళదలచుకోలేదు నాన్నా."

ఆ మాట విని శేషగిరిరావుగారు ఆశ్చర్యపడ్డారు.

"ఏం?"

"నే నింతవరకూ పుస్తకాలు తెరవనైనా తెరవలేదు. ఇప్పుడు పరీక్షకు చదివేంత ఏకాగ్రతకూడా నాకు లేదు. వెళ్ళినా నేను పాసవను."

"సంవత్సరమంతా వృథా కదురా" అని ఇంకా ఆయ నేమో చెప్పబోతుండగా కృష్ణమూర్తి కల్పించుకుని:

"అలాగే కానీ. వచ్చే సంవత్సరం వెడుదువుగానీ, ఒక్క సంవత్సరమే కదా. పోతేపోతుంది" అన్నాడు.

రమేష్ కృతజ్ఞతతో అన్నయ్యవైపు చూశాడు.

కాంతరాజ్ సుశీలమ్మగారికి ఇచ్చిన మాట ప్రకారం ఆమెకు ఉన్న సంగతంతా వివరించాడు:

"మీరు కొద్ది రోజులపాటైనా అతడిని ఎక్కడికైనా పంపడం మంచిది. ఈ వాతావరణం నుండి తప్పుకుంటేనైనా ఈ బాధను మరచి మనిషిగా కాగలడేమో"

"ఎక్కడికి పంపుదామంటావ్ ?"

"ఎక్కడికైనా సరే. అలా తిరిగిరానివ్వండి. ఈ సంవత్సరం చదువు పాడయినా నష్టం లేదు. రమేశ్ మామూలు మనిషి కావటమే ముఖ్యం."

సుశీలమ్మగారికి ఆ మాట నిజమే ననిపించింది. భర్తతోనూ, కృష్ణమూర్తితోనూ చర్చించికూడా ఏ నిర్ణయానికి రాలేక ఊరుకున్నారు.

శాంతపోయి మూడు నెలలుకాకుండానే, కృష్ణమూర్తికి మళ్లీ సంబంధాలు రాసాగాయి.

మొదటిమారు ఎవరో పిల్లనివ్వటానికి వచ్చినప్పుడు సుశీలమ్మగారు శాంతను తల్చుకుని వాళ్ళ ఎదుటనే కంట నీరుపెట్టుకున్నారు.

కాని, చనిపోయిన భార్యను తల్చుకుంటూ ఇంకాచిన్న వయసులో ఉన్న కృష్ణమూర్తి ఎన్నిరోజులు సన్యాసిలా ఉండగలడు ?

తన సంసారాన్ని కష్టంలేకుండా గడుపుకోగలిగిన సంపాదన ఉంది. చిన్నవయస్సు. వచ్చేపిల్ల సవతితల్లి అవుతుందేమో నన్న భయమూ లేదు.

కృష్ణమూర్తి మళ్ళీ పెళ్ళిచేసుకోవటంలో తప్పేమిటి ?

సుశీలమ్మగారు; రావుగారు ఆలోచించుకుని ఓ రోజు కృష్ణమూర్తి దగ్గర ఆ విషయాన్నెత్తారు.

"అబ్బాయ్! చిత్రదుర్గంనుండి ఎవరోవచ్చారు. వాళ్ళింట్లో పెళ్ళికెదిగిన పిల్ల ఉందట. జాతకం అదీ సరిపోతే..."

కృష్ణమూర్తి అదిరిపడ్డాడు. ఇంత త్వరగా తన పెళ్ళి ప్రస్తావన వస్తుందని అనుకోలేదతడు. అలా అన్నంతమాత్రాన తన పెళ్ళిగురించి అతడు ఆలోచించనే లేదనికాదు. మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా జీవితాంతంఉండిపో లేడన్న సత్యం అతడికీ తెలుసు. కేవలం భావుకతకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేమనిషికాదు కృష్ణమూర్తి. మానవుడికి భావుకత అనేదే లేకపోతే జీవితం నరకం అనిపించే మాటనిజమే. కాని లౌకికానికన్నా భావుకతకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చే వయస్సు దాటిపోయిందతడికి.

తండ్రిమాటకు కృష్ణమూర్తి జవాబుచెప్పలేదు. కొడుకు

మానాన్ని చూసి తండ్రి తన మాటలవల్ల అతనికి బాధ కలి గిందని అర్థంచేసుకుని:

"ఎన్ని రోజులని ఇలా ఉండగలవు చెప్పు?" అన్నారు.

"ఇంత త్వరగా నా పెళ్ళివిషయం ఎత్తకండి, నాకింకా కొంతకాలం అవకాశం కావాలి."

ఎప్పుడైనా పెళ్లి చేసుకోవాల్సిందేగా. ఎప్పుడో కావల సింది ఇప్పుడే అయితేనేం ?"

"నిజమే, పెళ్లి చేసుకోనని నేననను. కాని ఇపుడే వద్దం టున్నానంతే."

ఇంకా కొంచెం నొక్కిచెపితే ఒప్పుకుంటాడని తలి దండ్రులకు అనిపించింది. కాని, ఒక్కరోజే ఇంకా బలవంతం చేయటం మంచిదికాదని ఊరుకున్నారు.

కృష్ణమూర్తి అప్పటికి తన పెళ్ళి విషయం మరిచి పోయాడు.

ఇది జరిగిన వారంలో ఇంకెవరో ఆడపిల్ల తండ్రి వాళ్ళిం టికి వచ్చారు. కాఫీ, ఫలహారాలయ్యాక వచ్చినాయన శేష గిరిరావుగారితో:

మా అమ్మాయికి ఇరవైనాలుగు ఏళ్ళునిండాయి. మీరు ఆలోచించుకుని, మీ పెద్దబ్బాయికి మా అమ్మాయిని తప్పక చేసుకోవాలి" అంటున్నారు.

"చూద్దాం మా అబ్బాయేమో ఇప్పుడే వద్దంటున్నాడు"

ఈ మాటలన్నీ గదిలో కూర్చున్న రమేశ్ చెవిలో పడ్డాయి. అతడికి ప్రపంచమంతా గిర్రున తిరుగుతునట్లనిపించింది.

అన్నయ్యకు ఇంకో పెళ్ళి! అంటే తనకు ఇంకో వదిన.

ఈ జన్మలో ఇది సాధ్యమా! ఇప్పుడేవద్దు అంటే కొన్ని రోజులు పోయాక చేసుకుంటాడనేగా!

అదెలా సంభవం? ఇంకో స్త్రీని తను వదినగా స్వీకరించటం సాధ్యమయ్యే విషయమేనా?

రమేష్ రక్తం పొంగింది. గబుక్కునలేచి బయటకు వచ్చి ఆయనముందు నిల్చుని ఆవేశంగా:

"వదిన చావాలని ఎన్నిరోజులుగా కోరుకున్నారుమీరు? తను ఎప్పుడు చనిపోతుందానని కాచుకూర్చున్నారా? వదిన చనిపోవాలని దేవుడికి మొక్కుకున్నారా మీరు?"

తండ్రి కొడుకుని వారించడానికి ప్రయత్నించి విఫలులయ్యారు.

"వెళ్ళిపోండి, మళ్ళీ మా గడప తొక్కకండి. వదిన చనిపోయి మూడు నెలలుకాలా, అప్పుడే ఈ ఇంటిని పెళ్ళింటిగా చేద్దామని వచ్చారా మీరు? మీ అమ్మాయికి ఎక్కడా సంబంధం దొరక్కపోతే, నూతిలో పడమనండి. అంతేగాని..." అంటూ తండ్రివైపుకు తిరిగి:

"నాన్నా! ఇకమీదట ఇలాంటి వాళ్ళను ఇంట్లోకిఅడుగు పెట్టనివ్వకండి. ఇలాంటివాళ్ళ ఉసురు తగిలే వదిన చనిపోయిందేమో!" అంటూనే గబగబా వెళ్ళిపోయాడు.

ఆ వచ్చినవారికి ఈ గడబిడంతా ఏమిటో అర్థంకాలేదు. కాని తమ రాక అతడి కయిష్టమన్న విషయం మాత్రం అర్థమయింది...రావుగారు.

"కొంచెం ముడుకు స్వభావం వాడిది మీరేమీ అను కోకండి" అన్నాడు.

"ఆ అబ్బాయి యెవరు?"

"మా చిన్నబ్బాయే."

"ఏమంటున్నారాయన?"

"ఏం లేదులెండి. అతడి స్వభావం కొంచెం విచిత్రం; అంతే. కృష్ణమూర్తికి ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకునే అభిప్రాయం లేదు. మీ అడ్రసు ఇచ్చి వెళ్ళండి. చేసుకుంటానంటే మీకు కబురు చేస్తాను."

అలాగే అని అడ్రసు ఇచ్చి వెళ్ళిపోయారాయన.

రాత్రి పెద్ద కొడుకుతో, జరిగిన విషయమంతా చెప్పారు రావుగారు.

"కృష్ణా! వీడు ఇలా మాట్లాడితే ఎలా? సంసారమన్న తర్వాత నలుగురూ వస్తారు; వెడతారు. నోటి కొచ్చినట్లు మాట్లాడితే బావుంటుందా? వచ్చేవాళ్ళ తప్పు మాత్రం ఏముంది చెప్పు నీకు పిల్లనిద్దామని వచ్చారు. అది విని రమేష్ అనరాని మాట లన్నాడు. ఇదేమన్నా బావుంటుందా? ఈరోజు కాకపోతే రేపయినా నీపెళ్ళి జరగాల్సిందేకదా?'

తండ్రి మాటల్లోని అతడికి మాత్రం తెలియ

నిదా?

"పరీక్షకూడా వెళ్ళకుండా కూర్చున్నాడు. వాడికి మాత్రం ఏం తోస్తుంది చెప్పు. కాంతరాజ్ అన్నాడు: 'కొద్ది రోజులు వేరే ఊరు వెళ్ళివస్తే బావుంటుం'దని. నాకూ అదే మంచిదనిపిస్తోంది" అన్నారు సుశీలమ్మగారు.

"ఎక్కడికి పంపుదామంటావ్? ఎక్కడికి వెళ్ళినా, మళ్ళీ ఇక్కడికే కదా రావాలి?" అన్నారు శేషగిరిరావుగారు.

"నిజమే కాని కొన్నిరోజులయినా మార్పు ఉంటే, తేసు కుంటాడేమో."

అంతవరకూ మౌనంగా కూర్చున్న కృష్ణమూర్తి:

"నిజమేనమ్మా, ఈ వాతావరణంనుంచి కొంచెం దూరం పోతేనైనా, కాస్త మామూలు మనిషిగా కాగలడేమో! అన్నట్టు బొంబాయి వెడితే ఏం?" అన్నాడు.

"అక్కడెక్కడుంటాడు?"

"మన శేషగిరి ఉన్నాడుగా అమ్మా! రేపే వివరంగా ఉత్తరం రాస్తాను వాడికి. కొద్ది రోజులపాటైనా అలా వెళ్ళి రానీ కొత్తచోటు, కొత్త మనుష్యుల మధ్య పాత దుఃఖాన్ని విస్మరించవచ్చు."

"అలాగే కానీ: కాని, రమేశ్ వల్ల శేషగిరి కేమైనా కష్టం కలిగేటట్టయితే మాత్రం వద్దు" అన్నారు శేషగిరిరావు గారు.

"కష్టమేమిటి? అలా అనుకునే స్వభావంకాదు వాడిది. రోజూ తనతో బాటు 'క్లినిక్'కు తీసుకుని వెడితే, అదీ ఓ విధంగా మంచిదే అవుతుంది."

ఆరోజు రాత్రి పన్నెండు గంటలకు ఇంటికి వచ్చాడు రమేశ్. ఇంట్లోనివారంతా ఆ వచ్చిన కొత్త మనిషితో కలిసి, తనమీద కూడుపుఠాణి జరుపుతున్న శత్రువులా అన్నట్టు అందరి వైపూ చురచురా చూసి తన గదిలోకి వెళ్ళి దభేలున తలుపు వేసేసుకున్నాడు.

"భోజనానికి రారా" అన్నారు సుశీలమ్మగారు.

"ఆకలిలేదు" తలుపు తెరవకుండానే సమాధానం వచ్చింది.

రమేశుడిని ఎలాగైనా ఆ వాతావరణం నుండి తప్పించి వేరే చోటికి పంపాలని ఇంట్లో అందరూ నిశ్చయించారు. ఆ విషయం శేషగిరి నుండి జవాబు వచ్చాకనే చెప్పవచ్చునని ఊరుకున్నారు.

కృష్ణమూర్తి ఉత్తరం చూసుకుని శేషగిరి "రమేష్‌ని తప్పకుండా పంపు. నువ్వేం బెంగపెట్టుకోకు. ముందుగా ఏ ట్రైనులో వచ్చేది తెలిపితే స్టేషనుకు వస్తాము" అని రాశాడు.

కృష్ణమూర్తి తల్లిదండ్రులతో ఈ విషయం చెప్పాడు. సాయంకాలం తమ్ముడినీ:

"రమేశ్! నాలుగు రోజులపాటు ఎక్కడకయినా వెళ్ళి వస్తావుట్రా. నీకు ఇంట్లో ఏమీ తోచనట్లుంది" అని అడిగాడు.

"ఎక్కడికి వెళ్ళమంటావ్?"...నే నెక్కడికీ వెళ్ళను. ఇక్కడే ఉంటాను.

"అలా కాదు; నీ కిప్పుడు మార్పు కావాలి. మద్రాసు బొంబాయి ఎక్కడికైనాసరే; కొద్దిరోజులు వెళ్ళిరా. మనస్సు కాస్త కుదుటపడుతుంది. ఈసారు పరీక్ష పోయిందని బెంగెట్టు కోకు. వచ్చే సంవత్సరం చదువుదుగాని. నువ్వు సంతోషంగా వుండటమే మాకు కావలసిందీనూ."

ఏం బదులు చెప్తాడా అని కృష్ణమూర్తి ఎదురు చూస్తున్నాడు. కాని, రమేష్ మాట్లాడకుండా అక్కడినుండి

వెళ్ళిపోయాడు. రెండురోజులు కృష్ణమూర్తి తమ్ముడిని కదిలించ లేదు. మళ్ళీ మూడోరోజున,

"ఏమని నిశ్చయించుకున్నావ్?" అని అడిగాడు.

"నే నెక్కడికీ వెళ్ళను" ముక్తసరిగా జవాబిచ్చాడు రమేష్.

"కొన్నిరోజులు ఎక్కడికైనా వెళ్ళివస్తే బావుంటుంది."

"నేను మీకంతా భారంగా ఉన్నానా ఏం?"

తమ్ముడి మొరటుమాటలకు కృష్ణమూర్తి మనస్సు చివుక్కుమంది. అన్నయ్య మొహం నల్లబడటంచూసి, తను అంతమాట అనకుండా ఉండాల్సింది అనుకున్నాడు రమేష్.

"నువ్వు మాకు భారమని నేను చెప్పలేదురా తమ్ముడూ. నీకు మనస్సేమీ బాగాలేదు. అందుకే జ్ఞాపకాలతో బాధపెట్టే ఈ యింటి వాతావరణాన్ని వదిలిపెట్టి అలా వెళ్ళివస్తే మంచి దనిపించింది చెప్పాను; అంతే; ఇష్టంలేకపోతే వద్దులే" అని కృష్ణ మూర్తి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

రమేష్ రెండురోజులు ఆలోచించి ఆఖరికి:

"అన్నయ్యా! నువ్వు చెప్పిందే నిజం. నాలుగురోజుల పాటు ఎక్కడైనా తిరిగి వస్తాను" అన్నాడు.

"కృష్ణమూర్తి తమ్ముడిలోని మార్పుకు సంతోషించినా, దాన్ని పైకి కనపడనీయక:"

"అలాగే; ఎక్కడికి వెళ్ళాలనుకుంటున్నావ్ ?" అని అడిగాడు.

"నా కెక్కడికి వెళ్ళాలనే ఊహకూడా లేదు. నువ్వే చెప్పు."

"నన్నడిగితే బొంబాయి వెళ్ళటం మంచిది. అక్కడ నా స్నేహితుడు శేషగిరి ఉన్నాడు. నీకూ తెలుసుగా. వాళ్ళింట్లో ఉండవచ్చు. అదీనూ డాక్టరే కనుక నీకూ బాగా కాలక్షేపం అవుతుందని నా అభిప్రాయం. నువ్వూ ఆలోచించుకో. నీకు యిష్టమైతేనే అక్కడికి వెళ్ళు" అని ముగించాడు కృష్ణమూర్తి.

రమేశ్ బొంబాయి వెళ్ళటమే నిశ్చయమయింది. కాని అతను రైలు ఎక్కేవరకూ ఎవ్వరికీ నమ్మకం లేదు. క్షణక్షణానికి మనసు మార్చుకుంటూ వుంటాడు. చివరి క్షణంలో "నేను వెళ్ళను" అంటే కూడా ఆశ్చర్యపడక్కర్లేదు. అదే ఆరాటపడుతున్నారు అందరూ.

కృష్ణమూర్తి, శేషగిరిరావుగారూ స్టేషనుకు వెళ్ళి రైలెక్కించారతనిని.

"డబ్బు కావాలంటే రాయి. సంకోచపడకు" అన్నాడు కృష్ణమూర్తి.

"రోడ్డు దాటేటప్పుడు జాగ్రత్త. అక్కడ చాలా రద్దీగా ఉంటుందిట."

రైలు వెళ్ళాక, "ఇక తిరిగి వచ్చేటప్పటికి రమేశ్ మామూలు మనిషి అయితే చాలు" అనుకుంటూ, ఇంటి మొహం పట్టారు తండ్రీ కొడుకులు.

రమేశ్ ఇంత దూరపు ప్రయాణాన్ని చేయటం యిదే మొదటిసారి. మెడికల్ కాలేజిచదువు ఇలాంటి ప్రయాణాలను చేసే అవకాశాన్ని ఇవ్వలేదతనికి. దసరా, క్రిస్టమస్ శలవుల్లో స్నేహితులతో కలిసి జోగ్, శివసముద్రం ఇలాంటి ప్రదేశాలకు మాత్రమే వెళ్ళివచ్చాడు.

నిరాశా, నిస్పృహలు మూర్తీభవించిన వాడిలా కని పిస్తూ ఒంటరిగా, దిగులుగా ప్రయాణిస్తున్న రమేష్ రూపం తోటి ప్రయాణికుల్లోని ఓ వృద్ధుడిని ఆకర్షించింది.

ఆయన కాఫీ దారికే ప్రతి స్టేషనులోనూ కాఫీ త్రాగి:

"మైసూరు కాఫీయే కాఫీ; బొంబాయి వెడితే ఇహ ఇంట్లో వాళ్లుచేసే "చా"యే గతి. కాని, చూశారా! తెల్లవారి లేవగానే ఓ కప్పు మైసూరుకాఫీ తాగందే ఉండలేను నేను. కాఫీకోసం సయాన్ నుండి దాదర్ వెళ్లి ఉడుపి హోటల్లో కాఫీ త్రాగి వస్తాను. తరువాతనే నా బిజినెస్ ప్రారంభం..." అనే వాడు.

"ఏం బిజినెస్సూ" అని రమేశ్ అడగాలని ఆయన వాంఛ.

కాని, రమేశ్ ఏమాత్రం కుతూహలం కనపర్చలేదు. ఇంకో ప్రయాణీకుడు అడిగాడు.

"ఏం బిజినెస్?"

"వజ్రాలు, రత్నాలు, వెండి, బంగారం ఊరి నుండి ఊరికి తీసుకుని వెళ్ళి అమ్ముతాను."

ఆయన మాటలమీద అక్కడున్న వాళ్ళ కెవ్వరికీ నమ్మకం కలుగలేదు. అతడు వేసుకున్న గుడ్డలు ఇతడేం బంగారు వర్తకుడూ?' అనిపించేలా ఉన్నాయి.

తోటి ప్రయాణీకుల మనసులోని సందేహం ఇట్టే కని పెట్టేశాడు.

"నేను చెపుతున్నది నిజమేనండోయ్. బిజినెస్‌లో ఇలా తిరుగుతూనే ఉంటాము. ఇప్పుడు నా ఒంటిమీద ఐదువేల

రూపాయల బంగారానికి తక్కువ ఉండదు. చూపిస్తా నుండండి..." అంటూ, తమ చొక్కాలోపలి జేబు కుట్టు విప్ప సాగాడు.

"వద్దులెండి" అన్నా రెవరో.

"మా అమ్మాయి నవరసులు ఇలా సంచిలో పెట్టి లోపలి జేబులో పెట్టి గట్టిగా కుట్టేసుంది. ఆపిల్లే చిన్న మ్మాయి నాకు. ఆ ఒక్క పిల్లకు పెళ్ళి చేసేస్తే, నా బాధ్యత తీరిపోతుంది. నేనంటే ఎంతో ప్రేమ అమ్మాయికి. ఇహ మిగిలినవాళ్ళంతా... వ్చ్... లాభం లేదు. ఈముసిలాడు ఎప్పుడు చస్తాడా... ఎప్పుడు ఆస్తి కాజేద్దామా అనే కాచుకూర్చున్నారు..." మాట్లాడుతూనే కుట్టు విప్పి సంచిలోని నవరసులు దోసిట్లోకి పోసుకున్నారు.

కొత్త నవరసులు సూర్యుడి వెలుగులో తళతళా మెరిశాయి. వాటిని ఒక చేతిలో నుండి మరో చేతిలోకి పోసుకుంటూ ఆనందించాడాయన.

"నేను తిరిగి వచ్చేదాకా క్షేమంగానే ఉన్నానన్న నమ్మకం ఎవరికీ ఉండదు. బంగారం ఉందని తెలిసి ఎవరన్నా నన్ను ఖూనీచేసి బంగారం కాజేస్తారని వాళ్ళ భయం."

"మీరు ఇలా అందరిలోనూ మీదగ్గర బంగారం ఉందని చెప్పటం మంచిది కాదేమో!" ఎవరో అన్నారు.

"అందుకేగా, నే నెప్పుడూ ఫస్టుక్లాసులో ప్రయాణం చెయ్యను. ఎక్కువగా మనుష్యులున్న పెట్టెలోనే ఎక్కుతాను. అయినా మనలో ధర్మం, న్యాయం ఉన్నంతవరకూ ఏం భయం చెప్పండి."

"మైసూరులో బంగారం బాగా అమ్ముడు పోయిందా?"

ఫరవాలేదు—సుమారుగా ఖర్చయింది. మహారాష్ట్రంలో ముత్యాలు ఎక్కువగా అమ్ముడు బోతాయి. అక్కడ వజ్రాలను కన్నె తికూడా చూడరు..." అంటూ ఆయన మళ్ళీ నవరసులను సంచిలో పోసి, పెట్టెలో పెట్టి తాళం వేశారు.

ధారవాడ దగ్గరపడుతూండటం గమనించి ఆయన నిరాశతో:

"ఇక కాఫీ దొరకదు" అన్నారు. అక్కడున్న ప్రయాణీకు లందరిలోనూ తన నవరసులను గురించి కొంచెంకూడా ఆసక్తి చూపని రమేష్‌ని చూసి:

"ఎక్కడిదాకా వెడుతున్నారు" అని అడిగాడు.

"బొంబాయి."

"ఎవరింటికి వెడుతున్నారు? ఇల్లెక్కడ?"

ఆయనతో మాటలు కలపాలని ఆసక్తిలేని రమేష్:

"నాకు తెలియదు. వాళ్ళేవస్తారు స్టేషనుకు."

"అలాగా; చదువుతున్నారా? ఉద్యోగమా?"

"చదువుతున్నాను."

"ఏం చదువుతున్నారు."

"ఎం. బి. బి. యస్., ఫైనల్ ఇయర్."

సరి; ఇక ఆయన తన 'డయాబిటీస్' జబ్బుగురించి వివరించటానికి మొదలుపెట్టారు.

"నాకు తీపి అంటే ప్రాణం. జబ్బుకేమో తీపి అసలు పడదు. ఏం చెయ్యటమో చెప్పండి..."

ఆయనమాట ముగించటానికి ముందే రమేష్ అందుకున్నాడు:

"ప్రతీ స్టేషన్‌లోనూ పంచదారవేసిన కాఫీ త్రాగితే మరింకేముంది ? తీపివస్తువులు, పళ్ళుతినకండి. కొంచెం కూరగాయలు ఎక్కువగా వాడండి..."

"ఆ పాడు గోధుమ అన్నానికి ఏంకూరలు కలుపుకున్నా బావుండదు. గడ్డిలా ఉంటుంది."

"మీకె న్నేళ్ళండి ?"

"అరవై నాలుగు."

సామాన్యంగా నలభై ఏళ్ళు దాటాక ఈ జబ్బువస్తుంది. మీరు ఆ తరువాత ఇరవై నాలుగేళ్ళు బాగానే ఉన్నారుకదా. ఆ మాత్రం చాలదూ ? ఇన్ని రోజులు బాగా బ్రతికారుగాని, ఇహ చాల్లెండి."

ఆయన మనస్ఫూర్తిగా నవ్వారు.

"నిజమే కాని, బ్రతికినంతకాలం తినాలిగా మరి. జిహ్వాచాపల్యం అంత సులువుగా పోతుందామరి ?"

"బ్రతకటానికోసం తినండి గాని, తినడానికోసం బ్రతకకండి."

మీరుచాలా రసవత్తరంగా మాట్లాడతారు! బొంబాయిలో మా ఇంటికి తప్పకుండా రండి" అని తన అడ్రసు కార్డు రమేష్‌కిచ్చాడు.

బొంబాయి చేరేవరకు ఆయన రమేష్‌ని వదల్లేదు. ఏకాంతాన్నే కోరుకుంటున్న రమేష్‌ని ఆయన మాటలు

చాలా చికాకు పడ్డాయి. అతడినుండి తప్పించుకుందామని రమేష్ ఎంత మోటుగా మాట్లాడినా:

"చాలా రసవత్తరంగా మాట్లాడుతారుమీరు" అనే వారాయన.

భోజనం, టిఫిన్ విషయంలో రమేష్‌ని ఉదాసీన భావాన్ని గమనించి తమతో బాటే భోజనమూ అదీ తెప్పించే వారాయన.

"ఈ వయసులోనయినా బాగా తినాలండి. ఇప్పుడునన్నే చూడండి; మీ ఈడులో దీనికి మూడింతలు తినేవాడిని. ఇప్పుడైనా నేను మీకంటే నయమే."

రమేశ్ ఆయన్నుండి తప్పించుకోలేక పోయాడు. మాటకారి తనం, గొప్పలుగా చెప్పుకోడం ఎక్కువయినా, ఆయన మనసు మంచిదని గ్రహించాడు రమేశ్.

దాదర్ స్టేషన్‌లోనే దిగవలసిందిగా రాశాడు శేషగిరి.

స్టేషన్ రాగానే, ఆ బంగారు వర్తకుడు రమేశుడి కరస్పర్శచేసి;

"ఇక వస్తానండోయ్. మళ్ళీ మా ఇంటికి రావటం మరిచిపోయేరు" అన్నాడు.

రమేశ్ కిటికీలో మొహంపెట్టి శేషగిరికోసం వెతికాడు. కాని, శేషగిరి మొహం ఎక్కడా కనుపించలేదు.

రైలు ఆగగానే, రమేశ్ తన సూటుకేసు చేతిలో పట్టుకుని క్రిందికి దిగి చుట్టూ చూశాడు, శేషగిరి కనుపించలేదు. రమేశుడి హృదయం బరువెక్కింది. బహుశా తన రాక వాళ్ళకిష్టంలేదేమోనన్న ఆలోచన అతడి మనస్సును కించపరచింది.

అన్నయ్యమాట విని, తను ఇలా రావటం పొరపా టేమో అనుకున్నాడతడు. అయినా కళ్ళు చుట్టూ వెదుకుతూనే ఉన్నాయి. మరాఠీ, హిందీ, గుజరాతీ, తమిళ భాషలు కలగా పులగంగా వినిపిస్తున్నాయి. ఆజనసాగరంలో ఎక్కడికి వెళ్ళాలో తోచలేదు రమేశుకి.

"నమస్కారం అన్న మాతృభాషలో కంఠంవిని, టక్కున వెనుదిరిగి చూశాడు రమేష్.

అపరిచితులతో నిండిన ఆ జనసమ్మర్దంలో పరిచయ మున్న మనిషినిచూసి హాయిగా నిట్టూర్చాడు రమేష్.

"నమస్కారం"

"ఆయన రావటానికి వీలుపడలేదు. ఫార్మసీకి ఉదయమే వెళ్ళారు. నన్నే స్టేషనుకు వెళ్ళమనిచెప్పారు. రండి వెళదాం."

రమేష్ పెట్టే, పరుపుకోసం దెబ్బలాడుకుంటున్న "హమాల్" లతో మరాఠీలో మాట్లాడి, ఒకడిని సామాను తీసుకోనిచ్చి ముందుకు నడచింది రత్న.

రమేష్ ఆమె వెంటనే నడిచాడు.

ఆ గుంపులో చోటుచేసుకుంటూ, రమేశుని, ఇంట్లోని వారి క్షేమ సమాచారాలు అడుగుతూ నడుస్తోంది రత్న రమేష్ ముక్తసరిగా జవాబు చెబుతున్నాడు. అతడి దృష్టి అంతా రత్నమీదనే ఉంది. తను వెనకబడి రత్న కనిపించకపోతే, తను మళ్ళీ సమూహంలో ఒంటరి వాడి నయిపోతానన్న భయంతో ఆమెను అనుసరించాడు రమేష్. రమేశ్ మైసూరులో దసరా ఉత్సవాలప్పుడు మాత్రమే ఇంతటి జనసమూహాన్ని చూసి ఎరి

గినవాడు. దసరాలో మేల్కొన్న మైసూరు మళ్ళీ దసరా వరకు ప్రశాంతంగా నిద్రపోయేది.

రత్న మెట్లుఎక్కి దిగింది. రమేష్ ఆమెను అనుసరించాడు. స్టేషన్ దాటి బయటకివచ్చి ట్యాక్సీలో కూర్చున్నాక మొదటిమారు రమేశ్ వైపుకు చూసింది రత్న.

"సయాన్...బస్‌స్టాప్" అని డ్రైవరుతో చెప్పి, మళ్ళీ రమేష్‌వైపు తిరిగింది.

ఉల్లాసమే మూర్తీభవించినట్టుండే రమేశ్ క్రుంగి కృశించిపోయాడు. నిండుగా ఉండే బుగ్గలు వాడిన పువ్వులా అయిపోయాయి. కొంటెగా మెరిసే కళ్ళలో గాంభీర్యం చోటు చేసుకుంది.

తన దుస్తుల గురించి కూడా అతడికి శ్రద్ధఉన్నట్టు కనపడలేదు. తాము మైసూరు వెళ్ళినప్పుడు తన కేమీ తోచడంలేదేమోనని పలకరించిన రమేశేనా ఇతడు అనుకుంది రత్న.

"కులాసాగా ఉన్నారా మీరు ?"

కిటికీలోనుండి బయటకు చూస్తున్న రమేష్ ఇటు తిరగకుండానే సమాధానం చెప్పాడు.

"ఊఁ."

"చిక్కిపోయినట్టున్నారు ?"

"లేదు."

అతడికి మాట్లాడటానికి ఇష్టంలేదని తెలుసుకున్న రత్న ఇహ అతడిని పలకరించే ప్రయత్నం మానుకుని వెనక్కువాలింది.

సయాన్‌లోని ఓ మేడ రెండవ అంతస్థులోని ఓ ఫ్లాటు

లోనే ఉంటున్నారు వారు. రత్న ముందుగా వెళ్ళి, తలుపులు బార్లా తెరచి;

"లోపలికి రండి" అంది.

రమేశ్ తడబడుతూ లోపలికి అడుగు పెట్టాడు.

రత్న మందులూ, అవీ ఉంచిన ఓ గదికి రమేశుడిని తీసుకుని వెళ్ళి;

"ప్రస్తుతానికి ఇదే మీ గది. ఇల్లు చాలా చిన్నది. మీరు దేనికీ సంకోచపడకండి. నాకు ఉపచారం చేయటం రాదు. ఇది మీ ఇల్లే అని అనుకోండి" అంది.

రమేష్ మాట్లాడలేదు.

"నీళ్లు కాగాయి. స్నానం చేయవచ్చు" అంటూ రత్న ఇవతలికి వచ్చేసింది.

రమేష్ స్నానం చేశాడు.

"మీరు భోజనానికి లేవండి" అంది రత్న.

"శేషగిరిని కూడా రానివ్వండి."

"ఆయనకోసం కాచుకుంటే లాభం లేదు. తీరిక చిక్కినపుడే వస్తారు. ఒక్కరోజు రానే రారసలు. మీరూ రాత్రి రైల్లో సరిగ్గా నిద్రపోయి ఉండరు. భోంచేసి పడుకోండి."

రమేశుడికి ఏం చెప్పాలో తోచలేదు.

"మీరు భోంచేయకపోతే, నేను చెయ్యటానికి వీల్లేదు."

రమేష్ ఇక మాట్లాడకుండా భోజనానికి కూర్చున్నాడు.

ఆమె అన్ని మాటలు మాట్లాడినా, తనేమీ మాట్లాడలేక పోతున్నందుకు బిడియపడ్డాడు రమేష్.

ఏమని పలకరించటం?

ఆమెకో కూతురుండాలి కదూ! కూతురో, కొడుకో?

అనుమానంతో చుట్టూ చూశాడు రమేశ్. బట్టల స్టాండ్ మీద పువ్వుల ఫ్రాక్ కనిపించింది.

"మీ అమ్మాయేది?"

"బడికి వెళ్ళింది."

అంతే! ఇహ ఏంమాట్లాడాలో అతనికి తోచలా. సంకోచంతో సరిగ్గా భోంచెయ్యలేకపోయాడు. ఆమెమాత్రం...

"నాకు సరిగ్గా మర్యాదలు చెయ్యటం రాదు" అంటూనే వడ్డించింది.

అతడు భోంచేస్తుండగానే హాల్లో ఫోన్ మోగింది. రత్న వెళ్ళి రిసీవర్ తీసుకుంది. మాట్లాడివచ్చి;

"ఆయనే ఫోన్ చేశారు. మిమ్మల్ని గురించే అడిగారు. ఇంకో అరగంటలో వస్తున్నారట" అంది.

రమేశ్ మాట్లాడలేదు. భోజనానికి ఇంకో అరగంట ఆగితే బావుండేదికదా అనిపించకపోలేదు. భోజనమయ్యాక తన గదిలోకి వెళ్ళాడు.

"ఈ గదినిండా మందుల వాసన బాగా నిండిపోయింది. మీరు కాబోయే డాక్టరేగా! ఏం ఫరవాలేదనుకుంటాను" అంటూ పక్క సరిచేసి బైటికి వెళ్ళిపోయింది రత్న.

రమేశ్ పక్కమీద పడుకుని అక్కడే పడివున్న మెడికల్ జర్నలొకటి చేతిలోకి తీసుకున్నాడు.

రత్న, రమేశ్ క్షేమంగా వచ్చి చేరినట్టు సుశీలమ్మగారికి ఉత్తరంరాసి పనికుర్రాడి చేతికిచ్చి పోస్టు చేయించింది.

అరగంట భర్తకోసం కాచుకూర్చుంది. అతడు రాక పోయేసరికి తను భోజనం చేసేసి మళ్ళీ మధ్యాహ్నపు టిఫిన్ ప్రయత్నంలో ఉండగా కారు హారన్ వినపడింది.

శేషగిరి లోపలికొచ్చాడు.

"రమేశ్ ఏడీ? భోంచేశాడా?"

"ఆc, మీరు కాళ్లు కడుక్కోండి."

"అతడిని పలుకరించి వస్తాను" అంటూ గది తలుపులు తెరిచాడు శేషగిరి.

రమేశ్ నిద్రపోతున్నాడు.

"హలో..." అన్నాడు శేషగిరి.

"నిద్రపోతున్నారు. మీరు భోంచేద్దురుగానిరండి. అతడిని చూస్తే ఎన్నో రోజులుగా నిద్రే లేనట్టుగా వుంది" అంది రత్న.

శేషగిరి తలుపు ముందుకు వేసి వచ్చేశాడు.

రమేష్ నిద్ర లేచేసరికి సుమారు ఐదుగంటలయింది. అతడు పండుకొన్నగది వీధివైపు ఉండటంవల్ల కార్లూ, ట్రాములూ, బస్సుల సందడి విపరీతంగా వినిపిస్తోంది. శేషగిరి ఇల్లు మెయిన్‌రోడ్డులో ఉండటంవల్ల బస్సులు ఆగటం, వెళ్ళటం అన్నీ తెలుస్తున్నాయి రమేశుకి.

వెంటనే మైసూరులోని తన గది గుర్తుకొచ్చిందతనికి. ఆ ప్రశాంత వాతావరణాన్ని తల్చుకుంటున్నాడు.

బాల్కనీలో ఇద్దరు పిల్లలు మరాఠీలో మాట్లాడు తున్నారు. తన కర్థంకాని భాషను వింటూ అలాగే పడు కున్నాడు రమేష్. క్రమంగా ఆ పిల్లల సంభాషణ తారస్థాయి నందుకుంది.

అంతలోగా లోపలనుండి మధురకంఠ మొకటి విన బడింది.

"ఆశా..."

"ఏమిటమ్మా?"

"గట్టిగా కేకలు పెట్టకు. మామయ్య పడుకున్నారు."

"ఏ మామయ్య?"

"పడుకున్నారుగా, లేచాక చూద్దువుగానిలే."

"ఉహుఁ ఇప్పుడే చూడాలి."

"వద్దమ్మా, అరవకుండా ఆడుకోండి."

వాళ్ళమాటలు మళ్ళీ వినిపించలేదు. కాస్సేపు అలాగే పడుకుని, తరువాత లేచి బయటికి వచ్చాడు రమేష్.

చాలాసేపు నిద్ర పోయినందువల్ల అతడి కళ్లు ఎర్రగా బరువుగా ఉన్నాయి.

రత్న కూతురికి జడవేస్తూ, ఆ చిన్నపిల్లతో మరాఠీలో మాట్లాడుతోంది. రమేశ్ బయటికి రావటం చూసి;

"నిద్ర పట్టిందా? ఇక్కడంతా ఒకటేగోల" అంది.

"బాగానే నిద్రపోయాను. డాక్టర్ వచ్చారా?"

"ఆఁ. వచ్చారు. మళ్ళీ ఇప్పుడే పది నిముషాలవుతోంది; బయటకు వెళ్ళారు. మళ్ళీ ఏడుగంటలకు వస్తారట. రండి! మీరు టిఫిన్ తీసుకుందురుగాని."

ఆశా కళ్లు పెద్దవి చేసుకుని రమేశ్ వైపే చూస్తోంది.

"అమ్మా! మామయ్యేనా?"

"అవునమ్మా."

ఆశా మళ్ళీ కుతూహలంతో మామయ్య వైపు చూస్తోంది. రమేశుకి పాపతో ఏమైనా మాట్లాడా లనిపించింది. కాని చిన్నపిల్లలతో మాట్లాడే అలవాటే లేదతనికి. ఇంట్లో తనే చిన్నపిల్లాడు కనుక అందరూ తన్నే కుర్రవాడిని చేసి మాట్లాడించేవారు. ఆఖరికి ఎంతో ప్రయత్నంమీద,

"బడి వదిలిపెట్టారా ?" అన్నాడు.

"ఓ!"

మళ్ళీ ఇంకేం మాట్లాడాలో తోచక రమేష్ ఊరుకున్నాడు.

రత్న టిఫిన్, టీ తెచ్చి రమేశుకి ముందుంచింది.

"ఎందుకండి, ఇవన్నీ."

"అలా అనకండి ముందు తీసుకోండి."

రమేష్ టీ తాగి లేచేసరికి శేషగిరి వచ్చాడు. రాగానే కరస్పర్శచేసి;

"కృష్ణ ఎలా ఉన్నాడు? నువ్వెందుకిలా చిక్కిపోయావ్? టిఫిన్ తీసుకున్నావా? బయటి కెక్కడికైనా వెడదామా?" అంటూ, ప్రశ్నల వర్షాన్నే గుప్పించేశాడు రమేష్ మీదకు. కాని వాటికి జవాబులు ఆశించే స్వభావం కాదతనిది.

"వెడదాం. కాని, నావల్ల మీ పనులకు ఆటంకం కలగకుండా వుండాలి" రమేశ్ సంకోచంతో అన్నాడు.

"నా పని కెప్పుడూ కష్టం కలిగించుకోను నేను. నాకినిక్ కే పోదాంపద."

'నాన్నా, నేనూ?" ఆశా రాగం తీసింది.

రమేష్, శేషగిరి, ఆశా ముగ్గురూ గిరిగాంవ్‌లోవున్న శేషగిరి ఫార్మసీకి బయలుదేరారు.

రమేష్ కారులో కిటికీ దగ్గర కూర్చుని సంధ్యవెలుగు ఆవరించిన బొంబాయి వీధులను చూస్తున్నాడు.

మూడు, నాలుగు అంతస్థులుగల ఇళ్లు మొదట కనిపించాయి. ఒకే మూసలో పోసినట్టున్న ఆ భవనాలలో అందం కాని, వైవిధ్యంకాని, విస్పష్టతకాని కనిపించలేదు. చక్కటి నలుపునుండి తయారు చేసినట్టున్న పూరిపాకలు, వాళ్ళ వంటింట్లోని రేకుడబ్బాలు, జానెడుచోట్లో గాలికోసం బాల్కనీలో కూర్చున్న ఆడవాళ్లు; చెట్టు చేమ ఆఖరికి గడ్డికూడా మొలవని పార్కు అనిపించుకుంటున్న చోట్లలో ఆడుకుంటున్న పిల్లలు అంతా చూశాడు రమేష్.

ఎన్నిభాషలు ఎన్ని వేషాలు ? అక్కడ లేనిదేమిటి ? ఓ చిన్న ప్రపంచాన్నే ఇముడ్చుకున్నట్టుంది బొంబాయి రమేష్ కళ్ళకు.

శేషగిరి ఫార్మసి ముందు కారు ఆగినపుడు రమేష్ ఈ లోకంలోకి పడ్డాడు. డాక్టరు రాకకోసం ఎదురుచూస్తున్న రోగులు శేషగిరిని చూడగానే లేచి నమస్కారం చేశారు.

శేషగిరి రమేష్‌ని ఓ కుర్చీలో కూర్చోమని తనపనిలో పడ్డాడు. అన్నీమరిచి తన్మయత్వంతో తనపని చూసుకుంటున్న రమేష్ అనుకున్నాడు: "ఇతను మంచిడాక్టరు."

శేషగిరికి రాని భాషలేదు. రోగులతో ఎవరి భాషలో వాళ్ళతో తడుముకోకుండా మాట్లాడేవాడు. అరగంట కాక మునుపే ఆశకు విసుగెత్తింది. తండ్రిదగ్గరకు వెళ్ళి;

"నాన్నా నేను ఇంటికి వెడతాను" అంది.

"ఎవరితో వెడతావ్?"

"మామయ్యతో."

ఇంకా అప్పుడే బొంబాయిలోకి అడుగుపెట్టిన రమేశుతో ఆశను పంపేంత ధైర్యం కలగలేదు శేషగిరికి. అదీగాక, రమేశుడి నిరాసక్తి, పరధ్యానాన్ని శేషగిరి కూడా గమనించాడు.

శేషగిరి కాంపౌండర్‌ని తోడిచ్చి వాళ్ళిద్దరినీ ఇంటికి పంపాడు.

రమేశ్, ఆశా ఇంత తొందరగా ఇంటికి వస్తారని రత్న అనుకోలేదు. రాత్రి వంట పూర్తిచేసుకుని రేడియో వింటూ కూర్చుంది.

"అమ్మా..."

ఆశ గొంతు విని, రత్న: "ఏమిటి ఇంత తొందరగా వచ్చేశారు!" అంది.

"ఆశకు అక్కడేమీ తోచలేదు. ఇంటికి వెళ్ళిపోదామంటే, వచ్చేశాం" అంటూ రమేష్ అక్కడే ఉన్న ఓకుర్చీలో

కూర్చున్నాడు. ఆశ తన మరాఠీ స్నేహితురాలికోసమని పరిగెత్తింది.

రమేశ్ మౌనంగా కూర్చున్నాడు. ఆ నిశ్శబ్దతను భరించలేక రత్న,

"మీరు చాలా చిక్కిపోయారు" అంది.

"లేదు."

"నే నా మాత్రం తెలుసుకోలేనా ఏం? మీరు ఇక్కడి నుండి వెళ్ళేలోపల మామూలుగా కావాలి."

"వీల్లేదు! అసంభవం..." రమేశ్ గట్టిగా అరిచాడు.

రత్న చిరునవ్వు నవ్వింది.

"మనసుకు మించిందిలేదు, మనం అవుతుందనుకుంటే అవుతుంది; కాదనుకుంటే కాదు. అంతే."

"నేను నమ్మను."

"మీరు కాబోయే డాక్టరు. ఇలా అన్నిటికీ వీల్లేదు; అబద్ధం అంటే ఎలా? చనిపోతున్న రోగిలోకూడా ఆశాభావాన్ని రేకెత్తించడం మీ కర్తవ్యం. అలాంటప్పుడు మీ స్వవిషయంలోనే ఇలా నిరాశ చెందడం న్యాయంకాదు."

"నేను డాక్టర్ని కాను."

"నిజం? నేను మైసూరు వచ్చినప్పుడు మీరు ఫైనల్ ఇయర్, ఎం. బి. లో ఉన్నారనే విన్నానే."

"నిజమే కాని, నేను ఇపుడు చదవటంలా. చదువు పూర్తిచేస్తానన్న నమ్మకంకూడా లేదు."

"ఏం?"

"ఈ డాక్టరీ కేవలం నటన. బ్రహ్మ మనకు ఇవ్వని ఆయుష్షు మాత్రం ఏ డాక్టరూ పోయలేడు. ఈ వృత్తి, మందులూ, సర్జరీ – అంతా నట్టిబూటకం."

తన మాటలకు తనే ఆశ్చర్యపోయాడు రమేశ్. తను ఇన్ని మాటలు మాట్లాడింది తన స్నేహితుల ముందు కాదు. ఇంచుమించు అపరిచితురాలయిన స్త్రీ ముందు. అతనికే ఆశ్చర్యం వేసింది. తనేనా ఇన్ని మాటలు మాట్లాడింది?

"నిజంగా?" అంటూ రత్న కళ్ళు పెద్దగా చేసుకుని నవ్వింది.

నా మాటల్లో నమ్మకం లేదా మీకు? ఉన్నదున్నట్టే చెప్పాను."

"నిజంగా? కాని, ఇంత తొందరగా ఏ నిర్ణయానికి రాకండి."

"నే నలా తొందరపడి నిర్ణయానికి వచ్చే మనిషిని కాను, ఇది స్వానుభవంతో చెప్తున్న విషయం."

రత్న పరీక్షగా రమేశుని వైపుకు చూసింది.

పొడుగ్గా పెరిగాడు రమేశ్ నిజమే; కాని మొహంలో మునుపటి అందమూ, ఠీవీ లేవు. మునుపటిలా తన డ్రస్సు విషయంలో శ్రద్ధకూడా లేదు. సరిగ్గా దువ్వుకోని ఉంగరాలజుట్టు నుదుటిమీదకు పడుతోంది. వయసుకు మించిన గాంభీర్యం అతడికి వింతకాంతి నిచ్చింది,

"అనుభవమా! ఇంత చిన్న వయస్సులో మీ కేలాంటి అనుభవం?"

"అనుభవానికి వయస్సే కావాలా?" రమేశ్ ఎదురు ప్రశ్న వేశాడు.

"ఎలాంటి అనుభవం అన్నది వయస్సునుబట్టే ఉంటుంది. ఇప్పుడు మీకు కాలేజీ అనుభవాలు తప్ప మరేమీ అయ్యే అవకాశంలేదు. కాని, మీ నాన్నగారికి విషాదకరమైన అనుభవాలు అయి ఉండవచ్చు..."

"పొరపడుతున్నారు మీరు. చిన్న వయస్సయినంత మాత్రాన విషాదకరమైన అనుభవాలు అయి ఉండరాదా? ఎందుక్కా-కూడదు?..." ఉద్వేగంతో నోటమాట పెగల్లేదు రమేశుకి.

"కాని..."

"దయచేసి ఈ విషయం ఇహ మాట్లాడకండి ప్లీజ్..." రమేష్ బ్రతిమాలుకుంటున్నట్టు అన్నాడు.

రత్న మాట ఆపేసి అతని వంక చూసింది.

ఉద్వేగంతో అతడి మొహం ఎఱ్ఱబడింది. పెదిమలు అదురుతున్నాయి. అతడు ఇంత ఉద్వేగపడతాడని రత్న ఊహించలేదు.

"మిమ్మల్ని నొప్పించానా? క్షమించండి" అంది రత్న పశ్చాత్తాపంతో.

"క్షమించాల్సినంత పెద్ద తప్పేమీ చెయ్యలేదు మీరు" అంటూనే రమేశ్ లేచి నిల్చుని;

"అలా తిరిగివస్తాను" అంటూ బయటికి వెళ్ళిపోయాడు. రత్న అతని వెనుకనే గబగబా మెట్లుదిగి వచ్చి;

"మాట..." అంది.

చకచకా మెట్లు దిగుతున్న రమేశ్ వెనుదిరిగి ఏమిటన్నట్లు చూశాడు.

"మీకు ఈవూరి ట్రాఫిక్‌తో పరిచయం లేదు. ఒక్కోమారు మేమే తికమకపడిపోతాం. రోడ్డు దాటేటప్పుడు జాగ్రత్త సుమండీ."

రమేశ్ మాట్లాడకుండా దిగి వెళ్ళిపోయాడు.

రత్న యోచనాక్రాంతురాలై ఇంట్లోకి వచ్చింది.

రమేశ్ పరధ్యానాన్ని రత్న సూక్ష్మమైన కళ్ళు గమనించాయి. కనుకనే అతను వెళ్ళేటప్పుడు జాగ్రత్తగా ఉండమని హెచ్చరించటం మరచిపోలేదు.

అనవసరంగా అతడి మనసు నొప్పించానేమోనని బాధపడుతోంది రత్న మనసు. అలాగే కూర్చుండి పోయింది.

ఆశా ఇంటికి వచ్చి పలకరించినపుడే ఆమె ఈ ప్రపంచంలో పడింది. లేచి, ఆశకు అన్నంపెట్టి పడుకోబెట్టింది. తను పుస్తకం చేతికి తీసుకుని కూర్చుంది.

రాత్రి తొమ్మిదిన్నర దాటినా, రమేష్ రాకపోయేసరికి రత్న కంగారుపడింది.

తన మాటలతో అతడి మనస్సు అల్లకల్లోలమయి ఉంటుంది. ఇహ—ట్రాములు, బస్సులు తిరిగే ఆ మెయిన్ లోడ్డు గుర్తుకొచ్చేసరికి భయంతో ఆమె హృదయం కంపించింది.

రమేశ్ ఇంకా ఇంటికి రాకపోవటానికి కారణమేమిటి?

రత్న బాల్కనీలో నిల్చుని బయటకు చూసింది. రాత్రి తొమ్మిదిన్నర దాటినా, సందడి మాత్రం తగ్గలేదు.

ట్రాములూ, బస్సులు నిలకడలేకుండా తిరుగుతున్నా యనిపించింది. రత్నకు ఎదురుగా ఉన్న మద్రాసీ హోటలులోని మేనేజర్ "పాన్" వేసుకుంటూ, కూర్చున్నాడు.

రత్న లోపలికి వచ్చింది. తను వచ్చిన అయిదు నిముషా ల్లోనే రమేశ్ కూడా వచ్చాడు.

"అబ్బ, వచ్చారా! మీరు ఎంతకి రాకపోయేసరికి ఎంత కంగారుపడ్డానని. . ."

"కంగారెందుకు?"

"ఈ ట్రాఫిక్ సందడీ అదీ మీకంతగా అలవాటులేదు."

"అంత సులువుగా నేను చావనులెండి."

మళ్ళీ మాటలు ఆ విషయంవైపుకే వెడుతున్నట్టు కని పించింది రత్నకు. మాట మారుస్తూ:

"ఎందాకా వెళ్ళారు?" అంది.

"మాతుంగా మార్కెట్‌కు వెళ్ళి వచ్చాను" అంటూ జేబులోంచి బిస్కట్-ప్యాకెట్ తీసి:

"ఆశా ఏదీ?" అన్నాడు.

"పడుకుంది."

"తరువాత

రత్న ప్యాకెట్టు విప్పి రెండు బిస్కట్లు రమేశుడి కిచ్చింది.

"ఆశకు బదులు ఇప్పుడు మీరు తినండి."

వద్దనలేకపోయాడు రమేశ్.

"భోంచేసారా?"

"డాక్టర్ గారిని కూడా రానివ్వండి" అన్నాడు రమేశ్."

శేషగిరి రాగానే అందరి భోజనాలూ అయ్యాయి. శేషగిరి రమేశ్ తో కబుర్లకు దిగాడు.

"ఏం చేస్తావయ్యా ఇకముందు? వచ్చే సంవత్సరం పరీక్షకు కడతావా?"

రమేశ్ కు ఏ విషయమైతే అక్కర్లేదో, అదే విషయం మాటల్లోకి వచ్చింది.

"చూడాలి; నేనింకా ఏదీ నిశ్చయించుకోలేదు."

"ఒద్దులే. అదేం బెంగ పెట్టుకోకు. కొన్ని రోజులు ఇక్కడ హాయిగా ఉండు. నేనూ మీ అన్నయ్యే అనుకో. నా పనుల ఒత్తిడివల్ల నేను నీతో ఎక్కువసేపు గడపలేకపోవచ్చు. కాని, రత్న ఉంటుంది. ఏం సంకోచమూ పెట్టుకోకు."

రమేశ్ ఏం చెప్పాలో తోచక ఊరుకున్నాడు.

శేషగిరి ఇక పడుకుందా మనుకునేసరికి డోర్ బెల్ మ్రోగింది. తనే వెళ్ళి తలుపు తీశాడు. వాళ్ళతో మాట్లాడి లోపలకు వచ్చి:

"రత్నా! నేను డాంగే ఇంటికి వెళ్ళి వస్తాను. తలుపేసుకో" అని చెప్పి రమేశుడితో:

"పడుకోవయ్యా; నాకోసం కాచుకుర్చోకు" అని చెప్పి, తన మందులపెట్టె తీసుకుని వెళ్ళిపోయాడు.

"నిద్ర వస్తుంటే పడుకోండి" అంది రత్న.

"మధ్యాహ్నం బాగా నిద్రపోయానేమో; ఇప్పుడు నిద్ర రావటంలా. మీరు పడుకోండి. డాక్టర్ వస్తే నేను తలుపు తీస్తాను."

రత్న వెళ్ళిపోయింది. రమేశ్ లైటు ఆర్పేసి బాల్కనీలో నిల్చుని నక్షత్రాలు లెక్కపెట్టసాగాడు.

శేషగిరి వచ్చేవరకు అలాగే రాతిబొమ్మలా ఆకాశం వైపుకు చూస్తూ నిల్చున్నాడు రమేష్. శేషగిరి రాగానే తలుపు తీసి తన గదికి వెళ్ళి పడుకున్నాడు. అతడి మనసు ఆలోచనలతో ఊగిపోతోంది.

"నేను ఎందుకు వచ్చానిక్కడికి? ఊరు విడిచి పారిపోతే, మనసులో అగ్ని చల్లారుతుందా? ఎంత పొరబాటు – ఆలోచనలతోనే తెల్లవారింది."

ఉదయం కాఫీ తాగేటప్పుడు శేషగిరితో అన్నాడు:

"నేను ఈరోజు వెళ్ళిపోతాను."

బ్రెడ్డు తింటున్న శేషగిరి ఆశ్చర్యంతో తలెత్తి చూసి "ఏమిటీ?" అన్నాడు.

"నేను...ఊరికి వెళ్ళిపోదామని..."

"నిన్ననే వచ్చావ్, ఈరోజు వెళ్ళిపోతావా?"

"ఆఁ."

"బొంబాయి చూడవా?"

"ఏముంది చూడటానికి? ఒకటే సందడి."

"నువ్వు ఇప్పుడప్పుడే వెళ్ళలేవు" ఖచ్చితంగా చెప్పాడు శేషగిరి.

"ఏం?"

"మళ్ళీ నేను వెళ్ళమనేవరకూ ప్రయాణం మాట తల పెట్టకు" – అంటూ వెళ్ళిపోయాడు శేషగిరి.

రమేష్ నిస్సహాయంగా రత్నవైపు తిరిగాడు. ఆమె ఏమీ మాట్లాడలేదు.

"నేను వెడతాను."

"ఇంత త్వరగానా? మీకిక్కడ కష్టంగా ఉందా?"

దీని కేమని జవాబు చెప్పాలో తోచలేదు రమేశ్ కి.

"కష్టమనికాదు; నేను మీకంతా 'న్యూసెన్సు" గా ఉన్నాననిపిస్తోంది. ఊరికి వెళ్ళిపోదామని ఉంది. వెడతాను—

"మా కంపెనీ అంత తొందరగా విసుగనిపించిందా ?"

"అలా కాదు..."

"ఇప్పుడు పంపలేం మిమ్మల్ని. సాయంత్రం సముద్ర తీరానికి వెడదాం. సముద్రం చూడాలని లేదూ ?"

"దాన్నెందుకూ చూడటం..."

"చూసితీరాల్సింది సముద్రం. ప్రయాణంమాటే తల పెట్టకండి."

రమేష్‌కి కోపం, దుఃఖం పొంగివచ్చాయి. శేషగిరి ముందుమాట్లాడాలంటే, సంకోచం అడ్డువచ్చేది. ఎందుకోగాని, రత్నదగ్గర సంకోచం లేకుండా మనసువిప్పి మాట్లాడగలిగే వాడు.

"అయినా మధ్య మీదేమిటి బలవంతం నా ప్రయాణా నికి."

పనిచేసుకుంటున్న రత్న వెనుదిరిగి చూసి:

"ఎలా వెళతారో వెళ్ళండి చూద్దాం" అంది.

"అలాకాదు; నన్ను పంపేయండి."

"పంపక మిమ్మల్ని ఇక్కడే అట్టేపెట్టుకుంటామను కున్నారా? తప్పకుండా పంపుతాం. అన్నట్టు ఇక్కడి వంట నచ్చిందా మీకు?"

"ఏదో ఒకటి ఆకలవుతుంది కాబట్టి తినాలి; అంతే, నేను అలా తిరిగివస్తాను."

"చాలా ఎండగా ఉంది. అనవసరంగా ఇప్పుడెందుకూ వెళ్ళటం? నిన్నటిలా నన్ను భయపెట్టకండి."

"నిన్న మిమ్మల్ని భయపెట్టానా?"

"అవును, నేనన్న మాటలకు అసలే మీకు నొచ్చు కున్నారు. అందుకే అంత భయపడ్డాను. ఇంకాస్సేపటిలో మీరు రాకపోయినట్టయితే నేనే వెతుక్కుంటూ వచ్చేదాన్ని. ఈరోజు మాత్రం అలా చేయకండేం."

"లేదు" అన్నాడు రమేశ్.

తను పొద్దుకు సరిగ్గా ఇంటికి వస్తేనేం, రాకపోతే నేం? ఎందుకంతగా పట్టించుకోవాలి అనుకున్నాడు రమేష్.

సాయంత్రం దాదర్ బీచికి వెళ్ళటానికి సిద్ధమయింది రత్న. రాత్రి వంట తొందరగా పూర్తిచేసుకుని ఆశకు మంచి గుడ్డలు వేసి, తనూ చీరమార్చుకుని రమేశ్ గదిలోకి వచ్చి:

"వెళదామా?" అంది.

"పదండి." రమేశ్ ఎలాఉన్నాడో అలాగే బయల్దేరాడు.

"మీ రింకా తయారవలేదు..."

"ఇలాగే వస్తాను"

ఏమో చెప్పాలనుకుంది రత్న. ఆ ప్రయత్నం మాను కుని, తలుపుకు తాళంవేసింది ముగ్గురూ బయల్దేరారు.

"బస్సులో వెడదామా ? నడిచే వెడదామా ?"

రమేష్ బదులు చెప్పకమునుపే ఆశా:

"బస్సులో వెడదామమ్మా" అంది.

వాళ్లు బీచి చేరేసరికి సుమారు ఆరు గంటలయింది. మనసుకు ఆహ్లాదాన్ని కలిగించే సముద్రపు గాలికోసం జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు.

ఇసుకలోకి అడుగు పెట్టగానే, ఆశా ఆనందంతో గంతు లేసింది. ఇసుకలోనుండి ఆల్చిప్పలు, శంఖాలు ఏరి. దాచమని తల్లి చేతికిచ్చింది.

రత్న ఇసుకమీద కూర్చుంటూ రమేష్తో ;

"నే నిక్కడె కూర్చుంటాను. కావాలంటే మీరు అలాగే తిరిగిరండి" అంది.

"అక్కర్లేదు, నేనూ ఇక్కడే కూర్చుంటాను" అంటూ, తనూ కూర్చున్నాడు.

ఆశ గంతులేస్తూ నీళ్ళ దగ్గరకు వెడుతూంటే రత్న :

"నీళ్ళదగ్గరగా వెళ్ళకు" అని కేక వేసింది.

"అలలు చూస్తాను" అంది ఆశా.

"దూరంనుండే చూడు; దగ్గరగా వెళ్ళకు."

రమేశ్ చేతివేలితో ఇసుకమీద గీతలు గీస్తూ కూర్చు న్నాడు.

సముద్రుడు ఆనందంతో ఉప్పొంగుతున్నట్లు అలలు ఎగిరెగిరి పడుతున్నాయి. నీలిరంగు అలలు ఒకదాని వెనకొకటి తరుముకొంటూ, ఒడ్డును చేరక మునుపే నవ్వుల పువ్వుల్ని వెదజల్లినట్లు, పీటిని విరజిమ్మి అతి వేగంగా వెనక్కి వెళ్ళిపోతున్నాయి.

అస్తమిస్తున్న సూర్యుడి సంధ్యాకిరణ కాంతి పరిగెడుతున్న తెలిమబ్బులమీద ప్రతిఫలించి బంగారు తునకలను నీలాకాశంలోకి విసిరేసినట్టు కనిపింప చేస్తున్నది.

ఉప్పునీళ్ళతో చేదుమాత్రను మింగినట్టు ఘోషపెడుతున్న అలలను జగుప్సతో చూశాడు రమేష్. సముద్రంలో సౌందర్యం కాని, రమణీయత కాని కనిపించలేదనికి.

"ఎలా ఉంది సముద్రం?" రత్న అడిగింది.

"నేను సముద్రాన్ని చూడటం ఇదే మొదటిమారు. కాని, నాకేమీ ఆశ్చర్యంగా లేదు. కొత్తగా అనిపించటమూ లేదు."

"మీరు ఎక్కువగా ఇంగ్లీషు పిక్చర్ చూస్తారా?"

రత్న ప్రశ్నవిని తలెత్తి ఆమెవైపు చూశాడు రమేష్. చేతిలో చెయ్యివేసుకొని నడుస్తున్న జంటను తదేకంగా చూస్తోంది రత్న.

గతించిన మధుర స్వప్నాల తియ్యటి స్మృతి ఆమె కను రెప్పల వెనుక దాగివుంది.

"అవును. ఇంగ్లీషు సినిమాలు చూస్తాను. అలా అడుగుతున్నారేం?"

"సముద్రం మీకు క్రొత్తగా కనిపించటం లేదన్నారుగా. అందుకు చెబుతున్నా. వెన్నెలరాత్రిలో ఓసారి ఇక్కడికివచ్చి చూడండి. అప్పుడు మీకు సముద్రపు పరిపూర్ణ సౌందర్య దర్శనం కలుగుతుంది."

"సౌందర్యానికి మీరంత ప్రాధాన్యత నిస్తారా ?"

"ఎవరయినా అంతేకదా. సముద్రాన్ని చూడాలని ఎంతోమంది వస్తారు: కాని, బురదనీళ్ళను చూడాలని ఎవ్వరైనా వెడతారా ? పున్నమి వెన్నెలలో బాల్కనీలో గంటలకొద్దీ కూర్చుంటాం. అదే అమావాస్య చిమ్మచీకటిని చూడాలనీ ఎవ్వరైనా ఉవ్విళ్ళూరుతారా ?" అంది రత్న. దూరంగా వెడు తున్న దంపతులమీదనే దృష్టిని కేంద్రీకరించి.

"పూర్ణిమ ఇంకో ముఖమేకదా అమావాస్య ?"

"నిజమే కాని, లోకులు వెతికేది ఒక్క ముఖంకోసం మాత్రమే."

"నేను మీతో ఏకీభవించలేను. వికారమన్నది ఈ ప్రపంచంలో లేనేలేదు. సృష్టిలో ప్రతివస్తువుకూ ప్రత్యేక సౌందర్యముంటుంది. అమవసిరాత్రి నలుపు పూర్ణిమ కెక్కడి నుండి వస్తుంది.

రత్న పరధ్యానంగా "అదీ నిజమే" అంది.

రమేష్ వేళ్లు ఇసుకలో గీతలు గీస్తున్నాయి. రత్న అటువైపు చూసి:

"మీరు డాక్టరవనని అన్నారుకదూ?" అంది.

"అవును."

"కాని మీరు తప్పకుండా డాక్టరవుతారు. కావాలంటే నేను రాసిస్తాను."

"నేను చదువు పూర్తిచెయ్యకూడ దనుకున్నాను కదా; డాక్టర్నెలా అవుతాను?"

"మీరు చదివి తీరుతారు."

ఎలా చెప్తున్నారు మీరు?"

రత్న ఇసుకలో రమేష్ గీసిన బొమ్మవైపు చూసింది రమేష్ మాట్లాడుతూనే, ఇసుకమీద మనిషి అస్థిపంజరపు బొమ్మ గీశాడు

"మీ మనసులో, రక్తపు ప్రతీకణంలోనూ డాక్టరుగా కావాలనే కాంక్ష నిండిఉంది. తాత్కాలికంగా, ఆ కాంక్ష మీద ఉదాసీనత తెరపడింది. అంతే."

తప్పుచేస్తూ దొరికిపోయిన కుర్రాడిలా గబుక్కున బొమ్మ చెరిపేసి కొంచెం కోపంతో:

"నా ప్రతి కదలికనూ అంతగా గమనిస్తున్నా రెందుకూ?" అన్నాడు

"అది నా స్వభావం."

పగల్లా మబ్బుల్తో వసంతాలాడి అలసిపోయిన సూర్యుడు సముద్రంలోకి దుముకబోతున్నాడు.

జన సందడికూడా ఎక్కువగానేఉంది.

"ఆశా...ఆశా ఏది?"

రమేశ్ చుట్టూ చూశాడు. కొంచెం దూరంలో కూర్చున్న గుజరాతీ దంపతుల కుర్రాడితో కబుర్లు చెబుతోంది ఆశా. ఆంగ్లో ఇండియన్ కుర్రాడొకడు జూలు కుక్కతో

ఆడుకుంటున్నాడు. అతడు నీటిలోకి విసిరేసిన బంతిని కుక్క నోట్లో పట్టుకుని తెస్తోంది.

చీకటి వెలుగుస్థానాన్ని ఆక్రమించుకుంటోంది. తిను బండారాలు అమ్మేవాళ్ళ పెట్రోమాక్సు దీపాలు మట్టుకు అక్కడక్కడా వెలుగుతున్నాయి. చీకటి మందంగా అవుతున్న కొద్దీ సముద్రపు హోరు ఎక్కువ కాసాగింది.

రత్న తనచేతి వాచిని కళ్ళదగ్గరగా పెట్టుకునిచూసి :

"ఇక వెళదామా ?" అంది.

"ఊఁ"

ఇద్దరూ లేచి, గుడ్డలకు అంటుకున్న ఇసుకను విదిలించు కున్నారు.

"ఆశా, రామ్మా వెళదాం."

ఆశ పరుగెత్తుకుంటూ వచ్చింది. ముగ్గురూ ఇంటికి బయల్దేరారు.

దోవలో బీచికి దగ్గరనే ఉన్న స్విమ్మింగ్ పూల్ను చూపించింది రత్న రమేష్కి.

"నీకు ఈత వచ్చా మామయ్యా" అని అడిగింది ఆశా.

"ఊఁ. నేలమీదే ఈత కొడతాను" అన్నాడు రమేశ్.

రమేష్తో తిరగటానికి శేషగిరికి తీరికుండేది కాదు. ఉదయంనుండి రాత్రివరకూ ఫార్మసీలోనే ఉండవలసివచ్చేది. ఇంటికొచ్చిన తరువాతకూడా ఎవరయినా వెతుక్కుని వచ్చే వారు.

బొంబాయి చూడటానికి రమేష్కి గైడ్ అవసరమేమీ లేదు. కావాలనుకున్న చోటికి వెళ్ళిరాగలడు. కాని, అతడి

మనసులోని వ్యథ, పరధ్యానం, ఉదాసీనతలను గమనించిన రత్నకు అతడిని ఒంటరిగా పంపాలంటే భయంగా ఉండేది. ఉదయం వంటపనీ అవీ ఉండేవి కనుక వెళ్ళలేకపోయేది. సాయంకాలాలు వెళ్ళటానికి వీలుగా ఉండేది. మొదటి రెండురోజులు ఆశా వెళ్ళటానికి ఉత్సాహం చూపింది. తరువాత విసుగనిపించింది. తన మరాఠీ స్నేహితురాలితో ఆడుకోవటానికే ఇష్టపడింది.

ఒక సాయంత్రం ఆశకు తల దువ్వి పువ్వులు పెడుతూ. "ఆశా! చౌపతికి వెడదాం ఏం?" అంది ఆమె.

"నేను రానమ్మా; రజినీ, నేనూ ఇక్కడే ఆడుకుంటాం" అంది ఆశా.

రత్నకేమో కూతుర్ని తనతో తీసుకెళ్ళాలనే ఉంది; కాని, ఆశా రానని మొండికేసింది. సరే; ఇంట్లోనే ఆడుకోమని చెప్పి బయల్దేరింది రత్న.

"మీరెందుకు శ్రమపడతారు? నేను వెళ్ళిరాగలను?"

"ఒద్దు; నేనూ వస్తున్నా; ఒక్కరే వెళ్ళకండి" అని తాళం వేసుకుని వచ్చింది రత్న.

బస్సులో రత్న రమేశ్ ప్రక్కనే కూర్చుంది. ఈ పద్ధతి అలవాటులేని రమేష్, రత్న అలా కూర్చోగానే, సిగ్గుతో కుంచించుకుపోయాడు. అతడి సంకోచ ప్రకృతి చూసి రత్న నవ్వింది.

ఇంకో స్టాపులో ఒకసీటు ఖాళీ కాగానే రత్న రమేశ్‌తో:

"కావాలంటే అక్కడికే వెళ్ళి కూర్చోండి" అంది.

"ఏం, ఇక్కడే బావుంది."

"ఆహా, సంకోచపడి తేనూ" అంటూ నవ్వింది రత్న.

రమేష్ మొదట్లో సంకోచపడినమాట వాస్తవమే. కాని, రత్న పక్కన కూర్చోగానే అతడి మనసు, శాంతి సమాధానాలతో తేలిక పడినట్లయింది. అతడి గుండెలమీద ఉన్న అగోచరమైన బరువు తనంతట తానే దిగిపోయినట్లనిపించింది.

"లేదు...లేదు..." అన్నాడతను.

"కావాలంటే నేను వెళ్ళి అక్కడ కూర్చుంటాను."

"వెళ్ళండి మీకంత కష్టంగా ఉంటే."

రత్న ప్రక్కకు తిరిగి అతడి మొహంలోకి చూసింది.

అతడి క్రాపు ఎప్పటిలా చెదిరిపోలేదు. శుభ్రంగా దువ్వుకున్నాడు. దుస్తులూ అంత అన్యాయంగా లేవు. కళ్ళలోని గాంభీర్యం మాత్రం అలాగే వుంది.

రత్న మనసు కొంచెం తేలికపడింది.

"డాక్టరయ్యేవారు ఇలా కోపించుకోరాదు. మీరే కోపించుకుంటే రోగుల గతేమిటి?"

"నేను డాక్టర్నీ కాను! మీరు రోగులూ కారు."

"ఎప్పటికయినా మీరు డాక్టరవుతారు."

లేదు, ఎప్పటికీ కాబోను కూడా."

"నేనేమో ఎప్పుడయినా ఒకప్పుడు జబ్బు పడచ్చు. అప్పుడు మీ దగ్గరతప్ప మరెవరిదగ్గరా మందు పుచ్చుకోనంటే అపుడేం చేస్తారు?"

"నేను మందివ్వను."

"వేచి చూస్తాను."

"అలాగే."

తరువాత వాళ్లేమీ మాట్లాడుకోలేదు. చౌపాటీబీచిలో దాదర్ బీచిలోకన్నా ఎక్కువమంది జనం ఉన్నారు. అప్పుడే చీకటిపడుతోంది. బీచిలో కూచున్నవాళ్ళకు మలబార్ హిల్స్ లోని ఇళ్ళ దీపాలు దూరనక్షత్రాల్లా, నల్లటి బ్యాక్ గ్రౌండ్ లో రమణీయంగా కనిపిస్తున్నాయి. అప్పుడప్పుడు, ఆరుతూ వెలుగుతూ కనిపిస్తున్న మోటార్ అడ్వర్టయిజ్ మెంటు ప్రజల్ని ఆకర్షిస్తోంది.

ఎంతసేపయినా రత్న మాట్లాడకపోయేసరికి రమేశ్ కి విసుగనిపించింది. ఆమె మాటా పలుకూ, గాజుల గలగలకు అలవాటుపడిన అతడి మనసు వాటి అభావంతో వ్యాకులగ్రస్తమయింది.

"మాట్లాడరేం?" అన్నాడు రమేశ్.

"ఏం లేదు."

"ఏమిటి కారణం? చెప్పండి."

"కొంచెం తలనొప్పిగా ఉంది."

"సారిడాన్ వేసుకోండి. అదే తగ్గిపోతుంది."

"మందూ మాకూ అంతా ఒట్టి బూటకం. నేను ఎంతసేపు తలనొప్పి అనుభవించాలని ఉందో అంతసేపు అనుభవించాల్సిందే; తప్పదు."

రమేశ్ చటుక్కున రత్నవైపు చూశాడు. రత్న అతడినే సూటిగాచూస్తోంది. ఆమె కళ్ళలోని ప్రశ్నకు బదులు చెప్పలేక అటు తిరుక్కున్నాడు.

"మాట్లాడరేం?" రత్న మళ్ళీ కదిలించింది.

"నేను చెప్పినట్లు వినేటట్లయితేనే మాట్లాడతాను."

"చెప్పండి."

"సారిడాన్ తీసుకోండి."

"తలనొప్పితో బాధపడేది నేనేగా; మీ కెందుకొచ్చిన ఆరాటం?"

"రేపు మీరు మంచాన పడితే శుచిశుచిగా వండిపెట్టే వాళ్ళుండరనీ..."

"ఎదురుగానే ఉంది మద్రాసీ హోటల్. అక్కడ భోజనం చాలా బాగుంటుంది."

"కాని, మీచేతి వంట-రుచి దాని కెలా వస్తుంది?"

"నిజంగా! భోజనంకోసమేనా? ఇంకేమీ లేదా?"

"లేదు."

"నిజంగా?"

రమేష్ కాస్సేపు ఊరుకుని మళ్ళీ అన్నాడు:

"మీరు బాధపడటం నేను చూడలేను."

"అంటే, నేను బాధపడుతూ ఉండటం మీ కిష్టం లేదన్న మాటేగా?"

"అవును."

"అయితే మీరే సారిడాన్ తెచ్చిపెట్టండి."

రమేశ్ చిక్కులో పడ్డాడు. రత్న ఇంత తొందరగా తనను మాటల్లో ఇరికిస్తుందని అనుకోలేదు రమేష్.

అతడి మనసు ఊగిసలాడింది.

ఆమెకు తలనొప్పయితే తనకేం? అనుభవించనీ; తనే మాత్ర తెచ్చివ్వాలనే పట్టుదలేమిటి?

"మీరు తలనొప్పితోనే బాధపడండి నాకేం" అన్నాడు రమేష్ మొరటుగా.

"సంతోషంగా అనుభవించగలను. ఇహ నా తలనొప్పి మాట వదిలేయండి."

"రత్నా! నన్ను బాధపెట్టడంవల్ల మీకేం లాభం?" రమేశ్ వ్యాకులంతో అడిగాడు.

"డాక్టరవకూడదని ప్రతిజ్ఞచేశారే మీరు? మీకేం లాభం? ఎవర్ని ఉద్ధరిద్దామని ఈ ప్రతిజ్ఞచేశారు?"

"నాకు వృత్తిలో నమ్మకం లేదు."

"ఇన్నేళ్ళూ ఎలా చదివారు?"

"అపుడు నమ్మకం ఉండేది. అదీకాక అపుడు..."

"అపుడు ఏమిటి?"

"అపుడు వదిన ఉండేది; ఆమె ప్రోత్సాహమూ ఉండేది. కాని, ఇపుడు..."

"ఇపుడు మీ అమ్మా, నాన్నా, అన్నయ్యా, నేనూ, మీ మిత్రులూ ఇంత మంది ప్రోత్సాహాన్నివ్వగలం, ఏదో ఒక దౌర్బల్యానికి లోనయి జీవితాన్నే బలిచేయటం న్యాయంకాదు. ఇంకా ముందు ముందు మీరు ఎంత గొప్పవారు అవాలని ఉందో, ఎవరికి తెలుసు? మీబుద్ధి, మేధాశక్తి, జీవితం అంతా వ్యర్థం చేసుకుంటారా? మీ వదిన ఆత్మకైనా శాంతిని కలుగనీయరా? ఇలాంటి ఆత్మవంచనను నేను ఒప్పుకోను..."

అరచేతులతో కణతలను నొక్కిపట్టుకుంది రత్న.

"చాలా నొప్పిగా ఉందా?"

"ఊఁ."

రమేశ్ కి ఆమె తలను తన చేతుల్లోకి తీసుకుని కొట్టు కుంటున్న నరాలను మృదువుగా నిమురాలనిపించింది. సహృదయుడైన డాక్టరుకు సహజంగా కలిగే ప్రతిక్రియ అతని భావన.

"నేను రేపు ఊరికి వెడతాను."

"మీరు ఊరికి వెళ్ళినంతమాత్రాన నా తలనొప్పి తగ్గిపోదు. అయినా మీరు ఎలా వెడతారో చూస్తాను. మిమ్మల్ని గదిలో పెట్టి తాళం వేసేస్తాను."

"రండి, వెడదాం"—రమేష్ లేచి నిల్చున్నాడు.

"ఇంటికేనా?"

"ఉహుఁ. ఇక్కడే సారిడాన్ దొరుకుతుందేమో చూస్తాను."

"నేనిక్కడే ఉంటాను. మీరు వెళ్ళి తీసుకురండి."

రమేష్ రెండడుగులు వేసి, మళ్ళీ వెనక్కి వచ్చి "చీకటిపడింది. ఒక్కరే ఉంటారా? భయం వెయ్యదూ?" అన్నాడు.

"ఇంతమంది ఉండగా భయమేమిటి?"

రమేష్ వెళ్ళిపోయాడు.

రత్న చీకటిలోనే కూర్చుని సముద్రాన్నే చూస్తోంది.

పసిపిల్లవాడి స్వభావంగల రమేశ్ ఆమెను ఆకర్షించాడు. పరిచయమైన కొద్ది రోజుల్లోనే ఏర్పడిన ఈ ఆత్మీయత ఆమెను ఆకర్షించింది. నిష్కపటమైన అతడి మొహంలో చోటు చేసుకున్న అసహాయతను చూసినపుడల్లా ఆమెకు అతడిని రక్షిం

చాలి— దేనినుండి, ఎవరినుండి అనేమాటే లేక—అన్న మనో భావం పెరిగింది.

రత్నను ఆకర్షించింది అతనిలోని ముగ్ధత. కల్లాకపట మెరుగని, తనకు తోచిన దానిని సూటిగా అనే అతడి మన స్తత్వం ఆమెకు నచ్చింది. అతడి స్వభావ పరిచయం కాగానే, అతడికి అతని వదినతో ఉన్న బాంధవ్యపు తీరును ఆమె ఊహిం చుకోగలిగింది. కాని అతడి మనసును నొప్పించటం ఇష్టంలేక శాంత పేరుకూడా ఎత్తేది కాదామె.

భావుకత అంటే రత్నకు తిరస్కారం. కాని ఇపుడు అదే భావుకతకు చెందిన ఓ నిష్పూరవ్య తన హృదయంలో రగులొకం టున్నదని తెలిసి రత్న కంగారు పడింది.

చీకటిలో సముద్రం కలిసిపోయింది. మృదువుగా శరీరా నికి తగిలే గాలి, సముద్రుడి ఘోష తప్ప మరేమీ తెలియటం లేదు.

సముద్రంపైనుండి తేలివచ్చే చల్లటి గాలిలో సముద్రపు హోరును వింటూ స్వప్నలోకంలో తేలిపోయింది రత్న. ఆమె కపుడు వర్తమానం తప్ప భూత భవిష్యత్కాలాల జ్ఞాపకాలే లేవు.

మళ్ళీ రమేష్ వచ్చి కూర్చున్నపుడే రత్న మేలుకుంది.

"మీరు కూర్చున్నచోటే మరిచిపోయాను. ఒంటరిగా తెల్లచీరెలు కట్టుకుని కూర్చున్న ఆడపిల్లలందరి దగ్గరకూ వెళ్ళి చూశాను. వాళ్ళేమనుకున్నారో ఏమో!"

"ఇంత తొందరగా నేనున్నచోటు మర్చిపోయారా?"

"మాత్ర తెచ్చాను" అంటూ, రమేశ్ సారిడాన్ రత్న చేతికిచ్చాడు.

"ఎలా తీసుకోను?"

"నోట్లో వేసుకుని మింగేయండి."

"నీళ్ళో?"

"ఓహో, మరచిపోయాను. రండి; ఇక్కడే ఏదైనా హోటలుకు వెళ్ళి కాఫీ తీసుకుందాం."

రత్న లేచింది.

రమేష్ మొండిగా: "ఈ మాత్ర తెచ్చానని నేను డాక్టరవబోను మీరు అలా అనుకున్నారంటే పొరపాటే."

చౌపతి ఇసుకలో నడిచి రోడ్డుపైకి వచ్చారు? అక్కడ నుండి నడిచివెళ్ళి మెరిన్ డ్రైవ్ దాటి హోటల్‌కివెళ్ళారు.

హోటల్లో 'చా' కోసం కాచుకుని కూర్చున్నపుడు రత్న అడిగింది.

"మీకు నేనంటే ద్వేషమా?"

"ఛా, అలా అని ఎవరన్నారు? అలా ఎందుకనుకుంటు న్నారు?"

"మరి నామీద కసితీర్చుకుంటున్నట్టు నేను డాక్టరవను అంటారెందుకు? తన ముక్కుకోసుకుని అందరికీచూపేమూర్ఖు డిలా మాట్లాడుతున్నారు. మీరు డాక్టరుకాకపోతే, మిగతా వారికి నష్టమేమీలేదు. మీకే అపారనష్టం."

"నా లాభనష్టాల విషయం నాకు చెందింది."

"అలాగే అనుకోండి డాక్టర్ కానక్కర్లా. మరేం చేసారు?"

"ఇలాగే ఉంటాను."

"అంటే మీ అన్నయ్య, తండ్రి వీళ్ళమీద ఆధారపడి జీవిస్తారన్న మాట."

రమేశ్ కాస్త ఆలోచించి చెప్పాడు: ఉహుఁ; ఏదైనా ఆశ్రమంలో చేరిపోతాను. సన్యాసిగా బ్రతుకుతాను.''

రత్న చిరునవ్వు నవ్వి: "సన్యాసమా! అది మీలాంటి వారికి కాదు'' అంది.

రమేశ్ ఇక సహనాన్ని కోల్పోయాడు. గట్టిగా:

"ఏం? నాకంత సమయమం లేదనుకున్నారా? నేను తల్చుకుంటే ఏదైనా చెయ్యగలను."

"మీ ఆత్మవిశ్వాసాన్ని చూసి నాకు చాలా సంతోషంగా ఉంది. అదే ఆత్మవిశ్వాసంతోనే చదువు పూర్తిచేయండి. మనిషికి వైరాగ్యమూ కావాలి. నిజమే; నేనూ ఒప్పుకుంటాను కాని, మీ మనసు వైరాగ్యపు దారి తొక్కడానికి అనువైనది కాదు."

రమేశ్ టేబుల్‌మీదకు వంగి, రత్న కళ్ళలోకిచూస్తూ:

"నా జీవితం విషయంలో తమరెందుకింత శ్రద్ధ తీసుకుంటున్నారో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

రత్న కళ్ళు దించుకుంది. మెల్లిగా:

"అది నా స్వభావం" అంది.

"నే నొప్పుకోను. నా మొహంచూసి చెప్పండి. నా విషయంలో మీ కెందుకింత శ్రద్ధ?"

"నిజం చెప్పమన్నారా ?"

"ఊఁ. చెప్పండి."

"మీ రంటే నా కున్న ఆసక్తి వల్ల"

"ఆసక్తి ఎందుకు ?"

"మీరంటే నాకు అభిమానం ఉంది; స్నేహమూ ఉందీ."

రమేష్ జీవితంలో ఎన్నడూ అనుభవించని అపూర్వమైన ఆనందాన్ని అనుభవించాడు. అతడి గుండె కొట్టుకోడం అతడికే వినిపించింది. నుదుటిమీద స్వేదబిందువులు నిలిచాయి.

"నా తలనొప్పికోసం మీరెందుకంత ఆరాట పడ్డారో చెప్పగలరా ? మీ వేదాంతరీత్యా 'ఆమె కర్మ ఆమె అనుభవిస్తుంది' అని ఊరుకోలేదేం ?" రత్న ఎదురుప్రశ్న వేసింది.

"మీరు బాధపడుతూంటే నేను చూడలేను."

# 8

'మీ కర్మ సిద్ధాంతానికి మీరిచ్చే విలువ ఇంతేనన్న మాట.

"మీ ఒక్కరికి మాత్రం ఆ సిద్ధాంతం అన్వయించదు.

"ఏం ?"

"మీ మీదున్న అభిమానమే దానికి కారణం.

చేతిలో చేయి వేసుకుని లోపలకు వచ్చిన పార్సీ దంపతుల వైపు చూస్తూ రత్న "వెడదాం" అంది.

రమేశ్ యాంత్రికంగా బయలుదేరాడు.

ఈ విధమైన నివేదనవల్ల తాత్కాలికంగా హృదయం తేలికపడినట్టనిపించినా భవిష్యత్తులో ఎదుర్కొనవలసిన మనో విప్లవం రత్నను భయపెట్టింది.

రమేశ్ ఎన్నిరోజులని తను ఇంట్లో ఉండగలడు? ఈ రోజు కాకపోతే రేపు, ఎప్పుడో ఒకప్పుడు, అతడు వెళ్ళవలసిన వాడే కదా! ఎప్పటి విషయమో ఇప్పటినుండి ఆలోచించి మనస్సు పాడుచేసుకోవటం ఎందుకని రత్న అనుకున్నా, ఆరోజు తెచ్చిపెట్టేవ్యథ భయంకర స్వరూపందాల్చి ఆమెను బెదరించింది.

రమేశ్ ఏం ఆలోచిస్తున్నాడోనని అతడి వైపుచూసింది.

రత్నలా రమేష్‌కి తన అంతరంగాన్ని ఎదురించవలసిన అవసరమే లేదు. అతని హృదయం బంధన రహితమైనది.

ఆ విధమైన సంఘర్షణనుండి అతడైనా తప్పించుకున్నందుకు రత్న మనస్సు సమాధాన పడింది.

అంతరాత్మలో యుద్ధంచేస్తూ పరధ్యానంగా నడుస్తున్న రత్నను రెండుమార్లు రమేశ్ హెచ్చరించాడు. ఇంకోమారు పక్కనవస్తున్న కారును చూసుకోకుండా రోడ్డు దాటబోతున్న రత్న భుజం పట్టుకుని నిలిపి, మెల్లిగా గద్దించాడు.

"ఇది మైసూరుకాదు రత్నా, బొంబాయి."

రత్న తేరుకుని "ఏమిటి?" అంది.

"ఇన్నిరోజులూ మీరు నాకు ట్రాఫిక్ గురించి హెచ్చ చేసేవారే ఈరోజు నేను మిమ్మల్ని హెచ్చరించాల్సి వస్తోంది."

"కాలుకింద పడి చావాలని నా నొసట రాసిఉంటే, ఎవరేం చెయ్యగలరు?"

తను అన్నమాటతోనే తన్ను మాటిమాటికి దెప్పుతున్న రత్నపైన రమేష్‌కి బాగా కోపంవచ్చింది. అప్పటిదాకా తన చేతిలో ఉన్న రత్న చేతిపట్టును మరింత బిగించాడు.

"ఇహ జాగ్రత్తగా నడుస్తాను" అంటూ చెయ్యి విడిపించుకుంది రత్న.

దోవలో నడుస్తున్న ఓ చిన్న పిల్లను చూడగానే రత్నకు ఇంట్లోఉన్న ఆశ గుర్తుకొచ్చింది. దాంతో అడుగులు కూడా వేగంగా పడసాగాయ్.

రమేశునితో స్నేహమూ, ఆత్మీయతా బలపడినట్లు అనిపించగానే, రత్న అతనినుండి దూరమవాలని ప్రయత్నించింది. అతడి స్నేహాన్ని ఆమె కోరుతున్నా, కేవలం స్నేహంతోనే తృప్తి పొందక ఇంకా ఏదైనా కావాలని కోరుకునే తన మనస్సును మొదటినుండి తన అధీనంలో ఉంచుకోవటమే ఇద్దరికీ మంచిదని ఆమెకు అనిపించింది.

జీవితంలో అంత ఎక్కువ పరిచయంలేని రమేశ్, భవిష్యత్తుని గురించి అంతగా ఆలోచించేవాడేకాదు. రత్న స్నేహసౌజన్యాలు తనకు దక్కాయి. అది అతని మనో మందిరపు మొదటిమెట్టు. అక్కడ అడుగుపెట్టిన అతడి కోర్కె ఆమె

స్నేహ విశ్వాసాలను ఎప్పటికీ తనవిగా చేసుకోవాలనే వరకూ పోయింది.

రత్న స్నేహ విశ్వాశాలు ఇప్పటికేమో అతనివే కాని, అవి తనొక్కడికే కావాలనే ఆకాంక్ష అతడిలో చెలరేగింది. దానిని సాధించలేని తన జీవితమే వ్యర్థ మనిపించిం దతనికి.

పైకి ఎక్కిన కొలది అగాధంలోకి పడిపోతానన్న ఊహే కలగలే దతనికి.

శేషగిరి ఇంటిలో రెండు రోజులుండి వెళ్ళిపోవలసిన అతిథి తను. కాని, ఏ విషయాన్నీ ఆలోచించలేని అతడి ముగ్ధ మనసు, ఇంకొక మనసనే గాలంలో చిక్కుకున్నప్పుడు భవిష్యత్తును గురించి ఆలోచించాలన్న ప్రయత్నమే చేయలేదు.

కాని, పగలూ రాత్రి ఇదే ఆలోచనతో కొలిమిలోని ఇనుములా కాలిపోతుంది రత్న. తనకు భర్తనుండి ఏవిధమైన రక్షణ కాని. సాంత్వనం కాని దొరకదని రత్నకు బాగా తెలుసు. ఆమెకు ఆసరా ఆశ ఒక్కటే.

కాని, తన విషయాలకన్నా రమేశుడిని గురించిన బెంగే ఎక్కువగా ఉంది రత్నకు. అతడు అసలే దెబ్బతిన్నవాడు. చిన్నప్పటినుండి ఎంతో గారాబంగా పెరిగిన అతడికి అనుకోకుండా తగిలిన వదిన చావు దెబ్బతో అంతవరకూ ఉన్న శాంతి సౌఖ్యాలను కోల్పోయి జీవితంలోనే ఏ ఆసక్తి లేకుండాపోయింది.

మునుపటిలా జీవితంలో ఆసక్తి కలిగించాలనే ఆశతోనే పెద్దవాళ్ళు అతడిని బొంబాయి పంపారు.

వారి ఆశలు ఫలించేటట్లే ఉన్నాయి.

రమేష్ ఇప్పుడిప్పుడే జీవితంలో ఆసక్తిని కనబరుస్తున్నాడు. కాని, ఈ ఆసక్తి పరిణామంవైపు అతని దృష్టి పోనే లేదు.

తెల్లవారాక నయినా స్వప్నానుంచి మేల్కొనక తప్పదుకదా !

అలా అని రమేష్ విషయంలో ఉదాసీనంగా ఉండ లేకపోయింది రత్న. దీనికి మారుగా అతడిమీద ప్రేమ, కరుణ, విశ్వాసాలు రెండింత లయ్యాయి.

ఒక శుక్రవారం రత్న :

"ఈరోజు మహాలక్ష్మి దేవాలయానికి వెడదాం" అంది.

"నాకు దేవుడంటే భక్తిలేదు."

"దేవుడుకాదు దేవత" అంటూ సరిదిద్దింది రత్న.

దేవుడిమీద భక్తితో కాకపోయినా, రత్నతో వెళ్ళవచ్చునుకదా అని ఒప్పుకున్నాడు రమేశ్.

"ఆశా! గుడికి వెడదాం రా" అని పిల్చింది రత్న.

ఆటలో మునిగిపోయిన ఆశా రానంది.

ట్రాము, బస్సుల గద్దీనుండి దూరంగా ఉంది దేవాలయం, దేవాలయ ప్రాకారం దగ్గరకు రాగానే అక్కడ పూలు, అగరుబత్తులు, కొబ్బరికాయలు అమ్ముతున్న పిల్లలు వీళ్ళను పిలువసాగారు.

రమేశ్ ఒక పిల్లను చూపి "అక్కడ కొందాం" అన్నాడు.

రత్న పూజా సామగ్రి తీసుకొంది.

దేవాలయంలోకి వెళ్ళేముందు రత్న:

"మీరు ఆ అమ్మాయి దగ్గరే ఎందుకు కోనాలను కున్నారో తెలుసా?"

"చెప్పండి."

"ఆ అమ్మాయి మిగిలిన వారికన్నా అందంగా ఉంది. ఇప్పుడయినా ఒప్పుకుంటారా సౌందర్యం అందరినీ ఆకర్షి స్తుందని."

దేవాలయంలో పూజ చేయించుకుని బయటకు వచ్చా రిద్దరూ.

"దేవిని ఏం కోరుకున్నారు?" రమేశ్ అడిగాడు.

"సముద్రం దగ్గరకు వెడదాం. అక్కడ అంతా చెప్తా తాను" అంది రత్న.

దేవాలయం వెనుకభాగంలో రాళ్ళకు కొట్టుకుని హోరు పెడుతున్న సముద్రం దగ్గరకు వెళ్ళారిద్దరూ. ఎండిన ఆకుపచ్చ రంగుతోనున్న రాళ్ళమీద నడిచి కొంతదూరం వెళ్ళారు.

రత్న తొడుక్కున్న ఎత్తుమడమల జోళ్ళు పాచికట్టిన రాతిమీదికి అడుగు పెట్టగానే, జారి రత్న పడబోయింది. రమేశ్ ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

"వదలండి; ఇక జాగ్రత్తగా వస్తాను" రత్న విడిపించుకో బోయింది.

"మీరు పడి, కాళ్ళు విరక్కొట్టుకుంటే నాకేకదా చెడ్డ పేరు?" అన్నాడు రమేశ్.

"మీ కెందుకొస్తుంది చెడ్డపేరు?"

"మీరు నాకోసమే ఇలా వస్తున్నారు. నావల్ల మీకు కష్టం కలగరాదు."

రత్న ఒక్క నిముషం ఆగి,

"మనస్సు భగ్నమయ్యేటందుకన్నా గాళ్ళు విరగటమే మంచిది" అంది.

రమేష్ తన చేతిపట్టు వదల్లేదు. రత్న మాటలు తనకు వినిపించనట్టే నటించాడు. ఇద్దరూ నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళి నీళ్ళ మధ్యలోవున్న ఓ రాతిపైన కూర్చున్నారు. సముద్రపు నీరు రాతికి కొట్టుకొని మళ్ళీ తొందరగా వెనక్కి వెళ్ళిపోతోంది.

వాళ్ళలాగానే మరింకెంతోమంది అక్కడ రాళ్ళపైన కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్నారు.

వాతావరణం అకస్మాత్తుగా గంభీరంగా మారిపోయినట్టు అనిపించింది రమేశ్‌కు:

"దేవిని ఏం కోరుకున్నారు?" అని అడిగాడు.

ఇసుకలో తలదూర్చి వాస్తవికత నుండి పారిపోవాలను కొనే నిప్పుకోడి బుద్ధిలాంటిది రమేష్‌ది.

"అది నా రహస్యం; మీకెందుకూ?"

"నాకు చెప్పరానిదా ?"

"అలాఅని కాదుగాని, మీరు అపార్థం చేసుకోరుకదా?"

"చేసుకోను; చెప్పండి."

"రమేషకి మంచిబుద్ధిని ప్రసాదించు తల్లీ!" అని వేడుకున్నాను."

రమేశ్ కోపంతో అలిగి దూరంగా జరిగి కూర్చు న్నాడు.

"నాలో అంత చెడ్డబుద్ధి మీకేం కనిపించింది?" రమేష్ అడిగాడు.

"ఈ సముద్రం ఎంత విశాలంగా ఉందో, మీ చెడ్డ బుద్ధి కూడా అంతే విశాలంగా ఉంది."

రమేష్, అ_స్తమిస్తున్న సూర్యుడివంక చూస్తూ:

"నాలో కొంచెం కూడా మంచిబుద్ధి లేదంటారా?" అని అడిగాడు.

"ఉహుఁ... లేదు."

"పోనీ ఆ చెడ్డబుద్ధు లేమిటో చెప్పండి. కనీసం సరిదిద్దు కోవటానికి ప్రయత్నిస్తాను."

"చెప్పనా... మొదటిది..." అంటూ, రత్న వేళ్లు మడిచి చెప్పసాగింది.

"మీది అతి సున్నిత హృదయం. ఇంత మృదు హృద యమైతే జీవితంలో మనకు తగిలే దెబ్బలకు తట్టుకోలేం. మన మనసు—ఇదిగో ఈ రాయిలాఉండాలి. అలలు ఎంత జోరుగా కొట్టుకున్నా ఈరాయి పగిలిపోదు."

"సరే, రెండోది" ఉత్సాహంగా అడిగాడు రమేష్.

"మీరు అందర్ని చాలా తొందరగా నమ్మేస్తారు. కొంచెం మంచిగా మాట్లాడినంతమాత్రాన ఎవరినైనా మంచి వాళ్ళనుకోవడం పొరబాటు. కొసనాలికనుండి వచ్చే పలుకులను హృదయాంతరాళంలో నుండి వచ్చాయని భావించటం మంచిదికాదు."

"సరే. మూడవది?"

"మీరు చాలా సెంటిమెంటల్. మనిషికి భావుకతా కావాలి. కాని, జీవితంలో అదే ప్రధాన పాత్ర వహించరాదు. ఆఖరిది: మీరు వదలిపెట్టాలనుకుంటున్న వైద్యవృత్తిని మళ్ళీ స్వీకరించాలని నాకోరిక. మొదటి మూడు లోపాలను క్షమించినా ఈ ఆఖరిదాన్ని మాత్రం మన్నించడానికి వీల్లేదు."

రమేష్ బదులు పలకలేదు. అతడి మౌనంతో కలవరపడి, రత్న అతడి వైపుకు చూసింది. రమేష్ మొహం చిన్నబోయింది. గాలికి అతడి ముంగురులు ఎగిరి అతడి నుదుటి మీదికి పడుతున్నాయి.

వాత్సల్యంతో రత్నహృదయం పొంగి పొరలింది. అతడి, నుదుటి మీదకుపడ్డ జుట్టును వెనక్కు-తోసి. అతడి చేతిని తన చేతిలోకి తీసుకోవాలనిపించింది.

కాని, ఎలాంటి సమయంలోనయినా తన మనస్సును తన అధీనంలో ఉంచుకోగలశక్తి ఉంది ఆమెకు.

"రమేశ్..."

"ఏమిటి?"

"నేను చెప్పింది నిజంకాదా?"

"కొంచెం మాత్రమే నిజం. కాని, అందరి విషయంలోనూ నేను ఇలాగే ఉంటాననుకోకండి. మీ విషయంలో మాత్రం నాహృదయం దుర్బలంగా ఉంది."

"అది చాలా తప్పు."

"ఎందుకు?"

"ఎందుకో మీకు తెలియదా?...... మీ రనుకుంటున్నంత మంచిదాన్ని కాను నేను. నా ప్రవర్తనా, మాటా అంతా నటన..."

"రత్నా!"

రత్న మాట్లాడకుండా కూర్చుంది.

"నన్నెందు కిలా బాధపెడుతున్నారు? మీరు ఎలాంటి వారైనా సరే; నామట్టుకు నాకు సరిగ్గానే ఉన్నారు. నాకింత బుద్ధి చెబుతున్నారే... ఊఁ... ఏం లేదులెండి."

"ఏమిటో చెప్పండి."

"మీకు తెలీదా? నేను చేసిన తప్పునే అది తప్పని మీరు అనుకుంటున్నట్టయితే మీరు చేయటం మంచిదే నంటారా?"

ఎదురు—ప్రశ్న వేశాడు రమేష్.

"నాదంతా ఒట్టి నటన అని చెప్పానుకదా! కాలేజీలో చదివేటప్పుడు 'మంచి నటి' అని నాకు పేరుండేది. ఒకవేళ నేను నటించడంలేదని మీరు అనుకున్నా, జీవితంలో నాకున్న అనుభవంలో నూరోవంతుకూడా మీకు లేదు. నేను జీవితం నుండి ఏమీ ఆశించను. ఎంతటి వ్యథ, నిరాశ ఎదురయినా, ఎదిరించగల ధైర్యం నాకుంది. ఆ దృష్టితో చూస్తే, మీరింకా ఓ పసిపాపాయి అనే చెప్పవచ్చును. ఒక చిన్న ఎదురుదెబ్బనుకూడా తట్టుకోలేరు. నా సంగతలా ఉంచండి; మిమ్మల్ని గురించే నా బెంగంతాను."

మాయానగరపు ముఖద్వారంలాఉన్న మబ్బుల వెనుక సూర్యుడు అస్తమిస్తున్నాడు. సూర్యుని అరుణకాంతిని అప్పు

తెచ్చుకుని, మబ్బులు బంగారు రంగును పులుముకున్నాయి. ఆకాసపు టంచులో సూర్యుడు శక్తిహీనుడిలా క్షణక్షణానికి క్రుంగిపోతున్నాడు. అతడి అస్తమయంతో, సూర్యుని మాయా దండంతో నిర్మించిన మాయానగరం క్షణమాత్రంలో నల్లరంగు పూసుకుని శత్రువులు లూటీచేసి వెళ్ళిపోయిన రాజధానిలా కళాహీనమయింది.

రమేశ్ హృదయం వ్యథతో బరువెక్కింది. రత్నవైపు చూశాడు. చీకటిలో ఆమె మొహం కనిపించటంలేదు. ఆమె చెవులకున్న దుద్దులు మాత్రం మెరుస్తున్నాయ్.

"జీవితాన్ని అనుసరించి నేను వెళ్ళగలను. ఎలాంటి విషమ పరిస్థితిలోనైనా చిరునవ్వు నవ్వగలను. కాని మిమ్మల్ని గురించిన బెంగ నన్ను వేధిస్తోంది."

రమేష్ దారితప్పిన పసివాడిలా "అయితే నన్నేం చెయ్యమంటారు చెప్పండి. మీరు చెప్పినట్టు నేను వింటాను" అన్నాడు.

"నిజంగానా ?"

"ఊఁ."

"అయితే ఆలోచించి చెపుతాను. ఇంటికి వెడదాం పదండి."

రమేశ్ లేచాడు. లేచి నించున్న రత్నకాళ్లు ఎగుడు దిగుడుగా ఉన్న రాతిమీద నడవటానికి మొండికేస్తున్నాయి.

"నేను పట్టుకోనా ?"

"వద్దు."

"పడితే మరీ కష్టం. ఈ విషయంలో మీ మాటను అతిక్రమిస్తున్నాను" అంటూ ఆమె చేతిని పట్టుకున్నాడు రమేష్.

"వద్దు, వద్దు, వదిలేయండి."

"నేను అస్పృశ్యుడినా? నేను పట్టుకుంటే మీరు అపవిత్రు లవుతారా?"

"ఛ! ఏమిటా మాటలు? మీ చెయ్యి మురికవుతుందేమోనని......"

"అయితే మీ రింకేం బాధపడకండి" అన్నాడు రమేష్.

ఒకటి రెండు రాళ్ళనుదాటాక, రమేశ్ ఆమెకు దగ్గరగా జరిగి రత్నను తనకు మరింత దగ్గరగా లాక్కున్నాడు. నడుస్తున్న రత్న చటుక్కున ఆగి పోయింది.

"రమేశ్ నన్ను పరీక్షించకండి. క్షణక్షణానికి నన్ను ఆశ పెట్టకండి. నేను మానవ మాత్రురాలిని; దుర్బలురాలిని."

మునిగిపోతున్న వారి ఆర్తనాదంలా ఉంది రత్న కంఠస్వరం.

"లేదు రత్నా! నేను మిమ్మల్ని పరీక్షించటం లేదు. ఎలాంటి అగ్నిపరీక్షలో నైనా గెలుపు నీదే: కాని నా కొక మధుర స్మృతి కావాలి."

"మధుర స్మృతా! నా స్నేహమే మీకో పీడకలగా ఉన్నప్పుడు మధురస్మృతి ఎక్కడిది రమేష్!"

"మన భావనలోనే ఉంది అంతా."

"సముద్రతీరం నిర్జనమైన మరుభూమిలాఉంది. చీకటి పడటంవల్ల చాలామంది సముద్రతీరాన్నుండి వెలుగువైపుకు వెళ్ళిపోయారు.

రమేష్, రత్న మొహాన్ని తన రెండు చేతులతోనూ పైకెత్తి పట్టుకొని వణుకుతున్న తన పెదవులతో, ఆమె చల్లటి పెదవులను చుంబించాడు.

అతని ప్రేమ సముద్రానికి ఆకాశంలోని అసంఖ్యాక తారలు అగాధమైన జలరాశి సాక్షీభూతాలుగా నిలిచాయి.

రత్న ప్రతిమలా అతని చేతులలో ఉండిపోయింది. ఎన్నో రోజులుగా నీళ్ళు లేక, దప్పిగొన్న ఎడారిప్రయాణికుడు నీళ్ళను చూడగానే తనివితీరా జలపానం చేసినట్టు రమేష్, రత్నప్రేమామృతాన్ని పానంచేశాడు.

అల్లరిచేస్తున్న పిల్లాడిని సముదాయించి నట్టుగా అతడి తల నిమిరింది రత్న.

"రత్నా !"

"ఏమిటి ?"

"నామీద కోపమా ?"

"లేదు!"

"అయితే మాట్లాడరేం ?"

"మీరెక్కడ అవకాశమిచ్చారు నాకు ?"

"మీకు కోపం వచ్చింది. కావాలంటే ఫెడీల్మనికొట్టండి. మీరేం శిక్ష విధించినా అనుభవిస్తాను. కాని, నామీద కోపగించుకోకండి" అంటూ రమేశ్; ఆమె చేతిని తనచెంపలమీదుంచుకొన్నాడు.

రత్న అతని చెంపలను మృదువుగా నిమిరి తన చేతి రుమాల అతడి పెదవులను తుడిచింది.

"నా పెదవు లెందుకు తుడిచారు ?"

రత్న బదులు పలకలేదు. అదే రుమాలుని తన నోటికి అడ్డు పెట్టుకుని పొంగివస్తున్న ఏడుపు నాపుకుంది.

వెలుగులోకి రాగానే, రత్న బుగ్గలమీద ప్రవహిస్తున్న కన్నీటి ధారలను చూసి చకితుడయ్యాడు రమేశ్.

"రత్నా !"

"ఏమిటి ?" రత్న ధ్వని మాత్రం శాంతంగానుంది.

"మీరు నా తల పగులగొట్టినా సరే, కాని ఏడిస్తే మాత్రం నేను సహించలేను. నా ప్రవర్తనతో మిమ్మల్ని నొప్పించిఉంటే చెప్పండి. రేపే ఊరికి వెళ్ళిపోతాను."

"అలాగే, కాని మీరు పెదవులపై ముద్రించిన ఈ అమూల్యమైన ముద్రను ఏం చేయను ?"

"నాకే తిరిగి ఇచ్చివేయండి."

"ఉహుఁ. మీకివ్వను."

"అయితే ఏం చేస్తారు ?"

"నాలోనే దాచుకుంటాను. ఒక్కొక్కప్పుడు, జీవితం శూన్యంగా అనిపించినపుడు అద్దంముందు నిల్చుని మీ ముఖం చూసుకుని జీవితంలో ఉత్సాహం తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తాను."

రమేశ్ మౌనంగా తన చేతిలోని ఆమె చేతిని నొక్కాడు.

వాళ్లు ఇల్లుచేరేసరికి ఎప్పటికన్నా కాస్త పొద్దుపోయింది అంత రద్దీగా ఉన్న బొంబాయిలోకూడా తనదే అయిన ఒక ప్రత్యేక మయిన లోకాన్ని నిర్మించుకుని విహరించివచ్చారు వాళ్ళిద్దరు.

ఇంటికి రాగానే, తన మరాఠ స్నేహితురాలింట్లో కూర్చున్న ఆశను తీసుకొచ్చింది లక్ష్మి.

రమేశ్ వచ్చినప్పటినుంచీ లక్ష్మి సహవాసమే అపురూప మయింది ఆశకు. శేషగిరి ప్రొద్దుటే వెళ్ళితే, మధ్యాహ్నం భోజనానికి వస్తే వచ్చేవాడు లేకపోతే లేదు. మళ్ళీ రాత్రి పది గంటల తర్వాతగాని, వచ్చేవాడు కాదు.

దీనితో ఆశకు తండ్రితో ఎక్కువ స్నేహమే లేక పోయింది. తల్లి వడిలోనే పెరిగిన ఆశకు రమేశ్ రాకతో అదీ దుర్లభ మయింది.

తల్లిని తననుండి దూరం చేస్తున్న మనుష్యుడంటే ఆశకు కోపంగా ఉంది:

"ఎక్కడికి కెళ్ళావమ్మా?" ఆశ అడిగింది.

"దేవాలయానికి."

"ఇంతసేపయిందేం?"

"బస్సుదొరకలేదమ్మా."

తన ప్రతిస్పర్థిని చూసినట్టుగా రమేష్ వైపు చూసింది ఆశ. "నువ్వింత ఆలస్యంచేస్తే. నాకు విసుగ్గా వుంటుందమ్మా" అంది ఆశ.

"ఇకమీదట త్వరగా వస్తాను" అని లక్ష్మి భరోసా ఇచ్చింది కూతురికి.

ఆశ కన్నుల్లోని ఆక్షేపణను ఎదురించలేక అటుతిరిగాడు రమేష్.

నిజమే! ఇంతకూ తనెవరు? వాళ్ళింట్లో కొద్దిరోజుల పాటు ఉండే పాత గాయాలు మరిచి పోవటానికి వచ్చినవాడు

తను. రత్న మధుర స్నేహంలో తన పాతగాయాన్ని మరిచి పోయినా పోవచ్చు కాని, దాని స్థానంలో కొత్తగాయం కాకుండా మానదు.

భవిష్యత్తులోకి చాలా దూరం తొంగిచూసే ధైర్యం కలగలేదు రమేష్‌కి. కళ్లుమూసుకుని కుర్చీలో వెనక్కి పరి గాడు.

రాత్రి శేషగిరి వచ్చేసరికి పదిగంటలయింది. అతడు రాగానే, అందరి భోజనాలు అయ్యాయి. రమేశ్ అయిదు నిమి షాలు శేషగిరితో మాటాడి, తరువాత:

"నాకో నిద్ర మాత్ర ఇవ్వండి డాక్టర్" అన్నాడు.

"నిద్రపోవడానికి మాత్ర వేసుకోవలసిన వయస్సటయ్యా నీది" అంటూ నవ్వాడు శేషగిరి.

"దయచేసి ఇవ్వండి."

శేషగిరి ఇచ్చినమాత్ర మింగి నీళ్లు తాగి పక్కమీద పడుకున్నాడు రమేశ్.

అతడి కణతలు పగిలిపోతున్నాయి. తన గదికి కొంచెం దూరంలో వెడుతున్న ట్రామ్‌కిందపడి ప్రాణం వదిలేయాలన్న తీవ్రమైన కోర్కె కలిగిం దతనికి. నిప్పులో పడ్డ పురుగులా పడక మీదపడి దొర్లాడు.

"నిద్రయినా వస్తే!"

భవిష్యత్తు శూన్యంగా కనిపించిం దతనికి. ఎన్నోరకాల ఆలోచనలు సూదుల్లా గుచ్చుకుని బాధపెడుతున్నాయి.

బాధ, మంటతో మూగబాధ అనుభవిస్తూ నిద్ర పోయాడు.

"రత్నా" అని కలవరిస్తూ పక్కకు పొర్లాడు.

ఉదయం రమేష్ లేచేసరికి ఎనిమిది దాటింది. అతడు గదిలోనుంచి బయటకు వచ్చేసరికి రత్న ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతోంది.

ఆమె మొహం చూడగానే గతరాత్రి తాను అనుభవించిన బాధంతా మరిచిపోయి నవ్వాడు రమేష్.

"ఉదయం లేవగానే ఎవరితో మాట్లాడుతున్నావు? అంత పుణ్యం చేసుకున్న వాడెవరు?" అని అడిగాడు రమేష్.

"నా కజిన్ దాదర్‌లో వుంది. సాయంకాలం నాలుగింటికి ఇక్కడికి రమ్మని ఫోన్ చేశాను."

"ఓ"

"సాయంకాలం అందరం కలిసి మలబార్‌హిల్స్‌లోని కమలానెహ్రూ పార్కుకు వెడదాం."

నవ్వుతో వెలుగుతున్న రమేష్ మొహాన్ని క్షణమాత్రంలో నల్లటిమబ్బులు క్రమ్ముకున్నాయి.

"నా నుండి రక్షించుకుందామని ఆవిడను పిలిచారా?"

అతడి కంఠంలో ధ్వనించిన వ్యథను గమనించి వెంటనే రత్న:

"అలా అనుకోకండి. మిమ్మల్ని ఆమెకు పరిచయం చేద్దామనిపించి పిలిచాను. తను బి. ఏ. పాసయింది. బాగా పాడుతుంది...."

"ఇవేం పెళ్ళిచూపులు కావుకదా?"

రత్న అటుతిరిగి ఏదో వెతుకుతున్నట్టు నటిస్తూ 'కాదు' అంది.

రత్న కాఫీ తీసుకుని వచ్చేసరికి రమేశ్ కుర్చీలో మెదల కుండా కూర్చుని వున్నాడు.

రత్న కాఫీగ్లాసు అతడి ముందుంచి:

"తాగండి" అంది.

"అక్కర్లేదు."

"మంచి కుర్రాళ్ళు ఇలా మొండికెయ్యరు; నాకోసం తాగండి."

"నాకోసం మీరా రామెను పిలవకండి."

"నళినికి అంతా చెప్పి సాయంత్రం నాలుగింటికి రమ్మన్నాను. ఇప్పుడు ప్రోగ్రాం కాన్సిల్ చేయటానికి వీల్లేదు."

"అయితే ఈరోజు నే నెక్కడికీ రాను."

"రమేశ్ మిమ్మల్నేం చేయాలో తెలుసా?"

"చెప్పండి."

"Spanking అంటారు విన్నారా?"

"మీరు మాటల్లోనే Spank చేస్తున్నారు."

"మిమ్మల్ని పట్టుకుని బాగా తన్నాలనిపిస్తుంది. కాని చేతులు రావు" అంది రత్న ప్రేమగా.

"కొట్టడానికి బదులు తిడుతున్నారు. అంతేగా?"

రత్న కాఫీగ్లాసు పట్టుకుని అతడి ముందు:

"తీసుకోండి" అంది.

"ఉహుఁ."

"మీరు తాగకపోతే నేనే తాగించాల్సి ఉంటుంది."

రమేశ్ రత్న కళ్ళల్లో చూస్తూ "రత్నా! నేను అడిగింది తెచ్చి తాగిస్తారా?" అని అడిగాడు.

"ఓ, ఏంకావాలి? కాఫీ, టీ?"

"విషం ఇవ్వండి సంతోషంగా తాగుతాను."

స్విచ్ ఆఫ్ చేయగానే ఆరిపోయే దీపంలా రత్న మొహం లోని వెలుగు ఆరిపోయింది. దెబ్బతిన్న పక్షిలా అక్కడినుంచి వెళ్ళిపోయింది రత్న.

రమేశుకి తాను అన్న మాటలోని తీవ్రత అర్థమయింది. కాని, అతనికి ఆ క్షణంలో నిజంగానే ఆమె చేతినుంచి విషం తీసుకుని తాగాలనిపించింది.

బ్రతికేటానికి భయపడి మృత్యువును ఆహ్వానించటం!

ఎంత పిరికితనం!

కళావిహీనమైన రత్న మొహం అతనిని అక్కడ నిలవనీయలేదు. కాఫీగ్లాసు తీసుకొని వంటగదిలోకి వెళ్ళి, ఆమె ముందే కూర్చుని కాఫీ తాగాడు. రత్న మాట్లాడకుండా కూర్చుని కూర తరుగుతోంది.

"రత్నా! నామీద కోపమా?

"లేదు. మీ ఇష్టమొచ్చినట్టు మాట్లాడే స్వాతంత్ర్యం మీకుంది."

"విషం తాగినా, నేను చావను రత్నా."

రత్న తలెత్తి అతనివైపు చూసింది. ఆమె కళ్ళనిండా నీరు నిలిచింది.

"నిన్న రాత్రి నేను మహాలక్ష్మి దేవస్థానం వెనుక సముద్రతీరంలో అమృతపానం చేశాను. అమృతం తాగాక, విషం తాగినా చావను."

రత్న తల వంచుకుని నెమ్మదిగా అంది; "రమేష్! నేను

చాలా సామాన్యురాలిని. నాకు అంత వెల కట్టకండి. మీ రత్న అతి సామాన్యురాలు.

"ఎప్పటికీ కాదు; రత్న రత్నమే."

"కాదు. పేరు మాత్రమే రత్న. నేను వట్టి గాజు ముక్కను."

"రత్నమో. గాజో దానివెల, అదే నిర్ణయించదు. దాని వెలకట్టేవారు వేరే ఉంటారు."

"కావచ్చు. ఎవరైతే ఆ విషయాలలో ఎక్కువ అనుభవం కలిగి ఉంటారో, వాళ్ళే వెల కట్టగలరు. మీలాంటివారికి రత్నానికి, గాజుకూ తేడా ఏం తెలుస్తుంది ?"

"నాకు తెలుసు, నేను చెప్పగలను."

రత్న చిరునవ్వునవ్వి "పులుసులో ఉప్పెక్కువో, కారం ఎక్కువో చెప్పలేని మీరు, గాజు, వజ్రాల సంగతెందుకు మాట్లాడుతారు?'' అంది.

"రత్నా నేను మీ రనుకున్నంత మూర్ఖుడిని కాను."

"సరే అలాగే అనుకుందాం. ఇప్పుడు చెప్పండి మీ కెంతమంది స్త్రీలతో పరిచయం ఉంది? నాతో ఉన్నటువంటి స్నేహమే ఇంకెవరితో ఉందో చెప్పండి.''

ఆమె మాటల్లో ఇమిడివున్న అర్థాన్ని తెలుసుకోకుండానే రమేష్ "మీరు...అమ్మ...వదిన" అన్నాడు.

"అంతేనా ?"

"అవును. నా క్లాసులో కొంతమందితో పరిచయం ఉంది గాని, అది స్నేహమనిపించుకోదు."

“ఆ పనికిమాలిన మాట అటుంచండి. వాళ్ళిద్దర్నీ జాబితాలో నుంచి తీసేసే మిగిలేది నేనొక్కదాన్నే. నాలాంటి వాళ్ళు పదిమందిని పరిచయం చేసుకోండి, జనువుగా తెలుస్తుంది. అప్పుడు మీరా లిస్టులో ఎన్నో స్థాన మిస్తారు?

“ప్రథమ స్థానం.”

“నిజంగానా?”

“అవును.”

“దీన్నే మొండితనం అంటారు. సరేగాని, సాయంత్రం మట్టుకు నా మాట తీసెయ్యకండి” అంటూ బ్రతిమాలుకుంది రత్న.

సాయంకాలం నాలుగింటికి సరిగ్గా నళిని “రత్నా” అని పిలుస్తూ లోపలికి అడుగు పెట్టింది.

“ష్...” అని నోటిమీద వేలుంచుకుని అరవవద్దని హెచ్చరించి, వంటగదిలోనికి తీసుకొని వెళ్ళింది.

“ఏమిటే అంత అర్జంట్‌గా రమ్మన్నావ్ ?”

“మా యింటికి రమేశ్ అని ఒకరు వచ్చారు. ఎం. బి. బి. యస్. ఆఖరి సంవత్సరం చదువుతున్నారు. ఇంకా పెళ్ళి కాలేదు. అందగాడు” మాట నిలిపి నళినివైపు అర్థగర్భితంగా చూసింది రత్న.

నళినికి రత్న చెప్పబోతున్న దేమిటో తెలిసినా, తెలియనట్టుగానే.

“దానికి నన్నేం చేయమంటావ్?” అంది.

“దేవుడు నీకు అందం, తెలివి, యౌవనం విద్య అన్నీ ఇచ్చాడు. జీవితంలో అంతగా ఆసక్తిలేని ఈ అబ్బాయిని వీల

యితే వలపించుకో. ఈ పరీక్షలో నువ్వు గెలిస్తే రమేష్‌నే బహుమతిగా పొందుదువుగాని."

చెంచాతో గ్లాసును మోగిస్తూ రత్న మాటలు వింటోంది నళిని.

"ఏమంటావు?" రత్న అడిగింది.

"ముందు అతడిని చూడాలి నేను. తరువాత చెప్తాను. జీవితంలో అతడికి కలిగిన నిరాసక్తి ఎందుకో తెలుసా?"

"అప్పలాకరి మరణంతో జీవితంమీద విరక్తి కలిగింది."

"అప్పలంటే?" నళిని కంఠంలో ఆరాటం వ్యక్తమయింది.

"వారి వదిన."

"అంతేకదా" తేలిగ్గా నిట్టూర్చింది నళిని.

"రమేశ్ బంగారంలాంటి అబ్బాయి. నువ్వు రెండు రోజులు అతడితో కలిసి తిరిగి, వీలయితే నీవాడిగా చేసుకో.

"నా కెరియర్ (Career) గతేంకాను?"

"నీ కెరియర్ పాడుగాను. ఆడదానికి కేరియర్ ఏమిటి? భర్తతో కాపురం చేయటమే నీ కెరియర్."

"ఈరోజు ఎటువైపు వెడదామంటావ్?"

"కమల నెహ్రూ పార్కుకు వెడదామని చెప్పాను. కాని, నాలుగుంపావుకు కుముదని రమ్మని కబురుచేశాను. తను రావటంతో, నేను రాను. మీ రిద్దరూ వెడతారు. రేపటి ప్రోగ్రాం నువ్వే అతడితో చెప్పు."

"అతడిని చూశాక ఏ సంగతీ చెప్తాను" అంది నళిని.

రత్న నళినికి కాస్త దూరంగా జరిగి నిబ్బరం పరీక్షగా చూసింది.

నళిని పదిమందిలోఉన్నా ప్రత్యేకంగా కనిపించే అందగత్తె. రత్నకు పినతండ్రి కూతురు. ఆ సంవత్సరమే బి. ఏ. పాసయింది. ఒక స్కూలులో టీచరుగా పని చేస్తోంది. నళిని తల్లిదండ్రులు ఆమెకు పెళ్ళి చెయ్యాలని ఆరాటపడుతున్నారు గాని, మంచి సంబంధం దొరక్క ఊరుకున్నారు.

నళిని కళ్ళల్లో ఆనందం లాస్యం చేస్తోంది. అందమైన పెదవులమీద మందహాసం వెలుగుతోంది. చంచలతతో ఆమె కళ్ళు మిలమిలా మెరిసిపోతున్నాయి. పసిపాపల్లో ఉండే నిర్మలమైన దేహకాంతి ఆమె నడిచిన పరిసరాలకంతా వెలుగును విరజిమ్ముతోంది.

తన అందాన్ని కనిపించేలా అలంకరించుకునే నేర్పు ఉందామెకు.

రత్న ఆమెవైపు చూసి తృప్తిగా నిట్టూర్చింది.

నళిని చా తాగి లేచేటంతలో, రమేష్ లేచి వచ్చాడు.

రత్న ఇద్దర్నీ ఒకరి నొకరికి పరిచయం చేసింది.

“నమస్తే” అంది నళిని చేతులు జోడిస్తూ.

అప్పుడే నిద్రనుండి లేచి వచ్చిన రమేశ్ కళ్ళు ఎర్రగా ఉన్నాయి. నిద్రమత్తు వదలని మొహం పసిపిల్లాడి మొహంలా ఉంది. చెదిరిన ఉంగరాల జుట్టు నుదురునంతా కప్పేసింది.

"అందగాడు" అని మనసులోనే అనుకుంది నళిని.

పదిహేను నిమిషాల్లో బయటికి వెళ్ళటానికి సిద్ధమై నిల్చున్నాడు రమేశ్. రత్నకూడా వెళ్ళే సన్నాహంలోనే ఉంది కాని, ఆమె కళ్ళంతా వీధి తలుపువైపే ఉన్నాయి.

"కుముద ఇంకా రాలేదేం చెప్మా" అని మాటిమాటికీ ఆ తలుపువైపు చూస్తోంది రత్న. లేని పనిని వెతుక్కుంటూ కాలయాపన చెయ్యసాగింది. ఆఖరికి కుముద కనిపించేసరికి దేవుడి దర్శనమంత సంతోషమయింది రత్నకు. కుముదను పలకరించి కూర్చోబెట్టి, రమేష్‌తో:

"మీరు వెళ్ళిరండి. రాకరాక కుముద వచ్చింది. రేపు కావాలంటే అందరం వెడదాం" అంది.

రమేశ్‌కి ఏం చెయ్యాలో తోచలేదు. నళిని మౌనంగా రమేష్‌వైపొకసారి, రత్నవైపొకసారి చూసింది, ఆఖరికి:

"పోనీ, రేపే అందరం కలిసి వెడదాం" అంది.

రత్న ఒప్పుకోలేదు: "నావల్ల మీరు ఆగిపోవటం ఎందుకూ? మీరు వెళ్ళిరండి" అంది.

రమేశ్ ఏమనటానికి వీల్లేకపోయింది. మెడబట్టి గెంటించుకున్నవాడిలా నళినితో బయల్దేరాడు.

అంతవరకూ కుముద మాట్లాడకుండా కూర్చున్నది రత్న అదృష్టమే అనాలి. వాళ్ళు వెళ్ళిపోగానే, రత్న— వీపుమీద చిన్నగా కొట్టి, "ఏమిటే గొడవ" అంది.

"ఏం లేదే. నిన్ను చూద్దామనిపించింది రమ్మన్నాను" అంది రత్న.

కాని, తరువాత కబుర్లలో ఆసక్తిలేక రత్న పరధ్యానంగా ఉండటం కుముద గమనించింది.

నిజంగా తనను చూడాలని ఆత్రంతో పిలిపించిన రత్నేనా తను?

# 9

ఇప్పటికి వాళ్ళు మలబార్ హిల్స్ ఎక్కుతుంటారు. నళిని ఏం మాట్లాడుతోందో? ఏమైన మాట్లాడనీ. రమేశ్ మనస్సును నొప్పించకుండా ఉంటే, చాలు...

"ఏయ్ రత్నా! కలగంటున్నావా?" అని రెండు మూడు మార్లు హెచ్చరించింది కుముద.

రానురాను కుముద వెళ్ళిపోతే చాలు అనిపించింది రత్నకు. ఆమె మనస్సు అక్కడలేని రమేశ్ వెంట తిరుగుతోంది.

కుముద ఇంటికి వెడతానని లేచినపుడు రత్నకు హాయనిపించింది. కుముద వెళ్ళిపోతే తను నిరాటంకంగా రమేశ్ గురించి ఆలోచించవచ్చుగదూ!

కుముద వెళ్ళిపోయింది. ఏడింటికి ఇంటికి వచ్చిన ఆశా, తల్లి ఇంట్లో ఉండటం చూసి ఆశ్చర్యంతో కళ్లు పెద్దగా చేసుకుని:

"అమ్మా! ఇంట్లోనే ఉన్నావేం? మామయ్యతో వెళ్ళ లేదూ?" అంది.

"లేదమ్మా, నళిని వెళ్ళింది."

ఆశా తల్లిని వాటేసుకుని:

"ఇకమీదట నళినినే పంపమ్మా మామయ్యతో! నువ్వు వెళ్ళిపోతే నాకేం తోచదు" అంది.

కూతురు మాట రత్న హృదయాన్ని తాకి గాయ పరిచింది.

సుమారు ఎనిమిది ఆ ప్రాంతాలలో నళిని, రమేష్ ఇంటికి వచ్చారు. అంత తొందరగా వారు వచ్చేసినందుకు రత్న ఆశ్చర్యపడినా, రమేశ్‌ని చూడగానే ఆమెకు శాంతి లభిం చింది.

"ఏం ఇంత తొందరగా వచ్చేశారు?"

"పార్కు చూశాం, వచ్చేశాం" అంది నళిని ముక్త సరిగా.

"ఎలా ఉంది మా ఊరి పార్కు" రమేశ్‌ని అడిగింది రత్న.

"ఉద్యానవనాల సీమనుండి వచ్చినవారు ఆయన. మన ఊరి పార్కు అంతగా నచ్చినట్టు కనిపించలా" అంది నళిని.

తన గదిలోకి వెళ్ళిపోబోతున్న రమేష్‌ని రత్న ఆపి "రేపు ఎక్కడికి వెడదాం?" అని అడిగింది.

"అక్వేరియానికి వెళదామని చెప్పాను నేను. లేదా 'విహార్ లేక్'కు వెళ్ళినా వెళ్ళొచ్చు. రేపు ఆదివారం ఎలాగూ డాక్టర్‌కు తీరికే కదా. అందరం వెళదాం రత్నా!" అంది నళిని.

"అవునమ్మా. అందరం వెళదాం" అంది ఆశా.

"డాక్టర్ గారికి రాత్రికి ఏ విషయమూ ఫోన్ చేసి చెప్తాను" అంది రత్న.

ఇద్దరిమధ్యా మూగవాడిలా నిల్చున్న రమేష్.

"నేనలా తిరిగి వస్తాను"

"నేనూ వస్తాను మామయ్యా" అంటూ ఆశకూడా బయల్దేరింది.

ఇద్దరూ ఇంటికి దిగి వెళ్ళగానే, రత్న కలవరంతో నళిని వైపు తిరిగి.

"ఏమయింది నళినీ? పాసా, ఫేలా" అంది.

"ఇంత తొందరగా ఎలా చెప్పను? ఇపుడే ఏమీ చెప్ప లేను. చాలా మంచివారిలా కనుపిస్తున్నారు."

నళిని రమేష్‌ని మెచ్చుకోవటం రత్నకు ఎంతో ఆనందాన్నిచ్చింది.

"ఎక్కువ మాట్లాడేవారిలా కనిపించలేదు. ఎంతసేపూ నేను మాట్లాడించాలే కాని, అతనయి అతనే నన్ను పలకరించలా, మొత్తంమీద కుతూహలం, ఆసక్తి కలిగించే వ్యక్తిత్వం అతడిది."

"అయితే అతడిని వలపించుకోవటానికి ప్రయత్నిస్తావా? రత్న ఆత్రుతతో అడిగింది.

"ఇప్పుడే ఏమీ చెప్పలేను. నా ప్రయత్నం అంత తొందరగా మానుకోలేనంత అందగాడతను."

"ఆయనతో ఏం మాట్లాడావ్ ?"

"నా కాలేజి సంగతులూ, ఇపుడు నేను టీచర్‌గా పని చేస్తున్న స్కూలు విషయాలూ, బొంబాయి జీవితం...ఇవే, కాని మా సంభాషణలో ఎక్కువపాత్ర నాదే."

రత్న మెల్లిగా 'రమేశ్ ఒక్కసారైనా నీ వైపు మెచ్చుకుంటున్నట్టు చూశాడా ?" అని అడిగింది.

ఈ విషయంలో మట్టుకు నళినికి అసంతృప్తిగా ఉంది. బొంబాయి నాగరిక వాతావరణంలో పెరిగి… గడుసుపిల్ల నళిని. ఎంత మందిలోఉన్నా కనుపించే లావణ్యవతి.

రమేశ్ ఔదాసీన్యం ఆమె సౌందర్యాన్నే అసమాన పరిచినట్టు నళిని భావించింది. కాని, ఆ ఉదాసీనతే అతడిని మెచ్చుకొనేలా చేసింది. తన సౌందర్యానికి మరులుకాని అతడిని ఎలాగైనా తనవాడినిగా చేసుకోవాలన్న పట్టుదల కలిగింది నళినికి.

నళిని లేచి నిల్చుని "ఇక వస్తాను రత్నా. డాక్టరు వచ్చాక ఫోన్ చెయ్యి" అంది.

రమేశ్, ఆశా లోపలికి అడుగు పెట్టారు.

నళిని చిరునవ్వునవ్వి, చేతులు జోడించి 'వస్తాను' అంది.

రమేశ్ కూడా చేతులు జోడించాడు యాంత్రికంగా.

నళిని వెళ్లిపోగానే రత్న అడిగింది: "పార్కు ఎలావుంది?"

"ఓ మోస్తరుగా ఉంది."

"మా బొంబాయికి చెందిన వాటిని మీరు మెచ్చుకున్నట్టు కనిపించరు అవునా?"

"కాదు. మీరు పొరపడుతున్నారు. బొంబాయికి చెందిన రెండు వస్తువులు నాకు చాలా నచ్చాయి."

"ఏమేమిటో" కుతూహలంతో అడిగింది రత్న.

"ఒకటి సముద్రం, ఇంకొకటి సముద్రంలో దొరికే వస్తువు."

"అంటే?... ఓ..." రత్న మొహం క్షణమాత్రంలో కెంపులరాశిలా ఎర్రబడిపోయింది.

"నిజం చెప్పండి రత్నా! ఈరోజు నాతో రాకుండా ఎందుకు తప్పించుకున్నారు? నన్ను చూస్తే మీకు భయమా! మీ అనుమతిలేకుండా ఇహ ఎప్పటికీ నిన్నటిలా తొందరపడను. నా తొందరపాటుకు మీరేం శిక్ష విధించినా అనుభవిస్తాను."

"నిజంగా?"

రత్న కుడి కనుబొమను పైకెత్తి "నిజంగా?" అన్నపుడు రమేశుడి కంటికి అతిమనోహరంగా కనిపించింది.

"ఊఁ."

రత్న చుట్టూ చూసింది. ఆశ కనిపించలేదు. వేగంగా రమేశుకు దగ్గరగా వచ్చి తనకన్నా ఎత్తుగాఉన్న అతడి తలను రెండు చేతులతోనూ పట్టుకుని వంచి నుదుటిమీది జుట్టు వెనక్కుతోసి నుదుటిమీద మృదువుగా ముద్దు పెట్టుకుని వెనక్కు జరిగి;

"ఇదే నేను మీకు విధించే శిక్ష" అంది.

"రత్నా..."

"ఊహుం... ఇక మనం 'సెంటిమెంటల్‌గా' ఉండటం మానేద్దాం."

"రత్నా..."

"రమేష్! ఒద్దు. మీకు పుణ్యముంటుంది."

"రత్నా..."

"మీరు చుట్టిచుట్టి మళ్ళీ అదే విషయానికి వచ్చారంటే, నాకు పిచ్చెత్తుతుంది. దయచేసి ఇంకేమైనా మాట్లాడుకుందాం."

ఆమె—గాంభీర్యం చూసి రమేశ్ మెదలకుండా ఊరుకున్నాడు.

"నళిని ఎలాంటి పిల్ల"—రత్న అడిగింది.

"మంచి అమ్మాయే. కొంచెం మాట లెక్కువ."

"చూడటానికి ఎలా ఉంది?"

"బావుంది."

"అంతేనా?"

"కాక, నళినిని నాతో షికారుకు పంపటంలో మీ ఉద్దేశ్యం?"

"దానిలో పెద్ద ఉద్దేశ్యమేముంది? మీకు మా వాళ్ళను పరిచయం చేద్దామనిపించింది. నళినికి కబురంపాను అంతే."

"నమ్మమంటారా?"

"నమ్మండి."

శేషగిరి వచ్చాక, రత్న విహార్ లేక్‌కు వెళ్ళే విషయం కదిపింది. కాని, అతడికి ఇలాంటి విషయాల్లో అంత ఆసక్తి ఉండదు.

అతను ఆయాసంతో కళ్లు మూసుకుని "వెళ్ళాం" అన్నాడు.

"వాళ్లింక ఏమని చెప్పరు?"

"వెళ్లేటట్టయితే ఉదయం ఎనిమిదింటికి వాళ్ళింటికి వస్తామని చెప్పా."

బాల్కనీలో నిల్చుని వీధివైపు చూస్తున్న రమేష్ ఎం దుకో వెనక్కి తిరిగి చూశాడు. శేషగిరి రత్న మాట్లాడు కుం టున్నారు. రత్న మొహంమీద మందహాసం వెలుగుతోంది. పనిచేసి అలసివచ్చిన శేషగిరి అలసటతో కళ్ళు మూసు కుని ఉన్నాడు. అతడికి రత్న—మాటలవైపు దృష్టి ఉన్నట్టే లేదు.

కాని, నిరంతరం వెలిగే దీపం—రత్న మందహాసం.

ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రి అనే భేదం లేకుండా ఎల్లవేళలా ప్రశాంతంగా వెలిగే నందా దీపం— ఆమె నవ్వు.

ఆశ నేలమీద కూర్చుని ఏదో బొమ్మల పుస్తకం చూసుకుంటోంది.

రమేష్ కళ్ళకు ఓ సుందరమైన చిన్నారి సంసార చిత్రం కనిపించింది.

అతను ఆ సంసారంలోనివాడు కాడు. తనకూ ఆ సంసా రానికి ఏవిధమైన బంధుత్వమూ లేదు.

తను అక్కడెందుకుండాలి?

రమేశుకి వెంటనే తన వస్తువులు సర్దుకుని చెప్పాపెట్ట కాకుండా వెళ్ళిపోవాలనిపించింది. అతడు రెండు చేతులతో నూ కణతలను అదిమి పట్టుకున్నాడు.

రెండు నిమిషాలు ఆగి, మళ్ళీ అటువైపే చూశాడు రమేశ్.

ఈసారి అతడి కళ్ళు రత్నమీదే నిలిచాయి.

రత్న, శేషగిరి దగ్గర ఉన్నప్పుడు తనకు పరాయి దానిగా అనిపించేది. తన దగ్గర ఉన్నప్పుడు జన్మ జన్మాంతరాల బాంధవి అన్నట్టు స్నేహంగా, ఆత్మీయతతో మెలిగేది.

అది నటనా లేక నిజమైనదా?

శేషగిరి కళ్ళు తెరచి రత్నతో ఏమో చెప్పాడు. రత్న నవ్వుతూ బదులు చెప్పినప్పుడు...రమేష్ హృదయం అసూయతో ఉడికిపోయింది.

తనలో అసూయాగ్ని కణాన్ని రగుల్చాల్సిన రత్నను రమేష్ ఆ నిమిషంలో బద్ధ శత్రువులా ద్వేషించాడు. అతడు చూస్తూండగానే రత్న వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"ఆశా! అందర్నీ భోజనానికి రమ్మను" వంటింట్లోనుండి పిలుపు వచ్చింది.

వాళ్ళతో కలిసే అధికారం తనకు లేదనిపించి రమేశ్ చీకట్లోనే నిల్చుండిపోయాడు.

శేషగిరి, ఆశా భోజనానికి వంటగదిలోకి వెళ్ళారు. కాస్సేపటిలో రమేశుడిని వెతుక్కుంటూ వచ్చింది రత్న. రమేశ్ చీకట్లో నిల్చోవటం చూసి, బాల్కనీలైటు స్విచ్ వేయటానికి చెయ్యి చాచింది.

ఆ చేతిని తన చేతితో అందుకుని రమేశ్:

"రత్నా..." అన్నాడు.

"ఏమిటి?"

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?"

"ఇదేం ప్రశ్న? వాళ్ళిద్దరూ అన్నం తింటున్నారు. మీరూ రండి."

"నేను అడిగినదానికి బదులు చెపితేగాని రాను."

రత్న కొంటెగా "ప్రేమించటం లేదని చెపితేనో?" అంది.

"ఈ బాల్కనీనుండి కిందకి దూకేస్తాను."

రత్న మౌనంగా అతని చేతినినొక్కి, లోపలకు వెళ్ళింది. రమేష్ సంతృప్తి చెందాడు.

మర్నాడు ఉదయం తను విహార్ లేక్ కి రాలేనని చెప్పేశాడు శేషగిరి.

"మీరు వెళ్ళిరండి. నేను ఇంట్లోనే ఉంటాను" అని ఖచ్చితంగా చెప్పేశాడతడు.

ఆఖరికి రమేశ్, రత్నా, ఆశా ఇంటినుండి బయల్దేరి నళిని యింటికి వెళ్ళారు. రమేశుకిని నళిని తల్లిదండ్రులకు పరిచయం చేసింది రత్న.

నళిని చూపరులకు ముద్దు గొలిపేలా అలంకరించుకొంది. జరీపువ్వుల తెల్లసిల్కుచీరలోనున్న నళినిపైనుండి తన చూపును మరల్చుకోలేక పోయింది రత్న.

ఆశా, నళిని కాళ్ళకు పెనవేసుకుని "అక్కయ్యా... నువ్వెంత బాగున్నావ్! నీ జడ ఎంత పొడుగో, నాకు జడే లేదు...! అమ్మో! అక్కయ్యెంత బావుందో చూడు...నేను అంత బాగాలేను కదూ..." అంది.

"అవునమ్మా, నువ్వు నాలాగున్నావు" అంది రత్న.

రమేష్ నళినిలను తన మనస్సులో పక్క-పక్క-గా నిలబెట్టి చూసి రత్న:

"ఎంత అందమైన జంట" అనుకుంది.

నళిని యింటినుండి బయల్దేరేసరికి తొమ్మిదిగంట లయింది.

ఆరోజు ఆదివారం కావటంవల్ల విహార్ లేక్ అంతా జనసమ్మర్దంతో నిండిపోయింది. ఆ సందడినీ, అందమైన తోటను చూడగానే, ఎగిరి గంతులు వేసింది ఆశా.

అందర్నీ వదలి ఉత్సాహంతో పరుగులు తీస్తున్న కూతుర్ని వెంబడించే సాకుతో రమేష్ నళీనలను వదలి ముందుకు వెళ్లింది రత్న.

కాని, ఆశా తల్లి చేతికి దొరికితేనా ?

ఆశా భూతాకారపు బొమ్మల నోటిలో ప్రవేశించి ఆట లాడింది. తల్లి చేతికి అందకుండా ఏడిపించింది.

రమేష్ నళినితో కలిసి వస్తున్నా, అతడి కళ్ళు కూతు రితో ఆడుకుంటున్న రత్న మీాదనే ఉన్నాయి. నళిని మాటల మీాద దృష్టే లేదతనికి. రత్న ఎక్కడైనా మనుష్యుల గుంపులో కనుమరుగయినపుడు అతడి కళ్లు ఆ సమీాపంలోనే రత్నకోసం వెతుకుతున్నాయి.

కూతురి ఆటపాటల్లో మైమరచిన రత్ననుచూసి అసూయ కలిగింది రమేశుడికి.

రత్న ఎంతమందిని ప్రేమించ గలదు ? తన కూతుర్ని అంతగా, ప్రేమించే రత్నకు తనమీాదకూడా ప్రేమ ఉండటం సాధ్యమా ?

"ఏమయినా సరే, ఈరోజు ఈ సంగతి తప్పకుండా తేల్చెయ్యాలి." అనుకున్నాడు రమేష్.

"రమేశ్! అటు చూడండి. నీళ్ళలో చెట్లు, మబ్బుల ప్రతిబింబం ఎంత బావుందో—"

"సరిగ్గా వినిపించుకోని రమేశ్ "ఏమిటి? ఎక్కడా?" అని కంగారు పడ్డాడు.

ఇహ రమేశుని మాట్లాడించాలనే ఆశ వదులుకుంది నళిని. తనూ రమేశుతో పాటు రత్న, ఆశలను వెతకసాగింది.

చెట్టు నీడలో గడ్డిమీద కూర్చున్న రత్నను చూడగానే "ఎక్కడికి వెళ్ళారు మీరు? వెతకలేకచచ్చాం." అంది.

"నిజంగా?"

"ఊఁ. కావాలంటే వీరిని అడుగు" అంటూ రమేశుని వైపు చూసింది నళిని. రమేష్ "నిజంగా?" అంటున్న రత్న మోహక భంగిమను చూస్తూ నిల్చున్నాడు.

నళిని మొహం తెల్లగా పాలిపోయింది. ఆమె మొహంలోని వెలుగు, నూనె అయిపోగానే ఆరిపోయే దీపంలా, ఆరిపోయింది.

మరుక్షణంలోనే తేరుకుంది నళిని. మామూలుగానే నవ్వుతూ వెళ్ళి, రత్న పక్కన కూర్చుంది. పొద్దెక్కుతున్న కొద్దీ వేడి ఎక్కువకాసాగింది. సోడా అమ్మే వాళ్ళ వ్యాపారం బాగా సాగుతోంది.

"అమ్మా? నాకు ఐస్‌క్రీమ్."

"రా; ఐస్‌క్రీమ్ ఇప్పిస్తాను" అంటూ లేచింది రత్న.

నళిని "నువ్వుండు రత్నా ! నేను ఇప్పిస్తాను" అని ఆశ చెయ్యి పట్టుకుని బయల్దేరింది.

రమేశ్ రత్న ఇద్దరే మిగిలారు.

రత్నే మాటలు ప్రారంభించింది:

"నళిని చాలా మంచిపిల్ల కదూ ?"

"అవును."

"రూపం, విద్య, బుద్ధి అన్నీ ఉన్నా, గర్వం లేదు."

"నిజం."

"ఆమెను చేపట్టే వరుడు అదృష్టవంతుడు."

"అవును."

రత్న అర్థగర్భితంగా రమేశుడివైపు చూసింది. రమేశ్ ఏమీ తెలీనట్లే నటించాడు.

"రత్నా ! మీకు ఆశంటే చాలా ప్రేమకదూ ?"

రత్న ఆశ్చర్యంతో తలెత్తి "అదేం ప్రశ్న !" అంది.

"చెప్పండి."

"ఏ తల్లికుండదు తన పిల్లమీద ప్రేమ ? దీనిలో అడగటాని కేముంది ?"

"కాని, మనిషి హృదయం ఎంతో చిన్నది. ఒకేసారి ఎంతమందిని ప్రేమించగలదు ?"

"హృదయపు ఆకారం చిన్నది, కాని అందులోని భావనలు విశ్వాన్నంతా ఆవరించగలవు. ప్రేమకు మరోపేరే దేవుడు అనటం అబద్ధం కాదు. దేవుడు సర్వశక్తి సంపన్నుడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపి అని వినే ఉన్నారుగా."

"రత్నా ! మీరు ఆశను ఎంతగా ప్రేమిస్తున్నారు ?"

"ఒక తల్లి తన పిల్లను ఎంతగా ప్రేమించగలదో అంత గానూ ప్రేమిస్తున్నాను."

"రేపు మీకు నలుగురు పిల్లలుపుట్టినా, ఆశను ప్రేమించినట్టే వాళ్ళనూ ప్రేమించగలరా ?"

"ఏం ప్రశ్న అడుగుతున్నారు మీరు. నలుగురు పిల్లల తండ్రయ్యాక మిమ్మల్ని ఇదే ప్రశ్న అడుగుతాను. మీ రప్పుడేం జవాబు ఇస్తారో, నేనూ అదే ఇప్పుడు ఇవ్వగలిగేది."

రమేష్ గడ్డికొసను పంటితో కొరుకుతూ:

"నేను తండ్రిని కాబోను" అన్నాడు.

"అంటే ?"

"నేను పెళ్ళిచేసుకోను."

రత్న నవ్వి "పెళ్ళికాకముందు యువతీ యువకులందరూ ఇదే మాట అంటారు" అంది.

"ఖచ్చితంగా చెపుతున్నాను నేను."

"కారణం తెలుసుకోవచ్చా ?"

"ఆఁ, నిరాశే కారణం."

"ఎలాంటి నిరాశ."

"నేను అపురూపమైన రూపవతిని పెళ్ళాడాలని కోరుకునేవాడిని. రూపంకోసం అన్వేషిస్తున్న నా మనసు కెవరూ నచ్చలా..."

రత్న మధ్యలో అందుకుని "మీకు నచ్చే రూపసిని నేను తేగలను" అంది.

"కావచ్చు కాని, ఇపుడు రూపసిని మెచ్చుకునే మనఃస్థితిలో లేను నేను."

కారణం అడిగే ధైర్యం రాలేదు రత్నకు. అతడి దృష్టిని ఎదురించలేక తలవంచుకుని కూర్చున్నది.

"నాకు నచ్చిన యువతికి...పెళ్ళయిపోయింది" మెల్లిగా అన్నాడు రమేశ్.

ఆమెఎవరని అడగటానికి ప్రయత్నించి, చివరికి మానమే మంచిదనుకుంది రత్న.

"రత్నా! ఇపుడు నేనేం చెయ్యాలో చెప్పండి" రమేష్ ఆమెనే అడిగాడు.

"ప్రేమ గుడ్డిది. నిజం; కాని, ప్రేమకుకూడా కొంచెం విచక్షణా జ్ఞానం ఉండాలి."

"ఇప్పుడేం చేయను ?"

"ఏమీ చేయకండి. ఆమెను మరిచిపోయి ఇంకో అందగత్తెను పెళ్ళాడి సుఖంగా ఉండండి."

"రత్నా! మీరు మనఃపూర్వకంగా ఈ సలహా ఇస్తున్నారా ?"

రత్న తలెత్తి అతడివైపు చూసింది. ఆమె కళ్ళలో బాధ స్పష్టంగా కనిపిస్తోంది. అతడిమీద అభిమానం, వ్యథా ఆమె మొహంలో గూడుకట్టుకున్నాయి.

"నా ఆత్మను హింసించకండి రమేశ్! నాకు అంత శక్తి లేదు."

"మనఃపూర్వకంగానే ఇస్తున్నారా ఈ సలహా ?"

"అవును; పెళ్ళి ఒకటే మీరు పాతదాన్నంతా మరిచి జీవించటానికి సాయపడుతుంది. మీ సంసారమూ, వృత్తి, వీటి సహాయంతో అన్నీ మరచిపోగలరు."

"నాకు మీ మాటమీద నమ్మకం కలగటం లేదు."

"నామాట నమ్మండి. మొదట కొన్నాళ్లు బాధలు వాటి వాటిని మరిచిపోలేక పోవచ్చు. కాని, క్రమేణా అన్నీ సరి పోతాయి. ఒక స్త్రీ కాని, పురుషుడు కాని ఒకర్నొకరిని పోగొట్టు కుని జీవితమంతా ఏడవవలసింది ఏమీ లేదు. ఎవరికి అంతటితో ముగింపు నివ్వరాదు."

"నోటితో చెప్పటం సులువే. ఆచరణలో పెట్టటమే కష్టం."

"కష్టమంతగా ఏం ఉండదు. పోనుపోను అన్నీ మీకే తెలుస్తాయి."

రమేశునికి దూరంలో నళిని, ఆశా రావటం కనిపించింది. వెంటనే తను అడగాలనుకున్న ప్రశ్న గుర్తుకు వచ్చింది.

"రత్నా! నే నొకటి అడుగుతాను, చెప్పాలి" అన్నాడు.

"ఏమిటది?"

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?"

రత్న చిన్నగా నవ్వి "కొన్ని ప్రశ్నలు అడగరాదు. వాటికి జవాబు దొరకదు" అంది.

"కాదు చెప్పండి."

"మీ కేమనిపిస్తోంది?"

"మనమిద్దరమే ఉన్నప్పుడు మీరు నన్ను ప్రేమిస్తున్నా రనే అనిపిస్తుంది. కాని, మీరు ఆశతో కలిసి ఆనందంగా ఆడు కుంటున్నప్పుడు ఆశను ప్రేమించినంతగా నన్ను ప్రేమించటం లేదనిపిస్తుంది. మీరు నిజం చెప్పండి."

"నిజం తెలుసుకుని ఏం చేద్దామని?" కొంటెగా అడి గింది రత్న.

"నన్ను బాధపెట్టక చెబుదురూ" అన్నాడు రమేశ్.

రత్న చుట్టూచూసి మెల్లిగా "వీలయితే మిమ్మల్ని నా కంఠహారంగా మార్చి మెళ్ళో వేసుకునేదాన్ని" అంది.

"కంఠ హారంగానా ? ఎందుకూ ?"

"హృదయానికి దగ్గరగా ఉంటుందని."

రమేశుడి ఆనందానికి అంతులేదు. నళిని, ఆశా దగ్గరగా లేకపోతే తన సంతోషాన్ని ఏవిధంగా చూపేవాడో ?

మోకాలిమీద తల ఆన్చి పచ్చిగడ్డిమీద కూర్చుంది రత్న. పెద్ద ముడిమీద మల్లెపూల దండ అమర్చుకుంది. ముడి మధ్య కెంపుల బిళ్ళ మెరుస్తోంది.

వెనుకనుండి చెక్కిన ప్రతిమలా ఉన్న రత్ననుచూస్తూ, నళిని నిదానంగా నడిచి వచ్చింది. ఆశా పరుగెట్టుకుంటూ వచ్చి తల్లి ఒళ్ళో పడి;

"అమ్మా ! ఐస్‌క్రీమ్ ఎంత బావుందో" అంది.

"ఇంతసేపయిందేం ?" నళినివైపు తిరిగి అడిగింది రత్న.

"నళిని అక్కయ్య నన్ను నీళ్ళ దగ్గరకు తీసికెళ్ళింది. అమ్మదగ్గరకు వెడదాం అంటూంటే వినకుండా ఎక్కడికో తీసి కెళ్ళింది..."

రత్న గుండె దడదడలాడింది. గబుక్కున నళిని మొహం చూడాలనిపించింది కాని, తలెత్తిచూసే ధైర్యంరాలేదు. కాసే పయ్యాక ఏదో మాట్లాడుతూ నళినివైపు చూసింది.

అందమైన ఆ మొహంమీద రాసిన కథ స్పష్టంగా కని పించింది రత్నకు. నల్లటి ఉంగరాలజుత్తు ఆవరించివున్న ఆ ముద్దు మొహంలో నిరాశ చోటు చేసుకుంది.

ఇలాంటి పిల్లవైపు తలెత్తి చూడలేని రమేష్ ఎంతటి మూర్ఖుడు!

రమేశుకి బాగా బుద్ధిచెప్పాలి అనుకుంది రత్న.

ఒక విధమైన నిరాశ, అసంతృప్తి, వ్యథలతోనే ముగ్గురూ ఇంటిదారి పట్టారు. ఐస్ క్రీం తింటున్న ఆశా మాత్రం ఆనందంగానే ఉంది.

దోవలో ఎవరూ ఎక్కువగా మాట్లాడలేదు.

రమేశునివైపు ఆకర్షించబడిన నళినికి అతని దృష్టి వేరే చోట్లో ఉందని తెలిసినపుడు, తన అందం, చాతుర్యం అంతా వ్యర్థమనిపించి నిరాశచెందింది.

నళిని మౌన కారణం గ్రహించి రత్న నొచ్చుకుంది. నళిని తన ఇంటివైపు తిరిగినపుడు;

"సాయంత్రం మెట్రో వెడదాం రా. మంచి పిక్చరే వచ్చింది" అంది.

"లేదు రత్నా! నేను రాలేను. నా స్నేహితురాలింటికి వస్తానని మాటిచ్చాను. క్షమించు" అని రమేశువైపు తిరిగి; "వస్తాను" అని చేతులు జోడించింది.

నళిని వెళ్ళిపోగానే రత్న రమేశుడివైపు తిరిగి:

"నళిని అదోమాదిరిగా ఉంది" అంది.

"అలాగా, నేను గమనించలేదు."

"మీరు ఆమె నేమీ నొప్పించలేదు కదూ?"

"ఛా. నే నామెతో మాట్లాడితేకదా" అని తనను తాను సమర్థించుకున్నాడు రమేష్.

నళినికి అంతకన్నా మరో అవమానం ఏముంది?

"మీ రెందుకు మాట్లాడలేదు? మాట్లాడితే ముత్యాలు రాలుతాయనా? మీరు మాట్లాడించలేదనే ఆ అమ్మాయి చిన్నబుచ్చుకుంది. పాపం! ఎందుకలా చేశారు మీరు?"

రమేష్ అపరాధిలా తల వంచుకుని;

"ఏమని మాట్లాడించాలో నాకు తెలియలేదు" అన్నాడు.

"నాదగ్గర గంటలకొద్దీ మాట్లాడుతారు కదా. నళినితో మాట్లాడటానికేమీ తోచలేదూ?"

"మీరు నళిని కాదు; రత్న."

"ఎవరైతేనేం! మీ రామెను మాట్లాడించకుండా చాలా తప్పు పనిచేశారు."

"ఏమని మాట్లాడించాలి?"

"నువ్వు చాలా అందంగా ఉన్నావు అని చెప్పాల్సింది."

"ఇది మరీ బావుంది. అందంగా ఉన్నవాళ్ళను అందంగా ఉన్నావనటంలో విశేషం ఏముంది? అన్నంతిని, కంచం కడుగు తున్నవారిని 'భోంచేశారా'? అని అడిగినట్టు ఉంటుంది."

"పొండి. నేను మీతో మాట్లాడను" అంది రత్న కోపంగా.

తమిద్దరి మధ్యా ఆశ ఉండకపోయినట్టయితే... అను కున్నాడు రమేశ్.

తలుపుకు వేసిన తాళాన్ని చూసి రత్న కనుబొమలు ముడిపడ్డాయి.

"ఆశా! దేశాయిగా రింటికి వెళ్ళి తాళంచెవి తీసుకురా" అంది రత్న.

ఆశ వెళ్ళగానే రమేశ్:

"కోపం చేసుకోకండి. నళినిని ఏమని పలకరించాలో నాకు తెలియలేదు. ఈనాటికి క్షమించండి" అన్నాడు.

పశ్చాత్తాపంతో నిండిన అతని మొహాన్ని చూసి రత్న కోపమంతా కరిగిపోయింది. కాని, దాన్ని కనపడనీయకుండా మౌనంగానే నిల్చుంది.

"సాయంత్రం మెట్రో వెడదామా?"

"ఊహుఁ, నేను రాను."

"నేనింకా ఆ థియేటర్ చూడలేదు."

"వెళ్ళి చూచి రండి."

"ఒక్కడినే వెళ్ళటాని కిష్టంలేదు."

"అయితే నళినిని పిలవండి."

రమేష్ ఉత్సాహంతో "అలాగే. దారిలో నళినినికూడా తీసుకునే వెడదాం" అన్నాడు.

ఆశ తాళంచెవి తీసుకుని వచ్చింది. రత్న తాళం తీసి ఇంట్లోకి అడుగు పెట్టింది.

శేషగిరి చిన్న చీటీ రాసిపెట్టాడు టేబుల్ మీద.

"నాకోసం భోజనానికి కాచుకోకండి."

రత్న—మొహం వాడిపోయింది.

"ఏం జరిగింది?" అన్నాడు రమేష్.

"ఏమీ లేదు. ముందు మీరు కాళ్ళు కడుక్కోండి."

"డాక్టర్ని రానివ్వండి."

"కాచుకోవద్దని రాశారు."

భోజనా లయ్యేసరికి రత్న మనస్సు కాస్త కుదుటబడింది. రత్న ప్రసన్నంగా ఉండటం చూసి రమేష్;

"సాయంత్రం మ్యూట్రో వెడదాం" అన్నాడు.

"మీరే నళినితో చెప్పండి" అని రిసీవర్ రమేశుడి చేతి కిచ్చింది. ఇష్టం లేకపోయినా ఫోన్ చేశాడు రమేష్.

"సాయంత్రం నాలుగింటికి వస్తాం. మ్యూట్రోకి వెడదాం."

ఒక క్షణం ఊరుకుని "క్షమించండి. నేను రాలేను." అని ఫోన్ పెట్టేసింది నళిని.

రమేష్ రెండుమార్లు హలో అని జవాబు రాకపోయే సరికి ఊరుకున్నాడు.

"ఏమండి?" కుతూహలంగా అడిగింది రత్న.

"రాదట."

"అయితే నేనూ రాను."

"నాకు మ్యూట్రో చూపించరా?"

"మీకు నేను చూపించట మేమిటి? మీరే వెళ్ళి చూసి రండి."

రమేశ్ కి ఆమెతో బాగా దెబ్బలాడాలనిపించింది. కాని, ఆశ దగ్గరలోనే ఉండటంతో ఊరుకోవాల్సి వచ్చింది.

నాలుగ్గంటలవుతూంటే, రమేశ్ నిలువలేకపోయాడు.

ఆఖరికి స్థిరంగా, మౌనంగా కూర్చున్న రత్న దగ్గరకు వెళ్ళి;

"వెడదమా?" అన్నాడు.

"ఎక్కడికి?"

"మ్యూట్రో."

"క్షమించండి. నేను రాలేను."

"రత్నా! ఎందుకు నన్నిలా ఏడిపిస్తున్నారు?"

"ఈరోజు నేను రాలేను..." అంటూండగానే ఫోన్ మ్రోగింది. శేషగిరి ఫోన్ చేశాడు.

"స్నేహితులతో సినిమాకు వెడుతున్నాను. రాత్రి రావటం ఆలస్యమవుతుంది. నాకోసం కాచుకూర్చోకండి."

రత్న రసీవర్ క్రింద పెట్టి రమేశుడివైపు తిరిగి;

"వస్తాను" అంది.

ఆనందంతో రమేశుడి మొహం వికసించింది.

రత్న ఆశకు గుడ్డలు మార్చి తనూ అలంకారం చేసుకుంది. ఇంటికి తాళంవేసి తాళంచెవి ఆశ చేతికిచ్చి;

"మంజూ తల్లికి ఇచ్చేసిరా" అంది.

"ఉన్నట్టుండి మనస్సు మార్చుకున్నారేం."

"నళిని—వాళ్ళింటికి వెళ్ళి పిలుద్దామా?"

"వద్దు" అంది రత్న ముక్తసరిగా.

మెట్రోలాంటి దివ్యమైన థియేటరును అంతవరకూ చూసి ఎరుగడు రమేశ్. అలాంటి థియేటరులో కూర్చుని ఎంత చెత్త—పిక్చరయినా చూడవచ్చు అనిపించింది రమేశుకి.

క్రింద పరచిన రత్నకంబళి, కుషన్ కుర్చీలు, అద్దాలు, హితమైన వాతావరణం, అతడిని వేరే లోకంలోకి తీసుకు వెళ్ళాయి.

కుర్చీలో కూర్చుని రమేష్ రత్నతో;

"బొంబాయిలో చూడదగినవి మూడున్నాయి" అన్నాడు.

"ఏవేవి?"

"సముద్రం, మెట్రో, మీరు."

రత్న—కళ్ళు చెమర్చాయి. రుద్ధకంఠంతో:

"రమేశ్! నేను మామూలు స్త్రీని. నన్నెందుకింత ఉన్నతస్థాయిలో కూర్చోపెడతారు? మీరిలా మాట్లాడితే నాకు బాధకలుగుతుంది" అంది.

రమేష్ కాస్సేపు ఊరుకుని;

"రత్నా! నన్నెపుడు ఊరికి పంపిస్తారు?" అన్నాడు.

రత్న అదరిపడింది. రమేష్ తమ ఇంటికి అతిథిగా వచ్చిన వాడు. కొద్ది రోజులుండి వెళ్ళిపోతాడు అనే విషయం అపుడే గుర్తుకొచ్చిందామెకు.

తరువాత... తరువాత... తను... ఎలా?

"ఊరికి వెళ్ళే మాటతో నన్ను భయపెట్టకండి రమేష్."

"అయితే ఇక్కడే ఉండిపొమ్మన్నారా?"

"ఊఁ, మీరు వెళ్ళిపోతే నాకేం తోచదు."

"ఏం?"

"మీరు వెళ్ళిపోతే తరువాత ఇంత ప్రేమగా, స్నేహంగా నన్నెవరు చూస్తారు?"

రమేష్ చీకట్లో చటుక్కున ఆమె చేతిని పట్టుకుని:

"రత్నా! ఇపుడు నన్నేం చేయమంటారో చెప్పండి" అన్నాడు. అలా అంటున్నట్టుగానే అతడి ధ్వని భారమైంది. ఉద్వేగంతో వేగంగా ఊపిరి వదులుతున్నాడు.

"అంటే?"

"నాకు ఏం చెయ్యటానికి తోచటంలేదు... మీరు ఎలా చెబితే అలా చేస్తాను. నేనిక్కడికి వచ్చిన ఉద్దేశమే వేరు. దుఃఖపు వలనుండి తప్పించుకుందామని ఇక్కడికి పారిపోయి

వచ్చాను. కాని ఇక్కడ ఇంకో వలలో చిక్కుకున్నాను. రత్నా... నేనేం చేయను?"

దారి తప్పిన పసిపిల్లాడిలా, అసహాయుడై "ఏం చేయను" అని తన్నడుగుతున్న రమేశుని తన వ్యాపయూనికి హత్తుకోవా లనిపించింది రత్నకు.

థియేటరులో ఉన్నది మసక వెల్తురే అయినా, చుట్టూ ఉన్న మనుష్యులను చూసి తన కోర్కెను లోలోపలే అణుచు కుంది రత్న.

"ఏం చేయను రత్నా?"

"నేనూ మీలాగే అసహాయురాలిని రమేశ్. మీ రీ ఊరికి అసలెందుకొచ్చారు? మీరు రాక ముందు నేను నిశ్చిం తగా ఉండేదాన్ని."

"కాని, సంతోషంగా ఉండేవారా?"

"అవన్నీ అడగరాని ప్రశ్నలు... మీరెందుకొచ్చారు?"

"తరువాత చెపుతాను నే నెందుకొచ్చానో..."

ఇద్దరూ సినిమా చూడటంలో మునిగిపోయారు.

# 10

ఇంటికివచ్చి భోజనాలవటమే ఆలస్యం; రత్న అడిగింది.

"బొంబాయికి ఎందుకొచ్చారు ?"

ఆశా : "అమ్మా ! పక్క వేయమ్మా" రత్న పక్క వేసి ఆశను నిద్రపుచ్చింది.

రమేశ్ అన్నాడు :

"ఇపుడు కనిపిస్తోంది; నేనిక్కడికి రాకుండా ఉండాల్సిందని. అక్కడే ఉంటే బాగుండిపోయేది. ఇక్కడికి రావటమే మొదటి తప్పు. మీతో ఆత్మీయత పెంచుకోవటం రెండవ తప్పు" రత్నా! నేను వెళ్ళిపోతాను. నన్ను పంపించేయండి. ఇహ ఇక్కడుంటే నాకు పిచ్చిపట్టక మానదు."

"పిచ్చా ?"

"ఊఁ; రత్నపిచ్చి. నా మనసు నా అధీనంలో ఉండటం లేదు. నే నిక్కడే ఉంటే, ఏం జరుగుతుందో నేను చెప్పలేను రత్నా ! నన్ను పంపించేయండి."

"ఎలా పంపను ?"

"మెడపట్టి గెంటేయండి."

"అది నా చేతకానిపని."

"చేతసయ్యేలా ప్రయత్నించండి. రత్నా ! నేనో ప్రశ్న అడుగుతాను దాచుకోకుండా జవాబు చెప్తారా ?"

"అడగండి"

"నన్ను మీ రెందుకింతగా పట్టించుకున్నారు ?"

"ఇంతగా అంటే ?"

"చాలా."

"కొన్ని విషయాలను వివరించి చెప్పటం కష్టం. మొదట్లో మిమ్మల్ని చూసినప్పుడు కుతూహలం కలిగింది. క్రమేణా కుతూహలం జాలిగా మారింది. జాలినుండి స్నేహం, ఆత్మీయత... ఇలాగే...కాని, రమేశ్! మీరు నా గురించి అదేపనిగా ఆలోచించకండి. నాకు భయమేస్తుంది..."

"ఎందుకూ ?"

"మీరు సుఖంగా ఉండాలంటే, నన్ను మరచిపోవాలి. కాలమే అన్నిటినీ మరిపించగలదు."

"అయితే నన్ను పంపించేయండి."

"కాని ఎలా పంపను ? మిమ్మల్ని పంపించటానికే నాకు మనసు రావటంలేదు. అలా అని మిమ్మల్ని ఇక్కడే కట్టివేసుకోలేను. మీ స్నేహం నాకు కావాలి. కాని, దానినుండి మీకే హాని కలుగరాదు."

"మరి మీకో ?"

"నా విషయం వదిలేయండి. ఎలాంటి పరిస్థితినైనా నేను నవ్వుతో ఎదిరించగలను. నాకు మిమ్మల్ని గురించే బెంగ."

"ప్రేమ గుడ్డిది."

"కాని, ప్రేమకు విచక్షణా జ్ఞానం ఉండాలి. నేను పగిలిన అద్దాన్ని. అందులో మొహం చూసుకోవాలని, దాన్ని అతికించాలనే సాహసంమీాది. ఇదేం లాభంలేదు రమేశ్! ఈ విధమైన ఆత్మవంచనవల్ల ఇద్దరికీ సుఖంలేదు.

రమేశ్, ఆమె మాటలువింటూ కూర్చున్నాడు. వాళ్ళిద్దరి మాటలకూ మూగసాక్షిగా గడియారం టిక్కు టిక్కుమంటోంది.

రమేశ్ దిక్కుతోచక "అయితే ఇపుడేంచేద్దాం?' అన్నాడు.

"అన్నీ మరిచిపోయి, కొత్త జీవితం ప్రారంభించండి..."

రమేష్ ఏమో చెప్పుదామని నోరు తెరచాడు. కాని, రత్న అతడిని మాట్లాడనీయక :

"మీారన్నీ మరిచిపోగలరు. అదేమంత అసాధ్యమైన పని కాదు. ఏళ్లు గడిచినకొద్దీ ఈ పాత ప్రకరణాలన్నీ అర్థంలేనివిగా అనిపించవచ్చు. గడిచిపోయినదాన్ని తల్చుకుంటూ, భవిష్యత్తు లేదని భావించేటంత ముసలివాళ్ళు కాదుమీారు. మీా జీవితమంతా ఇకముందే ఉంది. ప్రయత్నిస్తే దీన్ని ఓ పీడకలగా భావించి మరిచిపోవచ్చు."

"పాతదాన్ని మరచిపోవాలంటే, కొత్తదేదైనా కావాలి కదా?...మీాకైతే ఆశా ఉంది...కాని నాకు?"

"మీా చదువు, వృత్తి, సంసారం వీటికన్నా ఏం కావాలి మీాకు?"

"కాని అందులో నేను మనఃపూర్వకంగా కోరుకునేది ఒక్కటీలేదు."

కోపంతో రత్న మొహం కందగడ్డయింది. కనుబొమలు ముడిచివేసి గుప్పిలి బిగించి;

"నాచేత బాగా దెబ్బలు తినాలని ఆశగా ఉంటే అలా మాట్లాడండి. ఒక్కోనారి మీరు మరీ మూర్ఖంగా మాట్లాడు తారు. మిమ్మేల్నం చెయ్యాలో తోచటంలేదు" అంది. అలా అంటూనే గడియారంవైపు చూసి "పదకొండున్నరయింది. ఇక పడుకోండి" అంటూ లేచింది.

"ఇంకా డాక్టర్ రాలేదే !"

"ఆయన ఎప్పుడొస్తారో ఏమో. మీరు పడుకోండి" అంటూ అతని గదికి వెళ్ళి పక్క సరిజేసి బయటకువచ్చింది.

రమేష్ పసిపిల్లాడికిమల్లే లేచి వెళ్ళి పడుకున్నాడు.

రత్న చేతిలో ఓ పుస్తకం పట్టుకుని పడుకుంది. ఆమె కళ్ళవెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయి.

రమేశ్ బొంబాయివచ్చి ఒక నెలకు పైగా అయింది. రత్న స్నేహాదరాలతో అతనికి రోజులు గడిచిపోతున్న విషయమే తెలియటంలేదు. కాని కొద్దిరోజులు ఉండి వెళ్ళటానికి వచ్చిన రమేశ్ ఎన్నిరోజులని ఉండగలడు? రత్న ఇల్లు పరాయి ఇల్లని అతనికి ఏనాడూ అనిపించలేదు. కాని, తన్ను రోజురోజుకూ బలంగా బంధిస్తున్న వలను కత్తిరించి, వీలయినంత తొందరగా అక్కడినుండి వెళ్ళిపోవాలని అతడు నిశ్చయించుకున్నాడు.

ఒక సాయంత్రం రత్న, రమేశ్‌ని బాంద్రాబీచికి తీసు కుని వెళ్ళింది. ఆకుపచ్చరంగుతో ఎండి నిల్చినకొన్ని రాళ్ళను దాటి, విశాలంగా ఉన్న ఓ రాతిమీద కూర్చున్నారిద్దరూ.

నిర్జనంగా ఉన్న ఆ ప్రదేశాన్ని చూసి, తాము ఉన్నది బొంబాయి అనే విషయమే మరిచిపోయాడు రమేశ్.

అస్తమిస్తున్న సూర్యుడు బంగారపు పళ్ళెంలా కనిపిస్తున్నాడు. 'నీ శక్తెంతో చూపు' అన్నట్టుగా ఎగసిపడుతున్న అలలను అందుకోవాలని సూర్యుడు ప్రయత్నిస్తున్నట్టుగా ఉంది ఆ దృశ్యం. సూర్యుడు గిరగిరా తిరుగుతూ, అలలతో ఆడుకుంటున్నాడు.

రమేష్ అన్నాడు:

"రత్నా, నాకు ఊరికి వెళ్ళటానికి అనుమతివ్వండి."

రమేష్ వైపు చూడకుండానే, అస్తమిస్తున్న సూర్యుడి వైపే తదేకంగా చూస్తూ రత్న అంది:

"ఒక షరతుమీద మాత్రమే పంపగలను."

"ఏమిటది?"

"మీరు చదువు పూర్తిచేసి, డాక్టరయి, పెళ్ళి చేసుకోవాలి. ఇలా మాటిస్తే, రేపే వెళ్ళటానికి ఒప్పుకుంటాను."

రమేశ్ కొంచెం ఉద్రేకంతో "మీరు ఎంతో సులువుగా ఆ మాట చెప్పేస్తున్నారు. కాని నాకదంత సులువుగా అనిపించటంలేదు. మిమ్మల్ని అంత త్వరగా నేను మరిచిపోలేను. నన్ను మీరు అంతత్వరగా మరిచిపోగలరా?" అన్నాడు.

రత్న మనసు ఒక్కక్షణం తటపటాయించింది: ఏం చెప్పను? ఏం చెప్పను?" అని.

ఆఖరికిఆమె మనసు ఒకనిశ్చయానికి వచ్చింది. నెమ్మదిగా:

"ఆఁ మీరు వెళ్ళిన మర్నాడే నేను మిమ్మల్ని మరిచిపోగలను."

"అదెలా సాధ్యం ?"

"ఎందుకన్నారు ? మిమ్మల్ని గుర్తించుకుని మాత్రం ప్రయోజనమేముంది ? ఈ జబ్బుకు మరుపుకన్నా దివ్యౌషధం వేరేలేదు. నేను ఎప్పుడూ మిమ్మల్ని ఎక్కువగా పట్టించుకో లేదు. రేపు మీరు వెళ్ళిపోయినా, మళ్ళీ ఒక్కక్షణంకూడా మిమ్మల్ని తల్చుకుని బాధపడను..."

రమేష్ కోపంతో "నాటకం చాలు రత్నా" అన్నాడు.

"నాటకమా !"

"అవును ... ఇన్నిరోజులూ నాతో మీరు నాటక మాడారు. నేను మీకంత సులకనైపోయానా ?"

"నాదంతా నాటకం, అభినయం అని ఒప్పుకుంటే, మీరు నన్ను సులభంగా మరిచిపోగలరా ?"

రమేష్ కోపోద్రేకంతో "ఇహచాలు, మీ నిజరూపం ఈ రోజు బయటపడింది" అన్నాడు.

రత్న ముఖం వివర్ణమైంది. కాని, మృదువుగా :

"రమేష్ !" అంది.

కోపగించిన బిడ్డలా ఆమెవైపు వీపుతిప్పి కూర్చున్నాడు.

"మిమ్మల్ని నొప్పించానా రమేశ్ ?"

రమేశ్ పలుకలేదు.

రత్న మెల్లిగా అతడి భుజంమీద చెయ్యివేసి :

"ఇటు చూడండి రమేష్ ! నన్ను మరవటం మీ కెంత కష్టమో, మిమ్మల్ని మరిచిపోటం నాకూ అంత కష్టంగానేఉంది. కాని, జీవితంలో మళ్ళీ మనం కలుసుకోమేమో. మన జీవితాలు వేర్వేరు దిక్కుల్లో ప్రవహిస్తున్నాయి. అందుకే ఈ పిచ్చి

వద్దంటున్నా. నిప్పులో చెయ్యిపెట్టి కాల్చుకోవటం మూర్ఖత్వం రమేష్! కనుకనే ఇద్దరం ఒకర్నొకరు మరిచిపోవటానికి ప్రయత్నిద్దాం” అంది.

“ఎలా రత్నా! ఎలా?” రమేష్ కంఠంలో ఆవేదన పొంగి పొరలింది.

“నాకు ఆశా ఉంది. మీకు...”

“నా కేముంది?”

“మీకు అన్నీ ఉన్నాయి...”

కాని, నాకు రత్న కావాలి” అంటూ, రత్న చేతిని తన చేతిలోకి తీసుకొని ఆమెను తన దగ్గరగా లాక్కున్నాడు. రమేశ్, రత్న కాదనలేదు. కాని శాంతంగా:

“అగ్నిలో ఆజ్యంపోస్తే మంట ఎక్కువ అవుతుంది. మనిద్దరిమధ్యా లేచిన ఈ మంటను మనం నీళ్ళుపోసి ఆర్పడానికి ప్రయత్నిద్దాం” అంది.

రమేశ్ చటుక్కున ఆమె చెయ్యి వదిలేసి లేచి నిల్చున్నాడు.

“పదండి ఇక్కడినుండి వెళ్ళిపోదాం” అంటూ ఆమె కన్నా ముందుగానే బయల్దేరాడు.

“ఏం” అంటూ లేచింది రత్న.

“చీకటి పడింది, నిర్జన ప్రదేశం. దొంగ లెవరైనా వస్తే...” అంటూ వేగంగా అడుగులు వేయసాగాడు రమేష్. రత్న అతడిని అనుసరించింది. బస్‌స్టాఫ్ దగ్గరకు వచ్చాక రత్న అడిగింది:

"ఎందుకలా పారిపోయి వచ్చారు ?"

"దొంగల భయం నాకు. నాకన్నా వేరే దొంగలు అక్కడ లేరనుకోండి. నామీద నాకా క్షణంలో నమ్మకం లేకపోయింది. ఇంకో క్షణం మనం అక్కడే వుంటే, మిమ్మల్ని ఏంచేసేవాడినో చెప్పలేను. అందుకే అలా పరుగెత్తుకుని వచ్చేశాను..."

రమేష్ నిష్కపటంగా వివరించాడు.

కల్లాకపట మెరుగని అతడి మొహాన్ని చూసి వాత్సల్యంతో అతడి చేయందుకుని మృదువుగా నొక్కి:

"నిజంగా మీదెంత సహృదయం!" అంది

"ఎందుకలా అంటారు?"

"మీరు ఊరికివెళ్ళి చదువు పూర్తిచేసి పెళ్ళిచేసుకోండి. అందాకా నాకు శాంతిలేదు. మీ జీవితం నావల్ల నాశనం కాకూడదు రమేష్! నేను మీ దగ్గరకి రాకుండా ఉండాల్సింది. చాలా దూరంగా ఉండిపోవాల్సింది..."

రమేష్ కొంటెగా "మీరు నా దగ్గర కెప్పుడొచ్చారు? ఇప్పుడు నానుండి ఓ అడుగు దూరంలోనే ఉన్నారు" అన్నాడు.

రత్న తన పక్కగా నడుస్తున్న రమేశ్ వైపు చూసింది. ఒక అడుగు దూరంలో నడుస్తున్నాడు.

అతడి కళ్ళు మెరుస్తున్నాయి. ఉంగరాలజుత్తు రేగి నుదిటిమీదకు పడుతోంది. రత్నకు అతడి నుండి ఒక్క అడుగు కూడా దూరంగా ఉండలేననిపించింది. వెంటనే అతడి దగ్గరగా వచ్చి:

"లేదు! మీకు చాలా దగ్గరగా ఉన్నాను" అంది.

రమేష్ ఆమెవైపు తిరిగి చూడకుండానే, కుడిచేతితో ఆమెను తన దగ్గరికి లాక్కొని, సర్వదా ఆమెను రక్షించే వాడిలా ఆత్మవిశ్వాసంతో ముందుకు నడిచాడు. అతడేమీ మాట్లాడకపోవటం చూసి రత్న:

"ఏమీ మాట్లాడరేం?" అంది.

"మాటల ఆవశ్యకత ఉందంటారా?"

"ఊఁ మన మాటల శబ్దమైన మనల్ని హెచ్చరించ నివ్వండి. నాకు వాగ్దానం చేస్తారా?"

"ఇప్పటికి నన్ను క్షమించండి. మీరు నా దగ్గరగా ఉన్నారు. ఇది కలో, వాస్తవమో నాకు తెలియదు. కలే అయితే దీన్నే ఆఖరిదాకా ఉండిపోనివ్వండి."

రత్నకు మళ్ళీ అతడికి పలకరించే సాహసం కలగలేదు.

ఇంటికి వచ్చేసరికి తలుపులు తెరచిఉన్నాయి. నళిని రేడియో సిలోన్ వింటూ కూర్చుంది.

నళినిని చూడగానే రత్నకు తాను అపరాధి ననిపించింది.

"ఎప్పుడొచ్చావ్ నళినీ?" అంది ఆమెవైపు చూడకుండానే.

"అరగంటవుతోంది. దేశాయిగారింట్లో ఆశ ఉంటే, తాళం చెవి తెచ్చి, రేడియో పాటలు వింటూ కూర్చున్నా ఓ... నమస్తే!" అంది నళిని అప్పుడే రమేశ్‌ని చూసినట్టు.

"డాక్టర్ రాలేదా?" నళిని అడిగింది.

"లేదు."

"ఎన్నింటికి కొస్తారు?"

"పది గంటలకు ముందు రారు."

"నాన్నగారికి ఒంట్లో బాగాలేదు. డాక్టర్ని పిలవ మన్నారు. క్లినిక్‌కు ఫోన్ చేశాను. అక్కడా లేరు. రేపు ఉదయం క్లినిక్‌కు వెళ్ళేముందు అక్కడికి వచ్చి వెళ్ళమను."

చేతిలోని గాజులను తిప్పుతూ అంది నళిని. అందంగా, చక్రాకారంలో, అజంతా మోడిరిలో వేసుకున్న ఆమె ముడి ఆమె తెల్లటి మెడను, మరింత బాగా కనిపింపచేస్తోంది. ముత్యాలను గుచ్చిన నల్లటి పట్టుదారపు కుచ్చులు వీపుమీద పడి ఉన్నాయి.

ఎంతటి అందగత్తె నళిని!

కాని, ఏం లాభం? ఒక యువకుడిని ఆకర్షించలేని ఆమె అందం ఎందుకూ?

రత్న ముగ్ధురాలై నళిని సౌందర్యాన్ని చూస్తోంది.

తనదీ తప్పే. రమేష్‌ని తను ఇంట్లోకన్నా, నళిని ఇంట్లో అతిథిగా ఉంచి ఉంటే బాగుండేది.

రత్న రమేష్‌వైపు చూసింది.

అతడు సంకోచంతో ఏమీ మాట్లాడటానికి తోచక అలాగే నిల్చున్నాడు. తనతో అంతగా మాట్లాడే రమేష్, ఇంకెవరైనా వస్తే మూగనోము పట్టేవాడు.

అంతలో ఆశా తుఫానులా పరుగెత్తుకుని వచ్చి నళిని కాళ్ళను పెనవేసుకుంది.

"అమ్మా! నళినక్కయ్య ఎంత బావుందో!"

నళిని పక్కనఉన్న కుర్చీమీదకెక్కి, ఆమె బుగ్గలు, కంఠం అన్నీ చేత్తోతాకి:

"అమ్మో! అక్కయ్య ఎంత బావుందో" అంది ఆశా.

కూతురి సంబరం, ఆనందం చూసి రత్న నవ్వుతూ:

"అంత అందంగా ఉన్నవాళ్ళను అంతగా తాకరాదు; మాసిపోతారు వాళ్ళు" అంది.

"అవునా అక్కయ్యా?"

"లేదు ఆశా! ఏమీకాదు."

వారి మధ్యలో ఏం మాట్లాడాలో తెలియక వంటరిగా నిలబడిపోయిన రమేశ్, వాళ్ళంతా మాటల్లో పడటం గమనించి చప్పుడు చేయకుండా అక్కడనుండి జారుకున్నాడు.

రమేశ్ వెళ్ళిపోవడాన్ని గమనించి రత్న:

"ఆశా! నీ స్నేహితురాలు పిలుస్తున్నట్టుంది చూడు" అంటూ ఆశను బయటికి పంపింది.

రత్న, నళిని దగ్గరగా జరిగి నెమ్మదిగా:

"నళినీ! నీ కెందుకింత పట్టుదల?" అంది.

"అంటే?"

"అదే, రమేష్‌తో కాస్త కలిసి మెలిసి తిరిగి..."

రత్నమాట పూర్తిచేయక మునుపే నళిని బద్దకంగా వళ్ళువిరిచి "నాకేమంత ఆసక్తిలేదులే ఆ విషయంలో"

"ఏం?"

"నిజం చెప్పనా?" నళిని సూటిగా చూస్తూ అడిగింది.

రత్న—గుండె గబగబా కొట్టుకుంది. తను 'ఊఁ' అంటే నళిని ఏం చెపుతుందో?

తలవంచుకుంది రత్న.

"నాకాబోయే భర్త నన్నే మనస్ఫూర్తిగా ప్రేమిం

చాలని కోటుకోవటంలో తప్పులేదనుకుంటాను. నాభర్త ప్రేమను ఇంకో స్త్రీతో పంచుకోటానికి నేను సిద్ధంగా లేను."

"నువ్వు పొరపడుతున్నావు నళినీ..."

"ఇహ ఆ సంగతి వదిలెయి రత్నా. రేపు డాక్టర్ని మా ఇంటికి మరవకుండా పంపాలి. అన్నట్టు ఆశా ఏదీ" అని మాట మార్చింది నళిని.

తరువాత తొమ్మిదింటిదాకా ఏవో కబుర్లు చెవుతూ కూర్చున్నారిద్దరూ. పొద్దుపోయినట్టే తెలియలేదిద్దరికీ. తొమ్మిది గంటలకు నళిని తన వాచి చూసుకుని:

"ఇక వస్తా" అంది.

"ఒక్కదానివే వెళతావా? రమేష్‌ను రానీ. తోడు వస్తారు."

నళిని నవ్వింది. ఆమె అందమైన పలువరుస ఎర్రటి పెదవుల వెనక తళుక్కుమంది.

నళిని మాటాడకుండా తన వ్యానిటీ బ్యాగ్ తిప్పుకుంటూ వెళ్ళిపోయింది.

రత్న చాలాసేపటివరకూ కూర్చున్న చోటినుండి కదలలేకపోయింది. సుడిగాలిలో చిక్కిన ఎండుటాకులా ఆమె హృదయం అల్లలాడిపోయింది.

రెండు విభిన్న భావోద్వేగాల తాకిడికి తట్టుకోలేకపోతోంది రత్న.

రమేష్ ప్రేమ, స్నేహప్రవాహంలో రత్న అసహాయురాలై ఏదో అవ్యక్త శక్తిచేత నెట్టబడుతున్నట్టుగా తేలిపోతోంది.

అటువంటి నిర్మలమైన ప్రేమను చవిచూసి ఎరుగదామె. భర్త ప్రేమ ఆమెకెన్నడూ లభించలేదు. శేషగిరి నూరు నయా పైసల డాక్టరు. అతడి దగ్గర ఏ విధమైన భావుకతకు కాని, స్నేహ, ప్రేమలకు కాని స్థానంలేదు. అతడి దృష్టిలో హృదయ మంటే దేహానికి రక్తాన్ని సరఫరాచేసే అవయవం మాత్రమే. ఎవరయినా హృదయం గురించి మాట్లాడితే, స్టెతస్కోపు చేతి లోకి తీసుకోవటమే తెలుసు నతడికి.

భావుకత హృదయ దౌర్బల్యానికి చిహ్నం. అదోరక మైన జబ్బు. ఆ జబ్బును ఏ విటమిన్‌తో కూడా నయం చెయ్య లేం. ఒక్కసారి అది మానవుడిమీద దాడి చేస్తే, ఇక అతడు ఎప్పటికీ దాని ఆక్రమణనుండి, దానివల్ల కలిగే అశక్తత, పర ధ్యానం, నిరుత్సాహం—వీటినుండి తప్పించుకోలేడు. కనుకనే, ప్రతీ మనిషి ఆ జబ్బు తనకు తగలకుండా జాగ్రత్తపడాలి అనే సిద్ధాంతం అతడిది.

భావుకత ఓ అంటురోగం అయినట్టు, అది తన దగ్గరకు రాకుండా జాగ్రత్త వహించాడతడు.

కాని, అతడు కఠిన హృదయుడు కాడు. రత్న భర్తగా, ఆశ తండ్రిగా, రోగుల వైద్యుడుగా తన కర్తవ్యాన్ని సవ్యంగానే నిర్వహించేవాడు.

తినటానికి తిండీ, కట్టుకోవటానికి గుడ్డ, అన్నివిధాల స్వాతంత్ర్యమూ రత్నకుంది. సంపాదనలో సగం తన దగ్గరుంచు కుని మిగతాది రత్న చేతికిచ్చేవాడు. ఇంట్లో తనో అతిథిలాగానే మెలిగేవాడు.

భార్యను ఏ విషయాన్ని గురించీ ప్రశ్నించేవాడే కాదు.

ఆశను [illegible] కంటిరెప్పలా జాగ్రత్తగా చూసుకునేవాడు. ఒక తండ్రి నుండి కూతురు ఎన్ని సౌఖ్యాలను పొందగలదో, అన్ని సౌకర్యాలను పొందేది ఆశా ఒక్క ప్రేమను తప్ప. తండ్రిగా అతను కూతురికి తెచ్చివ్వని వస్తువులేదు. కాని ఎప్పుడూ కూతుర్ని దగ్గరకు తీసుకుని లాలించేవాడు కాదు. ఆప్యాయంగా కబుర్లు చెప్పే అలవాటే లేదతనికి!

కాని తన రోగులు, తన వృత్తి అంటే మిగతా ప్రపంచాన్నే మరిచిపోయేవాడు శేషగిరి అప్యాయతను పొందాలంటే అతని దగ్గరకు రోగిగానే వెళ్ళాలి. అతడి సాంత్వన వచనాలు. భరోసా, వీటన్నిటివల్లనే అతని రోగుల జబ్బు సగం నయమయిపోయేది.

దానికితోడు అతని పెదవులపై సదా వెలిగే మాయని చిరునవ్వు రోగుల నిర్జీవమైన మొహాల్లో కూడా ఆశను రేకెత్తించేది.

రత్న తల్లి కాబోతున్నపుడు, శేషగిరి ఆమె విషయంలో తీసుకున్న శ్రద్ధ, ఆసక్తి ఇంకెవరూ తీసుకోలేరు. ఒక్కనిమిషం కూడా ఆమెను వదలి ఉండటానికి ఇష్టపడేవాడు కాదు.

భార్య ఆహారాల విహారాల నన్నిటినీ వైద్యుని దృష్టి లోనే గమనించేవాడు.

ఆశ పుట్టేముందు ప్రసవవేదనతో బాధపడుతున్న రత్నను వదలి వెళ్ళలేదు శేషగిరి. దగ్గరే కూర్చుని కర్చీఫ్‌తో తన నుదుటిమీది చెమటను తుడుస్తూ, చేతిని నిమురుతూ కూర్చున్న భర్తను రత్న ఎప్పటికీ మరిచిపోలేకపోయింది.

అకస్మాత్తుగా తనమీద భర్త చూపిస్తున్న అగాధమైన ప్రేమనూ, ఆసక్తినీ చూసి చకితురాలయింది రత్న. భర్త ఇదేవిధంగా తన్ను ప్రేమించేటట్టయితే ఇంకా కొద్దికాలం ప్రసవ వేదనను అనుభవించగలను అనుకుంది రత్న.

ఆశ పుట్టగానే, శేషగిరి మామూలుగా అందరికిలాగే, ఆమెకూ డాక్టర్‌గా మిగిలాడు. బయటనుండి వచ్చేటప్పుడు నిశ్శబ్దంగా నడిచివచ్చి ఆమె చేతిని తీసుకుని నాడి చూసి, నుదుటి మీద చెయ్యివేసి పరీక్షించేవాడు.

"ఓ, ఆ చెయ్యి అలాగే నుదుటిమీదనుండి తల వెంట్రుకల మీదికి వెడితే!" అని ఆశించేది రత్న మనసు.

భార్యను పరీక్షించాక, కూతుర్నివైపు మళ్ళేదతనిదృష్టి. ఉయ్యాలలో పడుకున్న కూతుర్ని అపుడపుడూ ఎత్తుకునేవాడు బరువు చూడటానికి. మూడు నెలల ఆశా, మూడు నెలల బిడ్డ ఉండాల్సినంత బరువు లేకపోతే, ఆలోచనతో నుదురు చిట్లించేవాడు. బిడ్డ పోషణలో ఏవిధమైన లోపమూ లేనపుడు, బరువు తక్కువగా ఉండటానికి కారణమేమిటి ?

ఆ సమయంలో తండ్రిగా బిడ్డను చూసేవాడు కాడతను. డాక్టర్ శేషగిరి తక్కువ బరువున్న బిడ్డను చూసి ఆలోచించేవాడు. ఇహ అప్పటినుండి కొత్తమందుల ప్రయోగం ప్రారంభమయేది.

పురుడు పోసుకుని మూడు నెలలు పూర్తి కాగానే, శేషగిరి మళ్ళీ ఇంట్లో మామూలు మనిషయ్యాడు.

అతడు బుద్ధిజీవి అయితే, రత్న భావజీవి. భర్త బుద్ధి కుశలత, అతడి వృత్తిపైన అతడికున్న అభిమానం, వీటిని రత్న

ఎంతో గౌరవించేవి. కాని ఇంట్లో ఉన్నప్పుడైనా, నేను డాక్ట రన్న మాట మరిచిపోయి భర్తగా మెలిగితే ఎంత బాగుం టుంది అని మథనపడేవి రత్న హృదయం.

కాని శేషగిరి తన వాళ్ళకూ, బయటివాళ్ళకూ కూడా డాక్టరుగానే మిగిలిపోయారు. తన భార్యను చుట్టుదోవలో ఆమె స్నేహితురాలి ఇంట్లో దిగపెట్టడానికి వెనదీసే శేషగిరి, పది పదిహేను మైళ్ళ దూరంలో ఉన్న హాస్పిటలుకు తన కారులోనే తీసుకుని వెళ్ళేవాడు రోగిని.

రత్న పెళ్ళయిన కొత్తలో.

"నాకన్నా మీకు ఆ రోగే ఎక్కువ" అని విసుక్కుంటే, "నువ్వు మీ స్నేహితురాలింటికి బస్సు, ట్రాము, రైలు, టాక్సీ ఎందులోనైనా వెళ్ళగలవు" అని జవాబు చెప్పే వాడు.

"మీ రోగి వెళ్ళలేడనా ?"

"అలా కాదు. ఇప్పటి అతడి పరిస్థితిలో డాక్టర్ అతడి దగ్గర ఉండటం అవసరం. బస్సుకోసం కాచుకూర్చోవటం మంచిదికాదు."

రత్న మళ్ళీ మాట్లాడకుండా ఊరుకునేది. క్రమంగా, మాట్లాడి లాభంలేదన్న సంగతీ తెలిసివచ్చింది. భర్తను అనుస రించి జీవించటానికే అలవాటు పడింది. కాని, ఒకొక్కప్పుడు 'ఇంట్లోనైనా డాక్టర్ గాకాక, భర్త సాహచర్యం కావా' లని తీవ్రంగా కాంక్షించేదామె హృదయం. కాని, అది ఆమెకు తీరని కోరికగానే మిగిలిపోయింది. డాక్టర్ భార్యగానే జీవితం సాగిపోతోంది.

ఈ విధమైన వాతావరణానికి అనుగుణంగా జీవితాన్ని దిద్దుకుని సాగిపోతున్న రత్న, అకస్మాత్తుగా లభించిన రమేశ్ స్నేహంతో అవ్యక్తమైన ఆనందాన్ని అనుభవించింది. కాని; క్రమేణా రమేష్ ప్రేమవిశ్వాసాలు పెరిగినట్లల్లా గాబరా పడ సాగింది.

తనను దేవలోకంనుండి దిగివచ్చిన దేవతలా రమేశ్ ఆరాధించటం గమనించి, రత్న మొదట పువ్వులా వికసించింది.

ఆ ఆరాధన ఎలాంటిది !

కేవలం గుడ్డి ఆరాధన. చుట్టూవున్న ప్రపంచాన్ని సౌందర్యాన్నీ విస్మరించి, కేవలం తనొక్క తెనే సజీవమూర్తిగా భావించి రమేష్ ఆరాధించటం చూసి, రత్న పులకితురాలయింది. ఈ నూతనమైన అనుభవం ఆమె యౌవన సౌందర్యాలను ద్విగుణీకరించి, వింతశోభ నిచ్చింది. కాని, ఈ రకమైన ఆరాధనవల్ల ఆరాధకునికి మంచి కలుగకపోగా, చెడు కలుగుతుందన్న భావన జాగృతమవటంతోనే, రత్న అతడినుండి దూరంగా పారిపోవటానికి ప్రయత్నించింది.

రమేష్‌మీద ఆమెకు అంతులేని ప్రీతి విశ్వాసాలున్న మాట వాస్తవమే. జీవితంలో దెబ్బతగిలి దుఃఖిస్తున్న వ్యక్తి అని, స్త్రీ సహజమైన అనుకంపం కలిగింది ఆమెకు. కాని, తన అనుకంపానికి బదులుగా అతడినుండి అపారమైన ప్రేమను నిరీక్షించలేదామె.

అతడి ప్రేమతో ఆమె సుఖి; దుఃఖి.

ఇంతటి ప్రేమను దూరం చేసుకోవడమా! ఆమెలోని స్వార్థం, తనను ప్రాణంకన్నా మిన్నగా భావించి, ప్రేమించే

రమేష్ ప్రేమను స్వీకరించి అతడిని తనవాడిగా చేసుకోమని ప్రేరేపించేది.

కాని, ఆమె హృదయం? అతడి సుఖదుఃఖాలను గురించి ఆలోచించేది. తనను ప్రేమించటంవల్ల జీవితం అతడికి ఏమాత్రం సుఖం లేదని తెలుసుకుని క్రుంగిపోయింది రత్న. రమేష్ దృష్టిని అందాలరాశి నళినివైపు తిప్పటానికి ప్రయత్నించి విఫలు రాలయింది.

తన ప్రేమ పథంలో వెనుదిరిగి రాలేనంత దూరం సాగి పోయాడు రమేష్. ఇంక 'ముందేమిటి' అనే విషయం అతడికి అగమ్యగోచరంగానే ఉండిపోయింది.

ఈ మనోవిప్లవంలో రత్న హృదయం సతమతమయి కొట్టుకుపోతోంది.

పరధ్యానంగానే ఆశను అన్నం తినిపించి పడుకోబెట్టింది. చేతిలో ఓ పుస్తకం పట్టుకొని కూర్చుంది. కాని ఆమెదృష్టి పుస్తకంమీద లేదు. ఇప్పుడు తనేంచెయ్యాలో అని ఆలోచిస్తూ కూర్చుంది.

రమేశ్ ని తననుండి దూరంగా పంపేయాలి.

క్రమంగా అతడు తన్ను మరిచిపోగలడు. ఈ విరహాన్ని భరించటం తనకు చాలా బాధను కలిగిస్తుంది. నిజం కాని, మందు చేదుగా ఉంటే మాత్రమేం, రోగికి నయం కాడటమే ముఖ్యం.

రమేష్ని పంపించేముందు కొన్ని విషయాలలో అతడి దగ్గర మాట తీసుకోవాలి. వీలయినంత త్వరలోనే ఆ మాట తీసుకోవాలి,

రమేష్ తలుపు తోసుకుని లోపలికి వచ్చాడు.

రత్న చేతిలోని పుస్తకంపట్టుకుని కలగంటోంది. రమేష్ చనువుతో ఆమె దగ్గరకువచ్చి చేతిలోని పుస్తకం లాక్కుని:

"మీ ఆలోచనలకు ఒక్క అణా ఇస్తాను" అన్నాడు.

రత్న చటుక్కున వెనక్కి జరిగి, నవ్వుతున్న అతడి కళ్ళను చూస్తూ.

"అణా! చాలా తక్కువ" అంది.

"అయితే...అయితే..." రమేష్ సందేహించాడు చెప్పటానికి.

"ఏమిటో చెప్పండి" ప్రోత్సహించింది రత్న.

"ఒక తియ్యటి ముద్దు" అన్నాడు ఇంగ్లీషులో.

రత్న ఎడమ కనుబొమ్మ కొంచెం పైకెత్తి "ఉహుఁ" అంది.

"మరేం కావాలి మీకు?"

"నేను చెప్పినట్టు చేస్తానని మాటివ్వండి."

"వీల్లేదు."

"దయచేసి..."

"క్షమించండి."

"అయితే సరే. నన్ను మాట్లాడించకండి. పుస్తకం ఇలా తెండి. నేను చదువుకోవాలి."

రమేశ్ ఇచ్చిన పుస్తకం తీసుకుని చదువుతూ కూర్చుంది రత్న. రమేశ్, రత్న మొహం చూస్తూ కూర్చున్నాడు. రమేశ్ తనవైపే తదేకంగా చూడటం గమనించి అధీరురాలయింది రత్న.

"అలా చూడకండి రమేష్!"

"ఏం?"

"నేను భరించలేను"

"రత్నా" — అన్నాడు రమేష్ బ్రతిమాలుకుంటున్నట్టు.

"ఏమిటి?"

"నాకు మీరు కావాలి."

అతడి మాట ఎంతో సరళంగా ఉంది. అతడి ధ్వని ఎంతో మధురంగా ఉంది

బడినుండి ఆకలితో ఇంటికి వచ్చిన ఆశా, "అమ్మా ఆకలేస్తుంది. అన్నం పెట్టమ్మా" అన్నంత సరళంగానే ఉంది అతడి కోర్కె.

రత్న తలెత్తి అతడివైపు చూసింది. మొదట్లో అతడి కళ్ళలో పిపాస ప్రజ్వలించటం లేదు. దానికి బదులుగా అతడి కళ్ళు ప్రేమార్ద్రతతో మెరుస్తూ ఆశతో రత్నవైపు చూస్తున్నాయి.

ఆమె సోఫాలో కూర్చున్నట్టుగానే ముందుకు వంగి, అతడి బుగ్గలను చేత్తో మృదువుగా నిమిరి, నుదుటి మీద పడ్డ జుట్టుని వెనక్కి తోసింది మాట్లాడకుండా.

రమేష్ మళ్ళీ అన్నాడు: "నాకు మీరు కావాలంటే కావాలి."

రత్న తల అడ్డంగా తిప్పింది.

"నేనంటే ప్రేమలేదా మీకు?"

ప్రేమ ఉందంటే, దాన్ని వ్యక్తపరచటానికి అదొక్కటే మార్గమా రమేశ్? మన ప్రేమ అంత హీనస్థితికి దిగజారక తప్పదా? మీ మీద నాకెంత ప్రేమ ఉందంటే, మిమ్మల్ని ఆ త్రోవలో నడిపించటానికి నా కేమాత్రం ఇష్టంలేదు. నేను తల్చుకున్నట్టయితే ఎప్పుడో మిమ్మల్ని పాడుచేసేదాన్ని. కాని. మీకు జీవితంలో సుఖంగా ఉండాలన్న కోరికుంది నాకు, అటు త్రోవలేకుండా మూసివేయలేను రమేశ్! నన్ను లోబరచకండి ప్లీజ్!"

"కాని, నాకు మీరు కావాలి రత్నా! మీరు లేని జీవితం అపూర్ణం."

"ఇప్పుడలా అనిపించినా, ముందు అన్నీ సరిపోతాయి. మీ జీవితాన్ని పంచుకునే భాగ్యశాలిని ఓరోజున వస్తుంది. నేను సతీధర్మానికి కాని, పవిత్రత గురించికాని, సంఘానికి కాని భయపడి మిమ్మల్ని నిరాకరించటంలేదు. నా దృష్టిలో వాటికి విలువే లేదు."

"అయితే..." అన్నాడు రమేశ్.

"కాని, అంతరంగానికే నేను భయపడుతున్నాను. నేను జీవించినంతకాలం నా అంతరాత్మ నన్ను వేలుపెట్టిచూపిస్తూ ఉంటే, నేను భరించలేను. మీ పవిత్రమైన జీవితాన్ని మలిన పరచలేను."

రమేష్ మాట్లాడలేదు. మెదలకుండా కూర్చున్నాడు. ఆఖరికి రత్నే పలకరించింది:

నా మాటలతో విసుగుపుట్టిందా?"

"లేదు. మీ మనోదార్ఢ్యాన్ని, చిత్తస్థైర్యాన్ని మెచ్చుకుంటున్నాను. మెప్పుతోనే మీ వైపుకు ఆకర్షింపబడుతున్నాను."

"అలా మాట్లాడకండి రమేశ్ !"

"ఏం ?"

"మీ మాటలు వినాలనే ఆశతోనే నేను మీతో వచ్చేయగలను."

రమేష్ ఉత్సాహంతో : "వచ్చేయండి. వెళ్ళిపోదాం" అన్నాడు.

"ఎక్కడికి ?"

"ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోదాం."

రత్న నవ్వుతూ అతడి గడ్డాన్ని పుణికి ;

"పదండి; భోజనానికి" అంది.

"డాక్టర్ని రానివ్వండి."

డాక్టరుకోసం వేచిఉండి లాభంలేదని తెలియలేదూ
నా."

"ఫరవాలేదు. నాకింకా ఆకలిగాలేదు" అంటూ టేబుల్ మీది మెడికల్ జర్నల్ చేతికితీసుకుని చదవసాగాడు. డయాబిటీస్ గురించి వ్రాసిన క్రొత్త ప్రయోగాన్ని గురించి వ్రాసిన వ్యాసాన్ని చదువుతూ అందులో లీనమైపోయాడు రమేశ్.

అదిచూసి రత్న మనసులో ఆశ చిగురించింది.

శేషగిరి ఇంటికి వచ్చేసరికి పదకొండు దాటింది. మెడికల్

జర్నల్‌లో మునిగిన రమేశ్‌కి గాని, నవలలో లీనమైపోయిన రత్నకు గాని పొద్దుపోయిందే తెలియలేదు.

రమేష్, రత్న ఇద్దరూ ఒకో-మూలలో పుస్తకాలు పట్టుకుని కూర్చుని ఉండటంచూసి, నవ్వువచ్చింది శేషగిరికి.

"భోంచేశావా ?" రమేశ్ వైపు చూసిఅడిగాడు.

"లేదు" అంది రత్న.

భోజనాలపుడు శేషగిరి చెప్పిన విషయం రత్న నిరీక్షించనిది.

"ఎల్లుండి బరోడా వెడుతున్నాను."

"ఎందుకూ ?"

"అక్కడ వైద్యుల సమ్మేళనం జరుగుతుంది. నా స్నేహితులంతా వెడుతున్నారు. నన్నూ రమ్మని బలవంతం చేశారు. నేను వెళ్ళిరావటానికి నాలుగయిదు రోజులు పట్టవచ్చు" అంటూ రమేష్ వైపు తిరిగి :

"నువ్వూ రావయ్యా, వెళ్లొద్దాం" అన్నాడు శేషగిరి.

"నేను వైద్యుడిని కాను."

"ఇపుడు కాకపోతే ఏం, ఎపుడయినా డాక్టరయ్యే వాడివేగా ? చాలా చోట్లనుండి డాక్టర్లు వస్తారు. ఆలోచించి చూడు."

"లేదు; నేను రాలేను. మీరు వెళ్ళిరండి. నేను మా ఊరికి వెడతాను" అన్నాడు రమేష్.

రత్న తలెత్తి రమేశ్ వైపు చూసింది.

"అపుడేనా ?" అన్నాడు శేషగిరి.

నేను ఇక్కడికివచ్చి తక్కువరోజు లయిందా యేం? రెండున్నర నెలలు కావస్తోంది. మీరు అన్నం పెడుతున్నారని నాన్న డబ్బుపంపిస్తున్నాడని ఎన్నిరోజులు ఉంటే బావుంటుంది?"

"అయితే నాదో సలహా. నేను బరోడానుంచి రాగానే నువ్వు వెళ్ళిపోదువుగాని. ఏమంటావ్?"

రమేష్ భయమూ అదే శేషగిరి లేనప్పుడు తనేమైనా అనుచితమైన పనిచేస్తే? ఆ భయంతోనే తన ప్రయాణం సంగతి ముందుగానే చెప్పాడు.

కాని, ఇప్పుడు శేషగిరి మాటలకు ఏంచెప్పాలో తెలియ లేదతనికి. అతడింకా ఆలోచిస్తూండగానే రత్న శాంతమైన ధ్వనితో.

"అలాగే లెండి. మీరొచ్చాకనే రమేశ్ వెడతాడు" అంది.

రమేశ్ ప్రశ్నార్థకంగా రత్నవైపుచూశాడు. కాని, రత్న మొహం అటువైపు ఉంది.

మర్నాడంతా శేషగిరి ప్రయాణపు హడావిడి. ప్రతి పని లోనూ క్రమం తప్పరాదు. అంతా నీటుగా ఉండాలనే మన స్తత్వం అతడిది. బరోడాలో ఉండేది నాలుగురోజులే అయినా, బట్టలు మాత్రం కొంచెం ఎక్కువగానే సర్దుకున్నాడు.

శేషగిరి స్నేహితులతో కలిసి రాత్రి రైలులో ప్రయాణంచేశాడు. వెళ్ళేముందు ఆశ, తండ్రి దగ్గరకొచ్చి:

"నాన్నా గొంతులో నొప్పిగాఉంది" అంది.

శేషగిరి వెంటనే చేతిలోని సంచి కిందపెట్టి టార్చి తెచ్చి పరీక్షించి టచ్ చేశాడు.

"ఆశకు గొంతు నొప్పిగా ఉందట" అంటూ రత్నవైపు ఆరాటంతో చూశాడు.

"ఫరవా లేదు, తనకు అప్పుడప్పుడూ అలాగే అవుతూంటుంది. మీరెందుకు కంగారు పడతారు? నేనున్నాను; రమేశ్ ఉన్నారు. చూసుకుంటాం" అని ధైర్యం చెప్పింది.

రమేష్, శేషగిరితో వి. టి. కి వెళ్ళి వీడ్కోలిచ్చి వచ్చాడు.

డాక్టర్ శేషగిరి ట్రైనులో కదిలేముందు:

"ఆశకు పెరుగు వెయ్యవద్దని రత్నతో చెప్పు" అన్నాడు.

రమేష్ ఇంటికి వచ్చేసరికి రత్న ఆశను పడుకోబెడుతోంది. ఆశ గొంతు నొప్పిగా ఉందని మూలుగుతూ ఉంది.

రమేష్‌కి కొంచెం కంగారుగానే ఉంది.

తను ఆఖరి సంవత్సరం చదువుతున్న మెడికల్ విద్యార్థి అని శేషగిరికి, రత్నకు తనంటే నమ్మకం.

కాని, రమేశుడికి తనపై తనకే నమ్మకం లేదు.

రమేష్ రత్నతో:

"శేషగిరి వెళ్ళకుండా ఉంటేనే బావుండేది" అన్నాడు. అతడి కంఠంలోని ఆరాటాన్ని గుర్తించి రత్న:

"మీరెందుకలా భయపడతారు? డాక్టరయ్యే మీరే అలా భయపడితే, రోగుల గతేంకావాలి?" ఆశకు అప్పుడప్పుడు ఇలాగే అవుతూంటుంది. ఫరవా లేదు" అంది శాంతంగా.

రత్న శాంతస్వరం రమేశ్ కలవరాన్ని కొంచెం తగ్గించింది.

రమేష్ తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. కాని, ఆశను గురించిన ఆలోచనతో అతనికి నిద్రపట్టలా. తల్లీ కూతుర్ని కూడా తనెంతగా ప్రేమిస్తున్నాడో ఇప్పుడే తెలిసి వచ్చిందతనికి. రత్నకు చెందిన ప్రతీ వస్తువుపైనా ప్రేమ విశ్వాసాలు పెంచుకున్నాడు తను. రత్న తన కూతుర్ని ఎంతగానో ప్రేమిస్తుందని తెలుసు అతనికి. అప్పుడంతా ఆశే తన ప్రతిస్పర్థి అని అసూయపడ్డాడు. కాని రత్న కూతుర్ని తను ఎంతగా ప్రేమిస్తున్నాడో ఇప్పుడే తెలుసుకుంటున్నాడు.

ఈ ఆలోచనలతో అతనికి రాత్రంతా సరిగా నిద్రపట్ట లేదు.

ఆశకు ఎలా ఉందోనని రెండు మూడుసార్లు లేచివచ్చి చూసి వెళ్ళాడు.

# 11

తల్లీ కూతుళ్ళిద్దరూ హాయిగా నిద్రపోతూండటం గమనించి తను హాయిగా నిద్రపోయాడు.

ఉదయం రమేష్ లేచేసరికే, రత్న లేచి ఇంటి పనులు చేసుకుంటోంది. రమేష్ లేవగానే ఆశ దగ్గరకు వెళ్ళి కూర్చు న్నాడు. ఆశ కళ్ళు మూసుకుని పడుకుంది. రమేష్ చెయ్యి సహా

జంగానే నుదుటిమీదకు వెళ్ళింది. వెంటనే గాబరాగా రత్న దగ్గరకు వెళ్ళి:

"ఆశకు జ్వరం వచ్చింది" అన్నాడు.

"అలాగా?"

"ఊఁ. ఎవర్నైనా డాక్టర్ని తీసుకొస్తాను."

రత్న కొంచెం నవ్వి, హేళనగా:

"డాక్టరా? ఎందుకు? ఈ మాత్రం గొంతునొప్పి, జ్వరాలకు మీరు మందివ్వలేరా?" అంది.

"వద్దు రత్నా! నన్ను పరీక్షించకండి. నేనో పనికిమాలిన వాడిని."

రత్న అలక్ష్యంతో అటు తిరిగి "సరే; అయితే ఆశకు ఇంకో డాక్టర్ అవసరమూ లేదు" అంది.

"రత్నా... ప్లీజ్..."

"మీరు చికిత్స చేసేటట్టయితే చెయ్యండి. లేదంటే దాని కర్మ ఎలా ఉంటే అలా అవుతుంది."

"నేను వెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను" అన్నాడు రమేష్ మొండిగా.

"మీకంత ధైర్యం ఉంటే తీసుకురండి చూద్దాం" అంది రత్న ఇంకా మొండిగా.

"రత్నా! నన్ను ధర్మసంకటంలో పడేయకండి" రమేష్ బ్రతిమాలుకున్నాడు.

"ఇపుడు ధర్మసంకటంలో పడింది మీరు కాదు. నేను. నా ఆశకు మీరే చికిత్స చెయ్యాలని నాకోరిక. మీమీద నాకున్నంత నమ్మకం, ఇంకే డాక్టర్ మీదా లేదు."

"రత్నా..." అంటూ ఆమె భుజాన్ని పట్టుకొన్నాడు రమేష్.

"అమ్మా..." అంటూ కళ్ళు తెరిచింది ఆశా. నేరం చేసినవాడిలా దూరంగా జరిగాడు రమేశ్.

రత్న రమేశునిని మందుల బీరువా ముందు నిలబెట్టి ప్రశ్నార్థకంగా అతడివైపు చూసింది.

రమేశ్ దీనంగా ఆమెవైపు చూస్తూ:

"నన్నిలా బంధించకండి" అన్నాడు.

రత్న బదులు చెప్పలేదు.

రమేశ్ కళ్ళు యాంత్రికంగా బాటిల్స్‌మీది పేర్లు చదవసాగాయి. అతని చేతులు కొయ్యచేతుల్లా, నిర్జీవంగా అయి, ఏదో అదృశ్యశక్తి ప్రేరేపణతో ముందుకు వెళ్ళి ఓ మందుసీసా అందుకుని ఇంకో మందున్న దానితో కలిసాయి.

రెండు మందులూ బాగా కలిపి ఔన్స్ గ్లాసులో పోసుకుని ఆశ దగ్గరకొచ్చాడు రమేశ్.

"నోరు తెరు ఆశా! మందు తాగుదువుగాని" అన్నాడు.

జ్వర తీవ్రతతో కళ్లు మూసుకున్న ఆశా కళ్ళు తెరిచింది.

ఆశ కళ్ళలో ఆశ్చర్యం కనిపిస్తోంది:

"మామయ్యా! నువ్వు డాక్టరేనా?"

ఏం బదులు చెప్పాలో తెలియలేదు రమేశ్‌కి. అతడి అవస్థ గమనించి రత్న.

"అవునమ్మా, డాక్టరవుతాడు" అంది.

"అయితే మామయ్యా! తొందరగా ఓ ఇంజక్షన్ ఇచ్చి గొంతునొప్పి నయం చేసేయ్. రేపే నేను బడికి వెళ్ళొచ్చు".

ఆశ మాటలతో రమేశ్ హృదయం కెలికినట్టయింది. అతడు రత్నవైపు తిరిగాడు తృప్తి, సంతోష విజయాలతో ఆమె మొహం వెలిగిపోతోంది.

ఓటమితో రమేష్ కళ్ళు చెమర్చాయి. అక్కడ కూర్చోలేక లేచి వెళ్ళిపోయాడు.

రత్న ఆశకు మందు తాగించి పడుకోబెట్టి రమేష్ దగ్గరకొచ్చింది.

రమేశ్ తలవంచుకుని కూర్చున్నాడు. రత్న అతనిదగ్గర నిలుచుని ఆప్యాయతతో అతనివైపు చూసింది. ఆమె మృదువైన చేతివేళ్ళ అతని ఉంగరాల జుత్తుల్లో ఆడుకున్నాయి.

"రమేశ్..."

"ఏమిటి ?"

"నావైపు చూసి చెప్పండి మీ కెందుకింత వ్యథ ?"

"ఈ జన్మలో ఇహ ఎవ్వరికీ మందివ్వకూడదను కున్నాను ఎప్పుడైతే వదినను బ్రతికించుకోలేక పోయానో, అప్పుడే డాక్టర్ వృత్తికి నీళ్ళు వదులుకున్నాను. కాని, ఈరోజు మీ తల్లీ కూతుళ్లు కలిసి నా నిశ్చయాన్ని సడలింప జేశారు. నా జీవితంలో ఇదొక ఓటమి."

"ఓటమి! తప్పుగా తెలుసుకున్నారు మీరు. ఇదే మీ గెలుపు రమేశ్! ఏదో గుడ్డినమ్మకంతో మీ జీవితాన్నే పాడు చేసుకుంటున్నారు. జలుబు చేసిందని ముక్కు తెగ్గోట్టుకున్న

ట్టుంది మీ స్థితి చావు బ్రతుకులు ఎవరి ఆధీనం ? పుట్టిన వాళ్ళంతా ఎప్పుడో ఒకరోజు చావాల్సిందేగదా ?''

"కాని వదిన ఎంత చిన్న వయస్సులో చనిపోయింది! ఆమె జబ్బుకు ఎన్నిరకాల చికిత్సలు చేశాం. ఏదీ నయం చెయ్యలేక పోయింది. మరి ఈ చికిత్స అంతా ఎందుకు ? నేను నయం చేస్తాను; నేను బ్రతికిస్తాను అనేమాట అబద్ధం. అందుకే నాలో నమ్మకం లేదు."

"మానవ శక్తిని మించింది మరొకటుంది. దాన్నే 'దేవుడు', శక్తి, 'విధి' అని ఏ పేరుతోనైనా పిలువవచ్చు. మన ప్రయత్నం మనం చేస్తే ఆత్మతృప్తి కలుగుతుంది. ముఖ్యంగా ఆయుస్సుతీరి, శాంత చనిపోయింది. ముళ్ళు గుచ్చు కుంటాయని గులాబి చెట్టునుండి దూరంగా వెళ్ళిపోతారా ఎవరైనా?''

"నేను వెళ్ళిపోతాను. జీవితంనుండే దూరంగా వెళ్ళి పోతాను.

"దీన్నే పిరికితనం అంటారు. రమేశ్ ! మీరీరోజునుండి కొత్త జీవితం ప్రారంభించాలి. మీ ఊరికి వెళ్ళి చదువు పూర్తి చేసి డాక్టరుగా స్థిరపడండి. మనిషిగా జీవితాన్ని ఎదిరించండి. పిరికిపందలా పారిపోకండి."

రమేష్ బదులు చెప్పకుండా జోలపాట వింటున్న పసి పాపలా కూర్చున్నాడు.

"ఆశ తండ్రి వచ్చేదాకా ఆశను చూసుకునే బాధ్యత మీది" అంటూ తనమాట ముగించింది రత్న.

రమేష్ ఆ పూటల్లా ఆశ దగ్గర్నుండి కదలలేదు. ప్రక్క మీద పడుకుని బాధపడుతున్న ఆ పిల్లకు ఎన్నోరకాల కథలను చెప్పి నవ్వించాడు. ఒక్క నిమిషంకూడా విసుగు చెందకుండా కూర్చున్నాడు. కాని, అతడి కళ్ళు ఎక్కువగా మాట్లాడకుండా తనపనులు చేసుకుంటున్న రత్నను వెంటాడుతున్నాయి.

రత్న తన పనులన్నీ ముగించుకుని వచ్చి:

"నేను ఆశ దగ్గరుంటాను. మీరు అలా తిరిగిరండి" అంది.

"ఉహుం. నే నెక్కడికీ వెళ్ళను" అన్నాడు రమేష్. ఆశ అది విని "అమ్మా, మామయ్య చాలా మంచివారమ్మా" అంది.

ఇంకాస్సేపటిలో రత్న స్నేహితురాళ్ళ గుంపొకటి లోప లికి ప్రవేసించటంతో, రమేష్ అక్కడనుంచి లేచి బయటకు వెళ్ళాడు.

మాతుంగా మార్కెట్, గాంధీమార్కెట్టు చుట్టుకుని రమేష్ వచ్చేసరికి రత్న స్నేహితురాళ్ళెవరూ లేరు.

రమేష్ ఆశ దగ్గర కూర్చుని "ఎలా ఉందమ్మా" అనడి గాడు.

"నొప్పి ఎక్కువగా ఉంది మామయ్యా, నీరు మింగటాని క్కూడా వీలు కావటంలేదు."

"తెల్లవారే సరికి అన్నీ సరిపోతాయ్" అంటూ ధైర్యం చెప్పాడు రమేశ్.

కూతురికి గ్లాసులో పాలు తెచ్చిన రత్న: "రేపు నా స్నేహితురాలి చెల్లెలి పెళ్ళి నన్ను తప్పకుండా రమ్మంది" అంది.

"ఇంట్లో అమ్మాయికి వంట్లో బాగా లేనప్పుడు మీ రెలా వెడతారు?" అన్నాడు రమేశ్.

"మీరుండగా నాకేం భయం? ఆశను మీకు అప్పజెప్పి నేను నిశ్చింతగా వెళ్ళగలను" అంది రత్న చిలిపిగా.

"వద్దు రత్నా నేను అయోగ్యుడిని. నా కప్పజెప్పకండి."

రత్న చిరునవ్వునవ్వి అతడిమాట అనునయంగా తిరస్క-రించింది.

మరునటిరోజు ఎనిమిది గంటలకల్లా పెళ్ళికి వెళ్ళటానికి సిద్ధమయింది రత్న. ఆమె వెళ్ళకుండా ఆపలేకపోయాడు రమేష్. నిస్సహాయుడై కూర్చుండిపోయాడు.

రత్న పట్టుచీర కట్టుకుని కూతురి దగ్గరకొచ్చి:

"వెళ్ళిరానా ఆశా" అంది.

"వెళ్ళమ్మా, మామయ్య ఉంటారుగా" అంది ఆశా.

రత్న రమేష్‌తో:

"వెడుతున్నాను. ఫ్లాస్కులో వేడిపాలున్నయ్. ఆశకు కావాలంటే ఇవ్వండి. సాయంత్రం నాలుగింటికి వచ్చేస్తాను" అంది.

రమేశ్ భయపడుతూ ఆమె చెయ్యి పట్టుకుని:

"నాకు భయమేస్తోంది" అన్నాడు.

"మీకు ధైర్యం కలగాలనే నేను వెడుతున్నాను. త్వర గానే వచ్చేస్తాను. వెళ్ళనా?"

రత్న అతడి చేతిలోని తన చేతిని నెమ్మదిగా విడిపించు కుంది.

పెళ్ళిభోజనం అదీ ముగించుకుని రత్న వచ్చేసరికి సాయంత్రం ఐదయింది, సంతోష సమారంభంలో పాల్గొని వచ్చినందువల్ల గాబోలు రత్న మొహంలో ఆనందచ్ఛాయలు విల్లివిరుస్తున్నాయి. ఏదో పాటను మెల్లిగా గొణుక్కుంటూ మెట్లెక్కింది.

తలుపు దగ్గర నళిని ముళ్ళమీదున్నట్టు నిలబడి ఉంది రత్నను చూడగానే తలుపుకు తాళంవేసి, రత్న చెయ్యి పట్టు కుని కిందకు దిగుతూ:

"రత్నా! ముందు పద. దోవలో అంతా చెబుతాను, కంగారు పడకు" అంది.

రత్న కళ్ళు పెద్దవయ్యాయి:

"ఏం జరిగింది?"

"ఆశకు 'డిఫ్తీరియా' అయిందట. ఉదయం నువ్వు పెళ్ళికి వెళ్ళగానే, ఆశా చాలా బాధ పడిందట..."

ఆత్రంగా వింటోంది రత్న.

"ఏయ్ ట్యాక్సీ..." అని ట్యాక్సీని పిలిచింది నళిని. టాక్సీ రాగానే రత్నను లోపలికి తోసి, తనూ కూర్చుని.

"జె. జె. హాస్పిటల్" అంది.

రత్న మాట్లాడే శక్తి కోల్పోయి స్తబ్దంగా కూర్చుండి పోయింది.

"రమేష్‌కు అనుమానం వచ్చి ఆశను పరీక్షించి డిఫ్తీ రియా అని నిర్ధారించి ఒక ఇంజక్షన్ ఇచ్చి హాస్పిటల్‌కు తీసు కుని వెళ్ళి అడ్మిట్ చేశారట. హాస్పిటల్‌నుండే నాకు ఫోన్ చేశారు: 'రత్న పెళ్ళినుండి రాగానే అక్కడికి తీసుకుని రమ్మని.

అప్పటినుంచి ఇక్కడ నిలబడి నీకోసం చూస్తున్నాను. నువ్వెక్క-డికి వెళ్ళావో కూడా నాకు తెలీదాయె. తెలుసుంటే అక్కడి కైనా వచ్చేదాన్ని."

"ఆశ కెలా ఉందట" రత్న అడిగింది.

"ఇప్పుడే అయిదు నిముషాల క్రితం ఫోన్ చేసి కనుక్కున్నాను వెంటనే ఆపరేషను చేశారట. ఇంకా తెలివి రాలేదు కాని, మామూలుగానే వూపిరి పీలుస్తోందని చెప్పారు రమేశ్. ఏం కంగారు పడకు."

టాక్సీ హాస్పిటల్ ముందు ఆగింది. రత్న నళినిని అనుస రించింది. నర్సులనడిగి ఆశా ఉన్న వార్డు కనుకున్నారు.

నళిని, రత్న చప్పుడు చేయకుండా మెల్లిగా నడిచి వెళ్ళారు లోపలికి.

ఆశ మంచం దగ్గర తలవంచుకుని కూర్చున్నాడు రమేష్. అడుగుల చప్పుడు విని లేచి రత్న దగ్గరకు వచ్చి మృదువుగా:

మీ ఆశను మీకు అప్పచెబుతున్నాను" అనేసి అవ తలకు వెళ్ళిపోయాడు.

రత్న కుర్చీమీద కూర్చుని ఆశ చిన్న చేతిని తన చేతి లోకి తీసుకుంది. నళిని రత్న వెనుక నిలబడింది.

సాయంత్రం రౌండ్‌కు వచ్చిన డాక్టర్ని నళిని:

"ఏ భయం లేదా డాక్టర్" అని అడిగింది.

"లేదు. ఈ అమ్మాయిని తెచ్చి ఆడ్మిట్ చేసిన అబ్బాయి చాలా బుద్ధిమంతుడు. ఇంట్లో చేయాలిసిన చికిత్స తనే చేసి తీసుకొచ్చాడు గనుకనే బ్రతికింది పాప. తగిన సమయంలో చికిత్స దొరకటం మీ అదృష్టం."

"అయితే ఇంకేం భయం లేదన్నమాట" అంది నళిని మళ్ళీ.

"భయమేమీలేదు. తప్పకుండా నయమవుతుంది. కాని, ఇంకా నాలుగురోజులు ఇక్కడే ఉండాలి" అని చెప్పి వెళ్ళిపోయాడు డాక్టర్.

రత్న లేచి నిల్చుని "నళినీ! నువ్విక్కడే ఉండు. నేను రమేశ్ ఇక్కడే ఎక్కడైనా ఉన్నారేమో చూసి వస్తాను" అంది.

నళిని మంచం దగ్గర కూర్చుంది.

కాస్సేపట్లో రత్న వెనక్కి వచ్చింది.

"రమేశ్ ఏరి?" అని అడిగింది నళిని.

"ఎక్కడా కనిపించలేదు. ఉదయం భోంచేశారో లేదో కూడా తెలీదు.

నళిని మాట్లాడలేదు.

కాస్సేపు వూరుకుని నళిని " నేనిక వెడతాను, రాత్రికి నువ్విక్కడే ఉంటావా?" అని అడిగింది.

"ఊఁ."

"అయితే నీకు పక్కఅదీ తెచ్చిస్తాను. ఇహ వెళ్ళనా" అని రత్నతో చెప్పి వెళ్ళిపోయింది నళిని.

మృత్యు కుహరంలోనుండి బయటపడిన ఆశా కళా విహీనమయిన మొహాన్ని చూస్తూ రమేష్‌ని గురించి ఆలోచిస్తూ కూర్చుంది రత్న.

రాత్రి తొమ్మిదింటికి నళిని దుప్పటీ అదీ తీసుకుని మళ్ళీ వచ్చింది.

"రమేశ్ ఇంట్లో ఉన్నారా?" ఆత్రుతతో అడిగింది రత్న.

"లేరు. ఇక్కడికి రాలేదా?"

"లేదు."

"ఇప్పుడొస్తారేమో. నీకు అన్నం తెచ్చాను. భోంచేద్దువుగాని లే."

"వద్దు నళినీ. పెళ్ళిభోజనం ఇంకా అరగలేదు నాకు."

"కొంచెం తిను..." నళిని బలవంతం చేసింది.

"వద్దు క్యారియర్ ఇక్కడే ఉండనీ; కావాలంటే తింటాను."

నళిని క్యారియర్ బల్లమీద పెట్టి ఉదయం వస్తానని చెప్పి వెళ్ళిపోయింది.

రాత్రి పది దాటాక వార్డులోకి అడుగుపెట్టాడు రమేష్ రత్న తదేకంగా ఆశనేచూస్తూ కూర్చుంది.

రమేష్ మాట్లాడకుండా వెళ్ళి ఆశ చెయ్యిపట్టుకుని నాడి చూశాడు. ఆశ మెల్లిగా, హాయిగా ఊపిరి పీలుస్తూ ఉండటాన్ని గమనించి అతడి హృదయం తేలికపడింది.

రత్న అతడినే పరీక్షగా చూస్తూఉంది.

"రమేశ్ !"

"ఏమిటి ?"

"ఆశకు తప్పకుండా నయమవుతుందని చెప్పారు డాక్టర్"

రమేష్ మాట్లాడలేదు.

"ఇకనైనా భోంచెయ్యండి."

"నేను భోంచేయలేదని మీ కెవరు చెప్పారు ?"

"మీ మొహమే చెపుతోంది."

"నాకు ఆకలిగా లేదు."

"ఉదయంనుండి కాఫీ, టిఫిన్, భోజనం ఏమీ తీసుకో లేదు; అయినా ఆకలిగా లేదా ?"

"లేదు."

"నా కోసం కొంచెం తినండి."

"వద్దు."

"నేనే తినిపిస్తాను" అంటూ నళిని తెచ్చిన క్యారియర్ మూతతీసి కలిపిన అన్నాన్ని స్పూనుతో అతడిచేత తినిపించ సాగింది.

రమేష్ తృప్తిగా తిన్నాడు. అతడి భోజనం అయ్యాక రత్న :

"మీరు ఇంటికి వెళ్ళి పడుకోండి. నేను ఇక్కడఉంటాను" అంది.

ఉహుం నేనూ ఇక్కడే ఉంటాను."

"పక్క అదీ ఏమీ లేదు. మీరెలా పడుకుంటారు ?"

"మీరేం చేస్తారు ?"

"నళిని నాకు దుప్పటి తెచ్చింది."

"సరే; మీరు పడుకోండి."

"మరి మీరో ?"

"నేను కుర్చీమీద కూర్చుని, మిమ్మల్నీ, మీ కూతుర్నీ చూస్తూ రాత్రి గడిపేస్తాను."

"ఉదయంనుండి తిరిగి, అలిసిపోయారు. ఇప్పుడైనా కాస్త విశ్రాంతి తీసుకోండి."

"మిమ్మల్ని చూస్తూ కూర్చోవటం కన్నా నాకు వేరే విశ్రాంతి అక్కర్లేదు."

"అలా చూడదగినంత అందగత్తెను కాను నేను."

"ఫరవాలేదు; ఈ రోజు నన్ను బలవంత పెట్టకండి" అన్నాడు రమేశ్.

రత్న పడుకుంది. రమేశ్ ఆ తల్లీ కూతుళ్ళనుచూస్తూ ఆ రాత్రంతా గడిపాడు.

ఏ జన్మజన్మాల అనుభంధమో ఇది! తను ఎన్నడూ చూసి ఎరుగని స్త్రీ రత్న. ఏదో కారణంవల్ల తను కొన్ని రోజులువాళ్ళింట్లో ఉండాల్సివచ్చింది. కాని, అంతలో నేస్నేహపు వేరు తన హృదయంలోకి అంత లోతుగాదిగిపోగలదనిఎన్నడూ ఊహించనైనా ఊహించలేదు.

అంతా తెలిసికూడా రత్న స్నేహబంధాన్నుండి తప్పించుకోలేకపోయాడు రమేష్. తమ స్నేహంవల్ల ఏ విధమైన ఉపయోగమూ లేదని ఇరువురికి తెలుసు. ఆ స్నేహాన్ని పెంచుకోవటంవల్ల ఇద్దరికీ సుఖం లేదన్న విషయం తెలిసీ కూడా ఆ అనుబంధాన్ని తెంచుకోలేక పోయారు.

రత్ననుండి దూరంగా వెళ్ళాలన్న ఆలోచనే రమేష్ హృదయాన్ని భయభ్రాంతం చేస్తోంది. ఆ విరహం భరించరానిదిగా అనిపించిందతనికి.

ఆ ఆలోచనరాగానే బెదరిపోయేవాడు రమేశ్. రత్నను చూడకుండా, ఆమెతో మాట్లాడకుండా తను ఉండగలడా?

ప్రేమ తామర పుష్పపు వేరులా బలమైనది. ఆ వేళ్ళ సమూహపు చేతికి చిక్కిన మనిషి, ఆ వలనుండి తప్పించుకు

పోదామని ప్రయత్నించిన కొలదీ, ఆ వేరు అతడిని బంధించి బురదలోకి లాగేసినట్టు, రమేశ్ అనురాగపు స్వచ్ఛమైన సరోవరంలోకి అడుగుపెట్టి, దాని రుద్రాలింగనానికి లోనై వివశుడై పోయాడు.

మర్నాడు నళిని వచ్చేసరికి రమేశ్ కుర్చీలోనే నిద్రిస్తున్నాడు. రత్న నిద్రలేచి ఆశదగ్గర కూర్చుని ఉంది. ఆశ కళ్ళు తెరచి నళినివైపు చూసింది. నళిని అందం, అలంకారంచూసి ఆశ కళ్లు పెద్దవయ్యాయి. మాట్లాడకుండా నళినివైపుచూసి నవ్వింది.

రెండురోజుల తరువాత బరోడానుండి తిరిగివచ్చిన శేషగిరికి కూతురి అనారోగ్యం సంగతి తెలిసి గాబరాగా హాస్పిటల్‌కు పరుగెత్తుకొచ్చాడు.

ఆశకు జబ్బు నయమవుతూండటంచూసి అతడి మనసు తేలికపడింది. ఆశను ఇంటికి తీసుకుని వెళ్ళేదాకా ఆశ పక్కనుండి కదల్లేదు శేషగిరి.

వారంరోజుల తర్వాత ఆశ ఇంటికి వచ్చింది. రత్న కూతుర్ని మళ్ళీ పొందినట్టుగా సంబరపడింది. ఆ సంబరంలోని సంతోషాన్ని మనఃపూర్వకంగా అనుభవించాడు రమేశ్.

ఆశ ఇంటికి వచ్చిన మర్నాడు రమేష్ మళ్ళీ తన ప్రయాణం విషయం ఎత్తాడు.

"ఇప్పుడైనా నా నాకు ఊరికి వెళ్ళటానికి అనుమతినివ్వండి" అన్నాడు ఆ దంపతుల మొహంచూసి.

రత్న శేషగిరినే మాట్లాడనిచ్చి తాను తప్పుకుంది.

"అలాగే. ఇంకో సంవత్సరం చదువు పూర్తిచేసేయ్. తరువాత ఇక్కడికే వచ్చేద్దువుగాని. ఇద్దరం కలిసి ప్రాక్టీసు చేద్దాం. నేనూ కృష్ణమూర్తికి ఉత్తరం రాస్తాను. అయినా ముందు నీ చదువు పూర్తికానీ, ఇప్పటినుండి ఆ విషయం మెంచుకులే" అన్నాడు శేషగిరి.

"చదువు పూర్తి చేస్తాను. అదిమట్టుకు నిర్ణయించుకొన్నాను" అంటూ రత్న వైపు చూశాడు రమేశ్.

ఆమె తలెత్తి రమేష్ వైపు చూసింది. శేషగిరి అక్కడ లేకపోతే, ఆ మాట అన్నందుకు ఏం బహుమతి ఇచ్చేదో రత్నకు మాత్రమే తెలుసు.

ఒక్కక్షణం ఆమె కళ్ళలో మెరుపు మెరిసింది. హృదయంలోని సంతోషమంతా ఆమె మొహంలోనే ప్రతిబింబించింది.

ఆమెకు తను ఆ మాట అని ఎంత ఆనందాన్ని కలుగచేశాడో రమేశ్ కొలవలేకపోయాడు.

"కాని, ఇక్కడ ప్రాక్టీసు చెయ్యను" రమేశ్ అన్నాడు.

రత్న మౌనంగా నిట్టూర్చింది.

"ఎందుకయ్యా! బొంబాయంటే అప్పుడే విసుగు పుట్టిందా?"

"అలా కాదు. నేను ప్రైవేటు ప్రాక్టీసు పెడితే దగ్గు, జ్వరం ఇలాంటి జబ్బులకే మందివ్వగలను. సర్జన్ కావాలని నాకు చాలా రోజులుగా ఓ కోర్కె ఉంది. సర్జన్ అయి, కొత్త ప్రయోగాలు చేసి, కొత్త మందులను కనిపెట్టాలని ఉంది."

శేషగిరి సంతోషంతో పొంగిపోయాడు. గర్వంతో రత్నవైపు తిరిగి;

"చూశావా, రత్నా! మా కృష్ణమూర్తి తమ్ముడు ఎలా తయారవుతున్నాడో?" అన్నాడు.

మాటలకు అందని సంతోషాన్ని హృదయంలో నింపుకున్న రత్న మౌనం దాల్చింది.

మర్నాడురాత్రే రమేశుని ప్రయాణం నిశ్చయమయింది. ముందే టికెట్ రిజర్వు చేయించుకున్నాడు.

తల్లి-సమయాన్నంతా తననుండి లాక్కున్న రమేశు మీద మొదట్లో ఆశకు స్నేహభావం కలుగలేదు. కాని క్రమేణా పరిచయమూ, స్నేహమూ పెంపొందాయి వారిద్దరిమధ్యా.

ఆఖరి సాయంత్రం రత్నతో కలిసి జుహుబీచికి వెళ్ళాలని కోరుకున్నాడు రమేశ్.

సంధ్య స్వర్ణకాంతి కిరణాలు నీలసముద్రపు కెరటాల మీద ఆడుకుంటున్నాయి. ఆ కిరణాల ఆటలను చూసి సముద్రుడు నవ్వుతున్నాడేమో అన్నట్టు, కెరటాలు తెల్లటి నురుగును నింపుకుని నవ్వుల్ని పువ్వుల్ని విరజిమ్మి మళ్ళీ వెనక్కి వెళ్ళిపోతున్నాయి.

"రత్నా! మీతో గడిపే ఆఖరి సాయంత్రం ఇది" అన్నాడు రమేష్.

"మీరలా మాట్లాడకండి రమేశ్! నాకు ఏడుపు వస్తోంది."

"మీ మనసు చాలా గట్టిదనుకున్నాను. ఆఖరిరోజున ఇలా బెంబేలు పడపోతారేం?"

రత్న నిస్సహాయంగా;

"మనం ఎవరితోనూ స్నేహ బాంధవ్యాలు పెంచుకో రాదు రమేష్! మీనుండి దూరంగా ఉండాలని ఎంతో ప్రయత్నించాను. వీలుపడలేదు. ఈ స్నేహమూవద్దూ, ఈ విరహమూవద్దు. ఏదీ లేకుండా ఉంటేనే మనసుకు హాయిగా ఉంటుందేమో అనిపిస్తోంది" అంది.

"మీరు ఏమేమో మాట్లాడకండి. తరువాత నేను బొంబాయి వదలి వెళ్ళనే వెళ్ళను. డాక్టర్ నన్ను ఇక్కడకే రమ్మని ఆహ్వానించినపుడు వచ్చేద్దామా అనుకున్నాను. కాని, మనిద్దరం ఒకచోట ఉండటం ఇద్దరి శ్రేయస్సు దృష్ట్యా మంచిది కాదని నిర్ధారించాను."

"అదే మంచిది. మీరు చదువు పూర్తిచేసి డాక్టరవాలని నిశ్చయించుకున్నారని తెలిసి నేనెంత సంతోషపడ్డానో తెలుసా?"

"ఎంత ?"

"ఇక్కడకాదు. ఇంట్లో చూపుతాను..." అంటూ చుట్టూ చూసింది రత్న.

"తరువాత మాట తప్పకూడదు !"

"లేదు; అకస్మాత్తుగా మీ రలా అనగానే నా కెంత ఆశ్చర్యం, సంతోషం కలిగిందనీ!"

"ఆశకు సీరియస్‌గా ఉన్నపుడు నా కనిపించింది—నేను చదువు పూర్తి చేయకపోవటం శుద్ధ తప్పని. తన జబ్బేమిటి అని ముందుగానే నేను "డయాగ్నస్" చెయ్యగలిగాను. దానితో నామీద నాకు నమ్మకం కలిగింది."

"ఆశ రెండురోజులు జబ్బుపడినా బాధలేదు. కాని ఆ కారణంగా మీ నిశ్చయాన్ని మీరు మార్చుకున్నారు రమేశ్! నాకు వాగ్దానం చేస్తారా?"

"ఏమని?"

"డాక్టరై ప్రజాసేవ చేస్తానని, మరి..."

"ఊఁ, చెప్పండి."

"మీరు డాక్టరయ్యాక తప్పకుండా పెళ్ళి చేసుకోవాలి. దయచేసి నా కోర్కెను మన్నించండి. ఈ రెండు విషయాలకు మీరు వాగ్దానం చేస్తే నేను నిశ్చింతగా ఉండగలుగుతాను."

"మొదటిదానికి వాగ్దానం చెయ్యగలను; రెండవదాని విషయమే కాస్త ఆలోచించాలి."

"ఇందులో ఆలోచించడానికేముంది? ఆలోచించాల్సినంత గహనమైన విషయం కాదే! పెళ్ళికి ముందు ప్రతి అబ్బాయి, అమ్మాయి కాబోయే సహచరుల గురించి ఎన్నో కలలు కంటారు. మనసు చంచలంగా, నిలకడ లేకుండా ఎగిరే సీతాకోక చిలుకలా ఉంటుందపుడు. పెళ్ళయ్యాక మనసు ఒక స్థిమితాన్ని పొందుతుంది. వెనుకటి సంగతులన్నీ క్షుద్ర చేష్టలుగా అనిపిస్తాయి..."

రమేశ్ మధ్యలోనే ఆపి :

"నేను దేనికయితే చాలా ప్రాధాన్యత నిస్తానో, దాన్నే అంత తేలిగ్గా తీసిపారేస్తారేం? ఆఖరి రోజు — దయచేసి నా మనసు నొప్పించకండి."

"మీ మనస్సును నొప్పించాలని నేనీ మాటలనడం లేదు రమేష్! అనురాగానికి మీరిచ్చే విలువను సహించలేకుండా

ఉన్నాను నేను. మట్టికి బంగారానికిచ్చినంత విలువ ఇస్తున్నారా? నిజం చెప్పాలంటే ప్రేమలో నమ్మకం లేదు నాకు."

"రత్నా! ఏమంటున్నావు మీరు?"

"ఉన్నమాటే అంటున్నాను. ప్రేమకు నిలకడ లేదు. చిర కాలం నిలిచేది కాదు. పువ్వునుంచి పువ్వుకు ఎగిరే భ్రమరానికీ, ప్రేమకూ పెద్ద తేడా ఏమీ లేదు. క్షణికంగా మనసుకు భ్రాంతి గొలిపే హృదయ దౌర్బల్యానికే ప్రేమ అంటారు. అంతే!"

"మీరు ఇదే విధంగా మాట్లాడుతూ ఉంటే నేను వెళ్ళిపోతాను" అంటూ లేచి నిల్చున్నాడు రమేష్.

రత్న అతన్ని ఆపి:

"ఇహ ఇలా మాట్లాడనులెండి. కాని, నాకు మాటి వ్వండి — పెళ్ళి చేసుకుంటానని" అంటూ చెయ్యి చాపింది.

రమేష్ మళ్ళీ ఇసుకలో కూర్చున్నాడు.

"ఎందుకు నన్నిలా బాధిస్తారు?"

"నేను మాత్రం తక్కువ బాధ పడుతున్నానా? నా మన సుకు కాస్త శాంతి నివ్వలేరా?"

"సరే! అలాగే చేసుకుంటాను. కాని, ఎప్పుడో చెప్ప లేను. నా మనస్సు కుదుటపడ్డాక చేసుకుంటాను. సరేనా? మీకు శాంతి కలిగిందా?"

అపారమైన తృప్తితో రత్న "ఊఁ." అంది.

ఒకదాన్ని ఒకటి తరుముకుంటూ వస్తున్న అలలవైపు చూస్తూ రమేశ్:

"మీ అడ్రస్ చెపుతారా?" అన్నాడు.

రత్న అదిరిపడి "ఎందుకూ?" అంది.

"మీరు ఊరికి వెళ్ళాక ఓ ఉత్తరం రాస్తాను."

రత్న జోరుగా తల అడ్డంగా తిప్పుతూ "ప్లీజ్ రమేష్! మీరు ఉత్తరాలేమీ రాయకండి. మనం పత్ర వ్యవహారం పెట్టుకుంటే ఇక్కడితో తెంచుకుందామనుకుంటున్న బంధం మళ్ళీ పెరగటానికి అవకాశ మివ్వటమే అవుతుంది"

"లేదు. అలా పెరగటానికి అవకాశమివ్వను. ఇక్కడ నుండి వెళ్ళాక ఒక్క ఉత్తరం మటుకు వ్రాయటానికి అనుమతివ్వండి" అంటూ బ్రతిమాలుకున్నాడు రమేష్.

రత్న ఖచ్చితంగా "ప్లీజ్ లేదు. మీరొక ఉత్తరం రాస్తే మర్యాదకైనా నేను జవాబు రాయాల్సి వస్తుంది. అందుకే మిమ్మల్ని రాయవద్దంటున్నా" అంది.

"ఇన్ని రోజులు మీ ఆతిథ్యాన్ని పొంది కృతజ్ఞతతో మీకో ఉత్తరం రాసే అవకాశం కూడా నాకుండనక్కర్లేదంటారా?"

రత్న నవ్వుతూ అతడివైపు చూసి "మీరు చెప్పాల్సిన థ్యాంక్సంతా ఇప్పుడే చెప్పేయండి" అంది.

"ఊహూ, నేను ఉత్తరమే రాస్తాను."

"అయితే ఓ పని చెయ్యండి. మీ కంతగా రాయాలనే ఉంటే డాక్టర్‌కు రాయండి. నా అభ్యంతరం ఏమీ లేదు."

రమేష్ కోపంతో అన్నాడు "మిమ్మల్ని బాగా క్రూరంగా అనిపిస్తోంది నాకు. నేను అనుకున్నంత మంచివారు కాదు మీరు."

"అలాగే అనుకోండి. మరీ సంతోషం. నేను మంచిదాన్నని ఏనాడూ చెప్పుకోలేదే."

"రత్నా!"

"అలా పిలువకండి. నా మనసు బలహీనమై మీరడిగిన దానికంతా ఒప్పేసుకుంటాను. మీ మంచి కోసమే నే నింత క్రూరంగా వర్తిస్తున్నాను."

ఇహ ఆమెను బలవంతపెట్టి లాభం లేదని ఊరుకున్నాడు రమేష్.

చీకటి పడుతూండగా ఇద్దరూ ఇంటికి బయలుదేరారు. ఇంటికి రాగానే రమేష్ తన వస్తువులు సర్దుకోసాగాడు. రత్న అక్కడే ఓ కుర్చీలో కూర్చుని, గడ్డానికి చెయ్యి ఆన్చి అతడినే చూస్తూ కూర్చుంది.

రమేశ్ గుడ్డలు పెట్టెలో సర్దుతూ రెండు మూడుసార్లు రత్నవైపు చూశాడు. కాని, ఆమె అతడి చూపును గమనించ లేదు, చాలా పరధ్యానంగా కూర్చుంది రత్న.

రమేష్ గుడ్డలు సర్దటం మానేసి రత్నవైపు సూటిగా చూశాడు. కాని, రత్న గమనించలేదు.

రమేశ్ తన పని మానేసి రత్న దగ్గరగా వచ్చి నిల్చున్నాడు.

రత్న తన ఆలోచనల్లోపడి, అతడు తన దగ్గరకు రావటాన్ని కూడా గమనించలేదు. రమేశు తన రెండు చేతులతోనూ ఆమె మొహాన్ని తన వైపుకు తిప్పుకుని—

"మీ ఆలోచనలలో నాకూ సగం వాటా ఉంది" అన్నాడు.

రత్న మౌనంగా అతడివైపు చూసింది, ఆమె కళ్ళలో

నిండిన నీరు బుగ్గలమీదుగా జారిపోయింది. రమేశు వ్యాకు లంతో—

"ఛ! ఏడుస్తున్నారా? తప్పుకదూ. ఇంతవరకూ నాకు ధైర్యం చెప్పి ఇప్పుడు మీరే కన్నీరు కారుస్తున్నారా? అదీ నాలాంటి దొంగకోసం!" అన్నాడు.

"దొంగా! మీరేం దొంగతనం చేశారు?"

"ఈ ఇంట్లోనుంచి రెండు అమూల్యమైన వస్తువులను ఇంటి యజమాని అనుమతిలేకుండా తీసుకుపోతున్నాను. అవే మిటో తెలుసా?"

రత్న తల అడ్డంగా ఊపింది.

"మొదటిది మీ హృదయం. రెండవది, ఆఖరుదీ ఇది..." అంటూ వంగి, రత్న బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు. రత్న అతడి నుదురు, కళ్ళు, తల, నోరు అన్నీ మృదువుగా చేత్తో తడిమి చూసింది.

"గుడ్డివాళ్ళు చేత్తో మొహాన్ని తడిమి చూసినట్టు చూస్తున్నారేం రత్నా?"

"మీ మొహాన్నెక్కడ మరచిపోతానో అని భయం నాకు. అందుకే సరిగ్గా చూసి గుర్తు పెట్టుకుంటున్నాను రమేశ్!..."

"ఏమిటి?"

"మీరు బొంబాయికి ఎందుకొచ్చారు?"

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. నేను రాకపోతేనే, మీరు హాయిగా ఉండేవారు."

"రేపటి నుండి మీరుండరు. ఇల్లంతా శూన్యంగా ఉం టుంది."

"మీరు ఎంతో ధైర్యం కలవారు అనుకున్నా; మీ ధైర్యమంతా మాటల్లోనే."

రత్న మాట్లాడకుండా లేచి నిల్చుంది.

"భోంచేద్దురుగాని రండి. రాత్రి రైల్లో నిద్రచెడకండి. పడుకుని, నిద్రపోవటానికి ప్రయత్నించండి. క్షేమంగా ఊరు చేరి నందుకు డాక్టర్ కు ఉత్తరం రాయండి."

"మీరు మళ్ళీ ఎప్పుడొస్తారో అటువైపుకు?"

"మీ పెళ్ళికి లేదా మీ కూతురి పెళ్ళికి తప్పకుండా వస్తాను" అంది రత్న.

రమేష్ కి వీడ్కోలివ్వటానికి అందరూ కార్లో స్టేషనుకు వెళ్ళారు.

మామయ్య వెళ్ళిపోతున్నాడంటే ఆశకూ-డా బెంగ గానే ఉంది. శేషగిరి కృష్ణమూర్తికి చెప్పమని ఏమేమో చెప్పు తున్నాడు. రత్న మాత్రం మౌనంగా కూర్చుంది.

రైలు కదిలింది. రమేశు రత్నవైపు చూశాడు. ఆ కళ్ళలో రత్నకేం కనిపించిందో ? వెంటనే తనను లోపలికి లాక్కుంటాడేమో ననిపించి రెండడుగులు వెనక్కి వేసింది.

రత్న తన కర్చీఫ్ ఊపింది. రమేశు ప్రతిమలా నిల్చు న్నాడు.

రైలు కనుమరుగవగానే అందరూ వెళ్ళి కార్లో కూర్చు న్నారు. శేషగిరి రమేష్ ని ఒకటే పొగుడుతున్నాడు...

"చాలా మంచి కుర్రాడు. మనతో బాగా కలిసి పోయాడు. కృష్ణమూర్తికి తగిన తమ్ముడు. అతడు ఇక్కడే ప్రాక్టీస్ చెయ్యాలని నా కెంతో ఆశగా ఉంది. కాని, ఎందుకో అతడికి నచ్చలా మరి..." అంటూ రత్నవైపు చూశాడు శేషగిరి.

రత్న కిటికీలోనుండి బయటకు చూస్తోంది.

ఆశ కారులోనే నిద్రపోయింది. శేషగిరి కూతుర్ని ఎత్తుకుని పక్కమీద పడుకో బెట్టాడు. కూతురికి దుప్పటి కప్పి రత్న వైపు చూశాడు.

రత్న పరధ్యానంగా గుడ్డలు మార్చుకుంది. శేషగిరి మంచంమీద కూర్చుని భార్యకోసం నిరీక్షిస్తున్నాడు. రత్న మెల్లిగా మందుల బీరువా దగ్గరకు వెళ్ళి తనకు కావలసిన మందు కోసం వెదకసాగింది.

"పడుకోవా రత్నా?"

శేషగిరి మౌనాన్ని భంగపరిచి అడిగాడు.

"మీరు పడుకోండి."

"నువ్వు?"

"నాకు చాలా తలనొప్పిగా ఉంది. నిద్ర మాత్ర తీసుకొని పడుకుంటాను."

"తలనొప్పికి తలనొప్పి మాత్ర తీసుకోవాలిగాని, నిద్రమాత్రెందుకు?"

"లేకపోతే నిద్ర రాదు నాకు. దయచేసి మాత్ర ఇవ్వండి."